# గుర్తుంచుకోండి, పోషణనిచ్చే సమపాళ్ళలోని ఆహారాన్నివ్వకపోతే జరిగేదిది-మీ పాప విటమిన్, మినరల్ వీటి లోపానికి గురికావచ్చు.

## "అందుకే నేను మా పాపకు సెరిలాక్ యిస్తాను."

విటమిన్‌లు, మినరల్స్ సమపాళ్ళలో ఉన్నట్టయితే పోషక పదార్థాలను హరించుకొనడంలో తోడ్పడతాయని మీకు తెలుసా. ఇది, మీ పాపాయి కొరతకు గురి కాకుండా చూస్తుంది.

మీ డాక్టర్‌ని అడగండి. ఈ విటమిన్‌లనూ, మినరల్స్‌నూ పొందేందుకు పోషణ రూపేణా సమతూకంలోని ఆహారమే ఉత్తమ మార్గమని మీ డాక్టర్ చెబుతారు. అటువంటి సమతూకమైన పోషకాహారంలో ప్రొటీన్లూ, కార్బొహైడ్రేట్లూ, కొవ్వుపదార్థాలు, ఇనుము, కాల్షియం కూడ సరైన పాళ్ళల్లో ఉంటాయి-ప్రతిసారి ఆహారం యిచ్చినప్పుడు, ప్రతి రోజు క్రమం తప్పకుండా.రోజు రోజూ లభించాలి.

చాలా మంది తల్లులకు మామూలుగా పారంపర్యంగా యిచ్చే ఆహారంతో యిలా సమతూక ఆహారం యివ్వడం సాధ్యం కాని పని.

దీనికి పరిష్కారం ?

సెరిలాక్. ఇది పాపాయిలకు యిచ్చేందుకు పోషణ రూపేణా సమతూకమైన ఘన ఆహారం వారికి నాలుగు నెలల నుంచి యిచ్చేందుకు.ఎందు కంటే, పిల్లలకు ఆ వయసు నుంచి పాలు ఒక్కటే చాలవు.

సెరిలాక్ ఎ.డి.సి.బి కాంప్లెక్స్ మరియు 'ఇ' విటమిన్లతో బలవర్థకం చేయబడింది. దీనిలో ప్రొటీన్లూ, కొవ్వు పదార్థలూ, కార్బొహైడ్రేట్లూ, ఇనుము, కాల్షియం కూడా ఉన్నాయి-అన్నీ మంచి సమపాళ్ళలో. దాని రుచి పిల్లలకు చాలా యిష్టం.

కాబట్టి, పోషణ నిచ్చే సమతూకంలోని సెరిలాక్ సమకూర్చే లాభాలన్నింటిని మీ పాపాయికి అందించండి. పాపాయికి 6 నెలలు రాగానే వీట్-ఆపిల్, వీట్-ఆరెంజ్, వీట్-వెజిటబుల్ యొక్క అదనపు ప్రయోజనాన్ని పాపాయికి సమకూర్చండి.

ప్యాక్ మీద యివ్వబడిన సూచనలను దయచేసి పాటించండి.

---

**ఉచితం సెరిలాక్ బేబీ కేర్ బుక్**

వ్రాయండి : సెరిలాక్, పోస్ట్‌బ్యాగ్ నం. 21, న్యూ ఢిల్లీ-110 029

---

నెస్లే వారి నాణ్యమైన ఉత్పాదన




మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

----- కూపన్ -----

**ఆగస్టు చతుర నవల మనీషి**

సమీక్షకుని పేరు : ........................................

చిరునామా : ........................................

........................................

........................................

........................................

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ **ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.**

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

## ప్రమాదం

"మీరు రచయిత కావడం కాదుకానీ మన ఇంటికి వచ్చేవాళ్లకి కాఫీ, టిఫిన్లు అందించలేక నాకు చావొస్తోంది." అంటూ ఖాళీ ప్లేట్లనూ, కాఫీ కప్పులనూ లోపలికి తీసుకెళ్లింది మా ఆవిడ.

నేను నోరు విప్పితే ఆవిడ మరింత రెచ్చిపోయే ప్రమాదం ఉందని మౌనం వహించాను.

మా కాలనీలో ఉంటున్నవారిలో ఎక్కువ శాతం రచయితలే. ఈ విషయం తెలియడంతో ఒకరినొకరు పరిచయం చేసుకుని తర



కవర్ పేజీ ఫొటోగ్రాఫర్: వికీహండా



చూ ఎవరో ఒకరి ఇంట్లో సమావేశమై సాహిత్య చర్చలు జరుపుకుంటున్నాం. ఆ క్రమంలో మా ఇంట్లో ఈ సమావేశాలు జరిగినపుడు వచ్చిన రచయితలకు కాఫీ, టిఫిన్లు ఏర్పాటు చేయక తప్పదుగదా! అదే మా శ్రీమతి కోపానికి హేతు వైందిప్పుడు.

పాలధరా, ఇతర సరుకుల ధరలూ పెరిగాయి. అయినా నా జీతం మాత్రం పెంచలేదు. దాంతో మా ఆవిడ సమయం దొరికినప్పుడల్లా ఇలా సణుగుతుంటుంది.

ఆవిడ వంటగదిలోకి వెళ్లిపోయాక దీనికి తరుణోపాయం ఏమిటాని ఆలోచించసాగాను.

ఇప్పటి వరకూ కాఫీ టిఫిన్లిస్తూ వచ్చి హఠాత్తుగా ఆపేస్తే సాటి రచయితలు ఫీలయ్యే అవకాశం ఉంది. అందుకని బాగా ఆలోచించి బ్రెడ్‌తో చవగ్గా తేలికగా పని జరిపించేయాలనే నిర్ణయానికి వచ్చాను.

షర్ట్‌వేసుకుని పర్స్ జేబులో పెట్టుకుని బయలుదేరాను.

మా కాలనీలోనే ఒక బేకరీ ఉంది. నరాసరి అక్కడకి వెళ్లి "మంచి బ్రెడ్ ఇవ్వు బాబూ" అన్నాను.

వెంటనే షాపతను ఒక బ్రెడ్ తెచ్చి కాగితం మీద పెట్టి పదునైన కత్తితో స్లైస్‌లు కోయసాగాడు.

అది ఏదో వీక్లీ కావడంతో దానివంక కుతూహలంగా చూశాను. వెంటనే ఇబ్బందిగా మొహంపెట్టి "చూడుబాబూ ఆ కాగితంమీద పెట్టి బ్రెడ్‌ను అలా కత్తితో కొయ్యకు. వేరే కాగితం తీసుకో" అన్నాను.

"ఏం సార్... ఈ కాగితానికి ఏమయింది?" అన్నాడతను బెదిరిపోతూ.

ఆ కాగితంలో నా కథ ఉంది. దాని మీద అతను బ్రెడ్‌పెట్టి పరపరాకోస్తుంటే నన్నే పరపరాకోసేస్తున్న ఫీలింగ్ కలుగుతోంది. కానీ ఆ విషయం అతనికి చెప్పడానికి మొహమాటపడ్డాను.

"ఆ వీక్లీలో నా స్నేహితుని కథ ఉందికానీ దాన్ని ఇలా ఇవ్వు" అన్నాను.

"ఓహో! అదా విషయం. ఇంకా మీరు ఈ కాగితం మురికిగా ఉందని అంటున్నారేమో అనుకున్నాను. అయినా ఈ రచయితల కాలనీలో షాపు తెరవడం బుద్ధితక్కువ పనయిపోయిందండీ" అన్నాడతను.

"ఏమయ్యా అలా అంటున్నావు. రచయితలెవరూ ఇటు రావడంలేదా? నీ వ్యాపారం బాగాలేదా?" అని ప్రశ్నించాను.

షాపతను పెద్దగా నిట్టూర్చాడు.

"ఏం చెప్పమంటారు సార్? మీలాగే చాలా మంది షాపుకువచ్చి బ్రెడ్ అవీ అడిగినప్పుడు ఏదన్నా పేపరులో ప్యాక్ చేస్తుంటే ఆగమంటారు. అందులో వద్దు వేరే కాగితంలో ప్యాక్ చెయ్యమంటారు. ఆఖరికి వేస్ట్ పేపరును కూడా వాడే వీలు లేకుండా పోయింది. ప్లాస్టిక్ సంచులు కొనాలంటే మాటలా?" అని మళ్లీ నిట్టూర్చాడతను.

నేను కూడా రచయితనేనని చెబితే అతను ఏమంటాడోనని భయపడ్డూ అక్కడినుంచి ఇవతలికి వచ్చేశాను. 'నేను రచయితని అని చెప్పుకోవడం ఒక్కోసారి ప్రమాదకరం' అని మా రమణ అంటుంటాడు. వాడు కూడా రచయితే. తనకు ఎదురయిన చేదు అనుభవం గురించి రమణ చెప్పాడొకసారి.

ఓసారి రమణ రైల్లో వాళ్ల ఊరికి వెడుతున్నాడు. అతనికి ఎదురుగా కూర్చున్న ప్రయాణీకుడు రమణ రాసిన నవలే చదువుతున్నాడు.

తన నవలను అతనంత ఏకాగ్రతతో చదవడం గమనించి పొంగిపోయాడు రమణ.

కాసేపయ్యాక ఇక ఉండలేక "మాస్టారూ ఆ నవల ఎలా ఉంది?" అనడిగాడు ఆ ప్రయాణీకుణ్ణి.

"అడక్కండి సార్... ఇంత పరమ చెత్త

నవలను నేను ఎప్పుడూ చదవలేదు'' అన్నాడట ఆ వ్యక్తి తక్కున.

దాంతో రమణ మొహం మాడిపోయింది. అయినా తన నవలలో లోటుపాట్లు ఏమిటో తెలుసుకోవడంకోసం "చెత్త అంటే చాలదు మాస్టారూ. మీకు శైలి నచ్చలేదా, ఇతివృత్తం నచ్చలేదా లేక పాత్రల అల్లిక బాగోలేదా? నవల పూర్తిగా చదవకుండా మీరు చెత్త అంటే ఆ రచయిత విని బాధపడడూ" అన్నాడు.

"బాధపడితే పడనీండి. నా డబ్బు నష్టమయింది. మరి నా బాధ ఎవరు తీరుస్తారు?" అనడిగాడు ఆ ప్రయాణికుడు.

"అలా మీరు చింతించవద్దు. ఆ పుస్తకం ఇలా ఇచ్చెయ్యండి. మీ డబ్బులు నేనిస్తాను" అన్నాడు రమణ.

"ఈ తద్దినం మీకెందుకు లెండి. ఖర్మకాలి కొన్నందుకు అనుభవించక తప్పదుగా. దానికి బదులు మీరు చిన్న సాయం చెయ్యండి. మీకు తెల్సిన వాళ్లందరికీ ఈ నవల కొనవద్దని చెప్పండి. ముందు మీరు నవల పేరు, రచయిత పేరు నోట్ చేసుకోండి" అంటూ ఆ ప్రయాణికుడు అమాంతం సదరు నవలని రైలు కిటికీలోంచి బయటకు విసిరేశాట్ట. ఇదంతా నాకు చెప్పి - "నవల వెనుక రచయిత ఫోటో ప్రింట్ చేస్తే ఇలాంటి అనర్థాలు కలగవుకదా" అన్నాడు.

"వద్దు... అది మరింత ప్రమాదకరం" అన్నాన్నేను వెంటనే.

— వినాయకరావు

## "గో... స్లో... !"

అర్జంటుగా అనకాపల్లి వెళ్లాల్సిన అప్పారావు ఉదయాన్నే విశాఖపట్నం రైల్వేస్టేషన్‌వైపు పరుగులు తీస్తున్నాడు. ఆరోజు బస్సులన్నీ స్ట్రయికు. ఎట్టి పరిస్థితులలోనయినా ఉదయం అతను అనకాపల్లిలో ఉండాలి. 10 గం॥లకు పెళ్లిచూపులు. అది చాలా చాలా మంచి ముహూర్తం. సంబంధం కూడా చాలా చాలా మంచిది. అదీ అతని గాబరాకి కారణం. చెమటలు కక్కుకుంటూ స్టేషన్‌లోకి వచ్చిపడ్డాడు. రైల్వేస్టేషన్ మహాసందడిగా వుంది. ప్లాటుఫారంమీద 'కోరమండల్ ఎక్స్‌ప్రెస్' బయల్దేరడానికి సిద్ధంగా ఉంది. అది తప్ప అనకాపల్లి వైపు వెళ్లే ట్రయిన్స్ మధ్యాహ్నంవరకూ మరి లేవు. అనకాపల్లిలో కోరమండల్ ఆగదు. ఇప్పుడు ఏంచెయ్యాలా అని ఆలోచిస్తూ గబగబా డ్రయివరు దగ్గరకెళ్లాడు. వెళ్లి "నమస్కారం" అన్నాడు. ఏంకావాలి అన్నట్టు కనుబొమ్మలు ఎగరేశాడు డ్రయివరు. అప్పారావు దీనంగా ముఖంపెట్టి "నేను అర్జంటుగా అనకావల్లి వెళ్లాలి సార్. దీని తర్వాత ట్రయిన్స్ లేవు. బస్సులు స్ట్రయికు. మీరే దయచూడాలి" అన్నాడు. అర్థంకానట్టు ముఖం పెట్టాడు డ్రయివరు.

"మరేంలేదు సార్... ఈరోజు పదిగంటలకి నాకు పెళ్ళిచూపులు. వెళ్లకపోతే చాలా ఇబ్బంది. మీరే కనికరించాలి సార్... సార్..."

"నన్నేం చెయ్యమంటావయ్యా" విసుగ్గా అన్నాడు డ్రయివరు.

"ఏంలేదుసార్... ట్రయిను అనకాపల్లిలో ఆపాలి" అన్నాడు. అనగానే ఫకాలున నవ్వి అప్పారావు వైపు జాలిగా చూశాడు డ్రయివరు.

"బాబ్బాబు... అలా చూడకండి. నాకు తెలుసు కోరమండల్ అనకావల్లిలో ఆగదని. పోనీ ఆపడానికి వీలుకాకపోతే కొద్దిగా స్లో చెయ్యండి చాలు. నేను దిగిపోతాను. ఈ సహాయం చేసి పెట్టండి చాలు. మీ మేలు మర్చిపోలేను" అంటూ బతిమాలడం మొదలుపెట్టాడు.

"అలా కుదరదయ్యా. నా ఉద్యోగం పోతాది" అంటూ డ్రయివరు నసిగాడు. అప్పారావు వెంటనే జేబులోంచి ఒక వందనోటుతీసి డ్రయివరు చేతిలో పెట్టి చేతులు నలిపేశాడు. చివరికి ఈ బాధ భరించలేక డ్రయివరు- "సర్లే... స్లో చేస్తాను- జాగ్రత్తగా దిగు" అన్నాడు.

యురేకా అంటూ జనాల్ని గుద్దుకుంటూ పరిగెత్తికెళ్ళి కాస్త ఖాళీగా వున్న కంపార్టుమెంటు ఎక్కేశాడు. ట్రయిను బయల్దేరింది. ట్రయిను స్లో అయితే ఎలా దిగాలో, ఎక్కడ దిగాలో మనసులోనే రిహార్సులు వేసుకున్నాడు. ట్రయిను అనకాపల్లి స్టేషను సమీపించింది.





అప్పారావు గుమ్మం దగ్గిరకు వచ్చి నిలబడ్డాడు. ట్రయిను వేగానికి కళ్లు తిరుగుతున్నట్టుగా అనిపించింది. గుమ్మాన్ని గట్టిగా పట్టుకుని దేముణ్ణి ప్రార్థించాడు. ప్లాటుఫారం సమీపించేసరికి కొంచెం స్లో అయింది. ఒక మెట్టు దిగాడు. చకచకా ప్లాటుఫారం వెనక్కి పారిపోతోంది. ట్రయిను ఇంకా స్లో అయింది. మరో మెట్టు దిగాడు. మరికాస్త స్లో అయింది. ఊపిరి బిగబెట్టి 'ఉఫ్'మంటూ దూకేశాడు. డ్రయివరు స్లో చేస్తూ ప్లాటుఫారంవైపు చూస్తున్నాడు. అప్పారావు దూకగానే స్పీడు పెంచాడు. దూకిన వెంటనే పడిపోకుండా అప్పారావు వేగంగా పరిగెత్తడం మొదలుపెట్టాడు. కంపార్టుమెంటు మరో ద్వారం దగ్గిర నిలబడ్డ పెద్దమనిషి అప్పారావు పరిగెత్తుకుంటూ తన దగ్గిరకు రాగానే చెయ్యిపట్టుకుని లోపలికి లాగేశాడు- "ఏమయ్యా ఈ ట్రయిను అనకాపల్లిలో ఆగదని నీకు తెలియదా? అలా పరిగెత్తుకొస్తున్నావు. నేను లోపలికి లాగబట్టి సరిపోయింది" అంటూ కోప్పడుతున్నాడు.

ఏం అనాలో తోచక అతని ముఖంవంక వెర్రిగా చూస్తుండిపోయాడు అప్పారావు. అప్పటికే ట్రయిను వేగం పుంజుకుంది.

— బళ్ళా షణ్ముఖరావు

# చతుర

సంపుటి: 14
సంచిక: 7
ఆగస్టు 1991


మానవుడే మహనీయుడు - మానవుడే మాననీయుడు! మనిషి మనీషిగా ఎదిగినప్పుడే అందరి మన్ననలందుకుంటాడు. అమరుడవుతాడు.

ఆయన... నిష్క్రమణ! ఆబాలగోపాలాన్ని కదిలించింది, కంటతడి పెట్టించింది. లేవలేక మంచాల్లో ఉండిపోయినవాళ్లు కూడా ఆయన అంతిమ దర్శనార్థమై వచ్చారు. పశువులు సైతం గడ్డిపరకైనా ముట్టకుండా పలుపుతాడు తెంచుకోడానికి ప్రయత్నిస్తూ- 'అంబా... అంబా' అని విలపిస్తున్నాయి.

''ఇది నిజమేనా? ఎట్లా జరిగింది?''

''ఇలాంటి మనిషి మళ్ళీ పుడతాడా?''

''మా అయ్యకోసం గొడ్లు అల్లాడిపోతున్నాయి. ఎప్పుడొత్తాడా అనుకుంటుంటే ఇట్టావచ్చాడు''

ఇలా తలొకరకంగా వ్యాఖ్యానిస్తున్నారు.

ఇంతకీ ఆయన ...గీతాకారుని ప్రభోదాలు విని ఆచరించిన స్థితప్రజ్ఞుడు కాడు, మహాత్ముడు కాడు, నాయకుడు కాడు, కవి కాడు, రచయిత కాడు, కళాకారుడు అసలేకాడు.

మరి ఏమీకానివాడు... ఏం చేసి ఇంతగా తోటివారి ఆదరాభిమానాలు పొందగలిగాడు? అయినవాళ్ళు విలవిల్లాడితే వింతలేదుకానీ ఊరు ఊరంతా కంటతడిపెట్టడానికి కారణం? ఎందుకందరూ అంతలా తపిస్తున్నారు? రోదిస్తున్నారు? ఏమిటి అతనిలోని ఔన్నత్యం?

**ఉత్తమ వ్యక్తిత్వపు విశ్లేషణచేస్తూ నిరాడంబరానికీ, ఆప్యాయతలకీ అనురాగాలకీ పట్టం కట్టిన పి. చంద్రశేఖర అజాద్ రచన మనీషి ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.**



నగరమంతా నిర్మానుష్యంగా ఉంది. రోడ్లన్నీ అలవాటైన పదఘట్టనలూ, వాహనాల కదలికలూ లేక విలపిస్తున్నాయో, విశ్రాంతి తీసుకుంటున్నాయో అర్థంకావటంలేదు.

గాలిసైతం దొంగలా కదులుతోంది

అప్పుడప్పుడు ఓ వాహనం ఆ రోడ్లవెంట పరుగులు తీస్తోంది.

అందులోనుండి...

నాలుగు దిక్కులకూ గురిపెట్టబడి ఉన్నాయి తుపాకులు

అది యుద్ధదృశ్యం!

ఆ కళ్లలోనూ... మెదడులోనూ ఒకే వేగం...

అదే...

కనిపిస్తే కాల్చేయటం

కర్ఫ్యూ... కర్ఫ్యూ

అసలు నగరంలో మనుషులున్నారా?

ఏమైపోయారు ఇన్నిలక్షలమంది?

తలుపులన్నీ మూసిఉన్నాయి. ఎలాంటి శబ్దాలూ లేవు.

ఎక్కడో ఓ కుక్క దారుణంగా ఏడుస్తోంది.

ఈ ప్రపంచానికి ఏదో జరగబోతూంది.

ఏ ప్రళయమో ముంచుకురాబోతూంది.

చౌరస్తాల నడుమ ఆగిన వాన్‌నుండి బిలబిలమంటూ దిగుతున్నారు

లయ... వేగం... బూట్ల చప్పుడు... బందూకుల సవ్వడి...

అంతలోనే నిశ్శబ్దం

అలాంటి భయానక వాతావరణంలో...

ఆ మేడమీద...

చిరుగాలి ధైర్యంచేసి ముందుకు కదిలింది

వేలాడుతున్న ఆ లాల్చీని స్పృశించింది

ఒక్కసారిగా కదలిక...

మెల్లగా... మెల్లమెల్లగా... స్వేచ్ఛగా గాలివీస్తోందక్కడ

ఆ లాల్చీ ఎగురుతోంది...

గాలికి రెపరెపలాడుతోంది

ఆ లాల్చీ వీపు వెనకభాగం

చిరిగిపోయివుంది!

మేడమీదకు వెళ్లాడు'రావ్'.

ఆయన ముఖం గంభీరంగా ఉంది. ఒక్కసారి వెళ్లి కిటికీ తలుపు తీశాడు. నగరంలో ఓ భాగం కనిపిస్తోంది. అలాంటి మంచి దృశ్యంకోసమే ప్రత్యేకంగా ఈ స్థలం ఎన్నుకున్నాడు. డబ్బు కొంత ఎక్కువే అయింది. అయినాసరే తను కోరుకున్న రీతిలో ఇంటిని నిర్మించుకున్నాడు. అందులో తన గదిని మరీ ప్రత్యేకంగా. రోజూ కొద్దిక్షణాలు అక్కడ నిలబడి నగరపు అందాల్ని వీక్షించటం అతని అలవాటు. ఎప్పటిలానే తలుపు తెరిచాడు...

అదే దృశ్యం...

కానీ ఆనందం కలిగించటంలేదు... గుండెను ఎవరో నొక్కిపట్టి ఉంచినట్లనిపించింది.

అతనికి 'అమ్మ' గుర్తుకువస్తోంది.

పెదవులు మెల్లగా "అమ్మా" అనటానికి ప్రయత్నంచేశాయి. శబ్దంరాలేదు. కొద్దిగా వణికాయి. ఆ ప్రతిస్పందన శరీరమంతా పాకగా.. కళ్లనుండి రెండు కన్నీటిబొట్లు...

ఫోన్ మోగింది...

తనను తాను కంట్రోల్ చేసుకుంటూ ఫోన్ అందుకున్నాడు

అవతలనుండి ఎవరో మాట్లాడుతున్నారు.

నిశ్శబ్దంగా వింటున్నాడాయన...

కొద్దిసేపటి తర్వాత తను మాట్లాడాడు.

"అవును... ఏర్పాట్లు చేయాలి"

"కష్టమే... నాకు తెలుసు. అయినా తప్పదు. మరలా ఫోన్ చేస్తారుగా"

"ఉంటాను"

ఫోన్ పెట్టేసి పక్కకు చూశాడు.

గదిముందు సులోచన నిలబడింది. ఆమె కళ్లలో ప్రశ్నలు...

"గంగాధర్ ఫోన్ చేశాడు" అన్నాడు రావ్.

ఆమె గదిలోపలకి నడిచివచ్చింది నిశ్శబ్దంగా... తెరిచిన తలుపులు మూసేసింది.

"ఎందుకు ఆ తలుపులు మూస్తున్నావ్ సులోచనా"

"తెరిచిఉంచేరోజులా ఇవి"

"గాలి వస్తుందని..."

"గాలే వస్తుందో... తుపాకి తూటాలే వస్తాయో ఎవరు చూశారు" నిర్లిప్తంగా అందామె.

రావ్ తలూపాడు.





"కిందకు వెళ్దాం రండి" అందామె.

"నాకెందుకో ఇక్కడే ఉండాలనిపిస్తూంది. కింద ఎవరెవరున్నారు?"

"పనిమనుషులున్నారు. సాంబ్రాణి కడ్డీలు వెలిగించి పెట్టించాను"

తలూపాడు.

కొంచెంసేపు చూశాక అందామె-

"నేను కిందకు వెళ్తాను"

"అలానే... నాకు కొంచెంసేపు ఏకాంతం కావాలి"

ఆమె నిశ్శబ్దంగా మెట్లు దిగి వెళ్లిపోయింది.

"సాంబయ్య లేచాడంటే" భూషయ్య అరిచేడు.

"లేచాడుగా..." పెద్దగానే చెప్పింది లోపల నుండి పనిచేసుకుంటూనే.

"మరేమైపోయాడు... అవతల పొద్దెక్కిపోవ ఉంలా" అంటూ అటూ ఇటూ చూశాడు.

సాంబయ్య అప్పటికి గానుగచెట్టు దగ్గరికి వెళ్లి ఓ పుల్ల తెంచుకున్నాడు. దానికేసి పరీక్షగా చూసి సంతృప్తిచెందాక నోట్లో పెట్టి నవలటం ఆరంభించాడు. దొడ్లో గేదెలదగ్గర భూషయ్య వంగేడు. రొచ్చు రొచ్చుగా ఉందక్కడ. అప్పటికే భీముడు పనిచేస్తున్నాడు.

'ఒరి భీవుడూ... నేను చేస్తాగానీ సాంబయ్యగాడు ఏవైపోయాడో చూసిరా" అన్నాడు.

"ఆఁ" అని చేస్తున్న పనాపి భీముడు, సాంబయ్యకోసం బయలుదేరాడు. ఓ మూలన కూర్చుని తాపీగా పందుంపుల్ల నవులుతున్న సాంబయ్యను చూసి "ఏంది బాబూ... ఇక్కడ కూర్చున్నారేంటీ... అయ్యగారు పిలుత్తున్నారు" అన్నాడు.

"మొఖం కడుక్కుంటున్నారా" అన్నాడు సాంబయ్య.

"ఏందిరా మొఖం కడిగేది. ఎంతసేపు కడుగుతావురా. ఆ గొడ్డకాడ పేడకళ్లు తియ్యమన్నానా" అరిచాడు ఎప్పుడొచ్చాడో భూషయ్య.

ఉలిక్కిపడి లేచి నిలబడి ఏవనాలో తెలీక పళ్లు రుద్దటం మొదలుపెట్టాడు.

"తొందరగా తెవులు. నేనూ భీవుడూ చేనుకాడికి ఎల్లాల" అని వెళ్లిపోయాడు.

భీముడు కూడా మాట్లాడకుండా వెనక్కి తిరిగి వెళ్ళాడు.

సాంబయ్యకు కోపంవచ్చింది.

తనకు గేదెలదగ్గర పనిచేయటం అంటే ఏమాత్రం ఇష్టం ఉండదు. అసలు ఆ వాసన అంటేనే గిట్టదు. సాయంకాలం అయ్యేసరికి శుభ్రంగానే ఉంటుంది. దోమలు వాటిని కుడుతుంటే భూషయ్యగారు తెగ బాధపడిపోతారు. వెంటనే పొగపెట్టిస్తాడు. ఆ పొగకి దోమలు వెళ్లిపోతే అవి హాయిగా విశ్రమిస్తాయని ఆయన తృప్తిపడతాడు.

వాటికి పడుకోబోయేముందుకూడా ఎంకావాలో చూసి, గడ్డి సరిపడా ఉందా లేదా అనేది పరిశీలించి, అవసరమైతే వామునుండి దూసివేసేదాకా ఆయనకు నిద్ర పట్టదు.

నిద్రపోయినా ఏ నడిఝాములోనో లేచికూచుంటాడు...

ముందు మెల్లగా దగ్గుతాడు.

అప్పటికి తులసమ్మకి కూడా మెలకువ వస్తే సరి... లేకపోతే తనే లేచి గేదెల చావిడిదగ్గరకు వెళ్తాడు. ఆసరికే అక్కడ బీభత్సంగా ఉంటుంది.

చేతిలో కర్రతో గడ్డిని అటూ ఇటూ కదుపుతాడు. కొంచెంసేపు చూసి తిరిగి వచ్చి మంచంమీద కూర్చుంటాడు.

ఆ శబ్దానికి తులసమ్మకి మెలకువ వస్తుంది.

"మంచినీళ్లు అయిపోయాయా?" అంటుంది.

"లేదు. మెలకువొచ్చింది. గొడ్లకాడికెళ్లి చూసొచ్చా"

"ఎందుకా చీకట్లో... ఆ భీవుడ్ని లేపకూడదూ"

"ఆడికి మాత్రం చీకటికాదా... అయినా పొద్దుననంగా లేచి పనిసేసుంటాడుకదా! ఆద మరిచి నిద్రపోతాడు. ఆణ్నెందుకు ఇబ్బందిపెట్టడం" అని దుప్పటి సరిచేసుకుంటాడు.

"ఇప్పుడే కంటిమీద కునుకు పడతాఉంది.



ఇంక ఎంత తన్నుకున్నా నిద్రపట్టిచావదు'' అంటుంది తులసమ్మ.

''ఇంకేంనిద్రపోతావే... ఇంకొంచెంసేపట్లో కోడి కూసుద్ది''

''మరింకేం... కొంచెంసేపన్నా కళ్లు మూసుకు పడుకోకూడదూ'' అంటుంది.

ఏదో గొణుగుతూ మంచంమీద నడుం వాలుస్తాడు.

''దీని సిగదరగ... నడుం నొప్పివస్తుంది... మంచవంతా కుక్కికుక్కి అయింది. దీనిసంగతి చూద్దామంటే కుదిరిచావటంలా'' అని గొణిగి ఆకాశంకేసి చూస్తాడు. ఆకాశంలో చుక్కలు మెరుస్తుంటాయి. సాధ్యమైనంతవరకూ బయటే పడుకుంటాడు.

''ఎందుకక్కడ లోపలకి రాకూడదూ'' అంటుంది.

''కమ్మటి గాలిడిసిపెట్టి లోపలకి రమ్మంటావేంటే...'' అని అక్కడే పడుకుంటడు.

వానాకాలంలో కూడా అంతే. తులసమ్మ కూడా ఆయన్తోపాటు బయటే పడుకుంటుంది. రెండు చినుకులు పడగానే లేచి తన మంచం లోనికి ఈడ్చుకుంటుంది. ఆయన్ని రమ్మని అడుగుతుంది...

భూషయ్య వినడు.

"రెండు చినుకులకే మొక్క మొల వంలేవే... అయినా ఇది కురిసిచచ్చే వానకా దు. ఇంక చూడు ఉడకపోసుద్ది" అంటూ అలానే పడుకునేవాడు. సాధారణంగా చిన్న చిన్న చినుకుల్ని ఏమాత్రం ఖాతరుచేసేవాడు కాదు. వాన మరీ పెద్దదయినా చూరుకిందకి మంచం ఈడ్చుకొని పడుకునేవాడు. రాత్రి పూటే వాళ్లిద్దరి సంభాషణ నడిచేది.

"అబ్బ... పాడు దోమలు... నిద్రలేక చంపుతున్నాయి" అంటూ ఎవరితోనో అన్నట్లు లేచి కూర్చునేది.

భూషయ్య మాట్లాడేవాడు కాదు.

"ఇదిగో నిద్రపోతున్నావా?" అనేది.

"లేదులే చెప్పు"

ఆ సాంబయ్యగాడ్ని గొడ్డకాడ పనిచెయ్యి పనిచెయ్యి అని పానాలు తోడతావెందుకు?"

"మరేంచేయాలంట?"

"ఏంచేసేదేముంది? వాడు బళ్లోకి వెళ్లి చదువుకుంటున్నాడు. ఆడ్ని ఇంకా బాగా చదువుకోరా అనాల్సిందిపోయి ఆ పేడ తియ్యి... ఆ గాబు కడుగూ అంటూ ఊరికే సతాయిస్తావెందుకు?" అంది.

"ఏందేవ్... ఆడేవన్నా రాజుగారబ్బాయను కున్నావా? భూషయ్య కొడుకు. ఆడికి గొడ్డకాడ పనిచేయటానికి నామోషి వచ్చిందా? దేశంలో ఈడొక్కడే చదువుకుంటన్నాడా ఏమిటి? అందరూ పనులు చేసుకుంటున్నారు.

"ఆడుమాత్రం చెయ్యటంలేదా? చేస్తానేఉన్నాడుగా..."

"చేస్తన్నాడులే... నువ్విట్టాంటివి ఆడికి నేర్పబాక... గొడ్డకాడకాదు... పాకీపని చేయాల్సొస్తది..."

"నా అబ్బాయికి అలాంటి కర్మేం పట్టలా" అంటుంది తులసమ్మ ఉక్రోషంగా.

"ఓసోస్... కబుర్లు చెప్పబాకవే. తెల్లారికల్లా ఏమవుతుందో ఎవరు చూడొచ్చారు. రాజ్జాలేలాలో... అడుక్కు తినాలో మనవే చెప్పేస్తంటే సంవత్సరానికి ఆరు పంటలు పండిపోవంటే"

తులసమ్మ ఏదో గతుక్కుంది.

"సర్లే పడుకో... అయినా మాడుచెక్కలు తిన్నోడు మహారాజయ్యాడని పెద్దాళ్లు ఊరికే చెప్పలా. మనింటో పనిచేసుకోవటానికి ఇప్పటి నుండే బాధగా ఉంటే రేపు ఆడు ఏమవుతాడో వేరే సెప్పాలా... నీకు తెలుసుగా మన షావుకారి కొడుకు ఇట్టాంటి ఏసాలేసి అటు చదువూరాక, ఇటు ఈ పనులు రాకా ఆడి బాబు సంపాయించిందంతా తగలేత్తా కూకున్నాడు"

"ఆళ్ల సంగతి మనకెందుకులే. మన సాంబయ్య అట్లాంటోడు కాదు. ఆడు బాగా చదువుకుంటాడు. పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తాడు. అయన్నీ చూట్టానికి మన కళ్లు చాలవను కో"

"జోడు కొనిచ్చుకుందువుగానిలే తులసమ్మా" అంటాడు భూషయ్య.

"చాల్లే సడసం... అర్ధరాత్రి అంకమ్మ శివాలని... ఇంక పడుకో"

వాళ్లిద్దరూ అలా మాట్లాడుకుంటున్నప్పుడు సాంబయ్యకు మెలకువ వస్తుంది. వారి మాటల్లో తన గురించి ఏమైనా ఉంటుందేమో అనే ఆసక్తి కలుగుతుంది. మొత్తంమీద ఎప్పుడో ఓసారి తన విషయం ప్రస్తావనకు వచ్చితీరుతుంది.

అమ్మ తన నాన్నదగ్గర అలా మాట్లాడుతుందిగానీ, తనతో మాట్లాడేటప్పటికి ఆమె పద్ధతి మారుతుంది.

"సాంబయ్యా..." అంటూ పిలిచింది.

అప్పటికి మొఖం కడిగి కండవాతో తుడుచుకుంటున్నాడు.

"ఇంకా అలా కూర్చుండిపోతే ఎట్టారా... మీ నాయన గేదలకాడ పనుందని గొడవ పెడుతున్నాడా? గబగబా వెళ్లి ఆ రెండు పేడకళ్లూ తియ్యొచ్చుగా. అయినా మీ నాన్నని చూసి నేర్చుకోవాలి బాబూ. ఝాము పొద్దుండగానే లేస్తాడా... లేచిందగ్గర్నుంచి క్షణం ఖాళీగా కూర్చుంటాడా... ఎప్పుడూ ఏదో ఒక పని చేసుకుపోతుంటాడు. మన పని మనం చేసుకోవటంలో తప్పులేదు. అయినా మనం ఉన్నవాళ్లం కాదు. మాకు నువ్వొక్కడివి. నీకు చదువూ సంజా చెప్పిస్తేచాలు. వెళ్లు వెళ్లు" అంటూ వత్తిడిచేసింది.




సాంబయ్యా మాట్లాడకుండా వెళ్లి ఆ పేడను చేతులతో ఎత్తుతుంటే కడుపులో తిప్పేట్లు వాసన...

తన బిడ్డ పనిచేస్తుంటే భూషయ్యా కొంచెంసేపు చూసి...

"ఏంటిరా... బేరం చేత్తన్నావా... ఉండెహె" అంటూ దూసుకొచ్చి... గొడ్లు తొక్కిన గడ్డినంతా మడిచి దాంతోనే పేడకళ్లు చుట్టి అమాంతం పెంటపోగుమీద విసిరి పాలికట్ట అందుకున్నాడు.

గాబునిండా నీళ్లు పోసి అందులో తవుడూ, చిట్టూ కలిపి గేదలు తాగుతుంటే ఆయన కళ్లలో అనిర్వచనీయమైన ఆనందం...

"సాంబయ్యా..." పిలిచాడు.

"ఏంటినాన్నా?"

"బడికి ఎల్తావంటరా?"

"అవున్నాన్నా"

"నర్లే... నీళ్లు పోసుకొని వెళ్లు"

సాంబయ్య ఉత్సాహంగా ఇంట్లోకి వెళ్లాడు.

"ఏంటిరా? అప్పుడే అయిపోయిందా?" అంది తులనమ్మ.

"లేదమ్మా... నాన్న బడికి వెళ్లమన్నాడు"

తులనమ్మ ముఖంలో సంతోషంతో కూడిన దరహాసం.

"అవునుబాబూ... మీ నాన్న అన్నీ నీమంచికే చెబుతాడు. ఆయన ఏంచెబితే అది చెయ్యి. ఆయన మనసుని కష్టపెట్టబాకు" అంది.

సాంబయ్య తలూపాడు.

తన నాన్నంటే అభిమానం, ప్రేమా, ఆయన పట్ల నిశితమైన పరిశీలనా ఆరంభం అయ్యాయి సాంబయ్యలో.

★ ★ ★

భూషయ్యగారిది మధ్యతరగతి కుటుంబం.

భూషయ్యకి ఓ తమ్ముడూ, ఇద్దరు అక్కలూ ఉన్నారు. ఓ అక్కావాళ్లు మాత్రం పొలాలు కొనుక్కొని బళ్లారి వెళ్లిపోయారు. వారిదగ్గర నుండి పెద్దగా వార్తలు రావు. తమ్ముడు కూడా కొంతకాలంపాటు ఈ ఊర్లోనే ఉన్నా ఆ తర్వాత తన వంతుకు వచ్చిన భూమిని అమ్ముకొని బళ్లారి చేరిపోయాడు.

భూషయ్యమాత్రం అందుకు అంగీకరించలా.

"ఈ ఊర్లో బతకలేకపోతేగదంటే ఇంకో చోటికి బోవాలి. అయినా నాకు ఒక్కగానొక్క కొడుకు. ఆడికోసం నేను పుట్టిపెరిగిన ఊరొదిలిపోతానా" అనేవాడు.

ఒక ఊళ్లో ఉన్నారనేగానీ తన అక్కను వారాని కోసారి చూడటం గగనమే. ఎవరిపనుల్లో వారు మునిగిపోయేవారు.

భీముడ్ని పొలంపనులకీ, ఇంటి పనులకీ మాట్లాడుకున్నారు. భీముడితోపాటు, భీముడి కంటే భూషయ్యగారే ఎక్కువ పనిచేస్తాడు. ఆయన చేతిలో ఎప్పుడూ కర్ర ఉంటుంది. వంటిమీద చొక్కా ఉండేదికాదు. ఓ కండవా మాత్రం భుజాన ఉండేది. ఒక్కోసారి దాన్ని తలపాగాలా చుట్టుకునేవాడు. నేలకి కర్రా నించుకుంటూ నడిచివస్తుండేవాడు.

ఆ ఊర్లో అందరూ భూషయ్యగారిలా ఉంటారనేంలేదు. పొందూరు ఖద్దరు, ధరించి నల్లటి గ్లానులు పెట్టుకొని, మోటార్ సైకిళ్ల మీద వరుగులు తీసేవారి దగ్గరనుండి ఖద్దరు బట్టలు ధరించేవారి వరకూ ఉన్నారు.

"ఎండలోబడి పనిచేసేవారికి చొక్కాయిలెందుకురా... అయన్నీ ఖాళీగా తిరిగేవారికిరా" అంటూ కొట్టేసేవాడు.

ఆయన పంచెలుకానీ, కండవాలుగానీ నీరుకాయలెక్క ఎర్రగా కనిపించేవి. తను పనంతా చేసివచ్చాక పీట వాల్చుకుని కూర్చుంటే తులనమ్మ అన్నం వడ్డించేది. తనకి కొంచెందూరంలో భీముడు పళ్లెం పెట్టుకొని కూర్చునేవాడు. దాంతోపాటు పంపులో చెంబు నిండా నీళ్లు పట్టుకొని తెచ్చుకునేవాడు.

ఆయనకు భోజనంలో ఏముంది, ఏంలేదు అనే సమస్య ఉండేదికాదు. ఎక్కువగా పచ్చడితో తినేవాడు.

"నువ్వా పచ్చడి మానమంటే మానవు. గుండెల్లో మంటలు లేస్తాయి" అని సణుగుతూనే ఉంటుంది తులనమ్మ...

పళ్లెంనిండా మజ్జిగ పోయించుకొని అందులో ఉల్లిపాయ నంజుకుంటూ జుర్రుకు

తినేవాడు.

అన్నం తిని పక్కన ఊరికే కూర్చునేవాడుకాదు. ఏ తాడో పేనుతూ ఉండేవాడు. తులసమ్మ వస్తూ అనేది-

"నువ్వు మాత్రం క్షణం ఖాళీగా కూర్చోవు. ఇప్పుడా తాళ్లు పేనకపోతే ఏమవుతుంది" అంటూ

అదేం పట్టనట్లుగా భీముడితో ఏదో చెబుతూనే ఉండేవాడు.

★ ★ ★

ఆ ఊరేం పెద్దది కాదు. అక్కడ ఏడు తరగతులవరకూ ఉన్న బడి మాత్రం ఉంది. ఆ తర్వాత రెండుమైళ్లు నడిచి వెళ్తేగాని ఇంకో బడి లేదు. ఆ ఊరి పిల్లలందరూ సంచిలో పుస్తకాలూ... క్యారియర్‌లో భోజనం తీసుకొని వెళ్తుంటారు. అక్కడకూడా కొంతవరకే ఉంది.

అంతకుమించి చదవాలంటే పట్నం వెళ్లాల్సిందే. కొంతమందయితే తమ తమ పిల్లల కోసం కాపురాలు మారుస్తున్నారు. వారందరూ వ్యవసాయం చేయటం కూడా మానుకుని తమ పొలాల్ని కౌలికిస్తున్నారు.

సాంబయ్య ఇంకా ఈ ఊర్లోనే చదువుకుంటున్నాడు. ఆ రోజు బడి అయిపోయాక ఇంటికి వస్తున్నప్పుడు పిల్లలందరూ బట్టల విషయం గురించి మాట్లాడుకున్నారు.

"మా నాన్న కొత్తబట్టలు తెచ్చుకున్నాడురా" అన్నాడు పిల్లవాడు.

అవెంత బాగున్నాయో, ఆ తర్వాత తనకు ఎలాంటి బట్టలు తెస్తాడో వివరంగా చెప్పాడు.

సాంబయ్య మాత్రం వింటుండిపోయాడు. సాంబయ్య అసలుపేరు సాంబశివరావు అయితే ఇంట్లోనూ, ఊర్లోకూడా అందరూ 'సాంబయ్యా' అనే పిలుస్తారు. భూషయ్యగారికి బట్టలవిషయంలో ఏమాత్రం శ్రద్ధలేదు. అదే విషయాన్ని తన కొడుకు విషయంలో కూడా అమలుచేయటానికి ఆయన నిశ్చయించుకున్నాడు.

తను ఏరకంగా జీవిస్తున్నాడో ఆరకంగానే తన బిడ్డ ఎదగాలని ఆయన ఆరాటం. ఆ ఆరాటాన్ని సాంబయ్య అర్థంచేసుకోలేకపోయేవాడు. అసలు తను వింటున్నవాటిని బట్టి మొత్తంగా తమ ఊరే ఓ ప్రత్యేకమైనది. అందులో తన నాన్న మరీ ప్రత్యేకమైనవాడు.

ఆ పిల్లలందరూ తమ తమ బట్టల గురించి చెప్పకొని ఊరుకుంటే సాంబయ్య కూడా అంత బాధపడి ఉండకపోను...

"సాంబయ్యా... మీ నాన్నకి కొత్తబట్టలున్నాయంటారా?" అన్నారు

"ఎందుకులేవూ?"

"మరెప్పుడూ వేసుకోడే"

"పొలంపనులకెళ్తాడుగా... అంధుకు"

"పొలంపనులు అయిపోయాక వేసుకోవచ్చుగా"

ఈ ప్రశ్నకు సాంబయ్య జవాబు చెప్పలేకపోయాడు. ఆ తర్వాత ఇంకో పిల్లాడు ఓ విషయం చెప్పాడు.

"ఒరేయ్... మా మావయ్యగారి ఊర్లో పెద్ద షావుకారు ఉన్నాడంట. ఆయనకేమో బోల్డన్ని పొలాలూ... మేడలూ ఉన్నాయి. అయినాకూడా చొక్కావేసుకోడు"

"ఎందుకనిరా?" అన్నారు పిల్లలు.

"పీనాసోడు" అన్నాడు.

పిల్లలంతా నవ్వారు.

సాంబయ్య ముఖం మాడిపోయింది. తన నాన్నను పేరుపెట్టి అనకపోయినా, వీళ్లందరూ ఎగతాళి చేస్తున్నారు. వీళ్లను ఏదైనా అనాలి అనుకున్నాడు. అంతలోనే అలాంటి ఆలోచనలు మానుకున్నాడు.

"ఒరేయ్ సాంబయ్యా... తగాయిదాలు మన కొంపమీదకి తేవద్దు. బుద్ధిగా చదువుకుంటానంటే సరే. లేకపోతే నాతోపాటు చేనుకాడికి రా" అని ఖచ్చితంగా చెప్పాడు నాన్న.

"మీ నాన్న చొక్కా తొడుక్కోడు... మరి నీకు ఎన్నిజతలున్నాయిరా" అన్నారు.

"మూడు జతలున్నాయి" అన్నాడు.

పిల్లలందరూ తమకు ఎన్నెన్ని జతల బట్టలున్నాయో... ఏడమర్చి చెబుతుంటే తమ ఇల్లు దగ్గరకొచ్చింది.

"నేను వెళ్తారా" అన్నాడు సాంబయ్య.

అందరూ సరే అన్నారు. అయినాసరే వారందరూ నవ్వుతూ ఉన్నట్లనిపించింది.



ఇంటికివెళ్లి పుస్తకాలు పడేసి అమ్మదగ్గరికి వెళ్లాడు. ముఖం చూడగానే ఆమె అడిగింది.

"ఏంటి సాంబయ్యా... అట్టా ఉన్నావే... ఎవరేమైనా అన్నారా?"

సాంబయ్యకు ఆ మాటల్తో కళ్లవెంట నీళ్లు వచ్చాయి. కొంచెంసేపటి తర్వాత తమ స్నేహితులు అనుకున్న విషయంగురించి చెప్పాడు. తులనమ్మకి జాలి కలిగింది. "రేపు దీపావళి పండగకి నేను నీకు కొత్తబట్టలు కుట్టిస్తాగా... నువ్వు బాగా చదువుకో" అందామె.

తన బిడ్డకు ఇలాంటి విషయాలు చదువు మీద విముఖత కలిగించకూడదని ఆమె ఆరాటం. సాబయ్యకు మాటలు సంతృప్తిని కలిగించాయి. ఆ రోజు రాత్రి అమ్మ ఈ విషయం కదిలిస్తుందని తనకు తెలుసు. అందుకే బలవంతంగా నిద్ర ఆపుకోవటానికి ప్రయత్నం చేశాడు. అయితే తనవల్ల కాలేదు. నిద్ర ముంచుకువచ్చింది.

రాత్రి మామూలుగానే భూషయ్యకూ, తులనమ్మకూ సంభాషణ జరిగింది.

"నువ్వు నీ పద్ధతులు మార్చుకోవాలయ్యా" అంది తులసమ్మ.

"ఏందే అయ్యి" అన్నాడు భూషయ్య.

"సాంబయ్యని పిల్లలు మీ నాన్న చొక్కా ఎందుకు వేసుకోడని అడిగారంట"

"అయితే ఏంటంట?"

"ఎందుకయ్యా అట్టా ఉంటావు. ఎండకీ, వానకీ నీది వొళ్లు కాదన్నట్టు వదిలేశావు... కొంచెం సాయంకాలంపూటన్నా చొక్కా తొడుక్కోకూడదూ" అంది.

"నీక్కూడా పిచ్చిగాని పట్టిందా"

"ఊరుకోవయ్యా బాబూ... బట్టలు తొడుక్కోవటం పిచ్చా... ఇంకా నయం ఆ బళ్లోకి రానిస్తే సాంబయ్యకి గోచిపెట్టి పంపిస్తావనుకుంటా?"

"నేను బతికినట్టే ఆడూ బతుకుతాడే. అయినా నాకు తెలియక అడుగుతా, మన గొడ్డూగోదాకి బట్టలున్నయ్యేంటే"

"గొప్ప సిత్రం చెప్పావుగా... గొడ్డూగోదా మనుమలూ ఒకటేనా? రానురానూ నీ ఛాదస్తం పెరిగిపోతందే" అంది.

"అవునే... అయిమట్టుకు మస్తోపాటు పనిసేయుటంలా"

"ఎందుకు చేయవు. అయితే ఆటికికూడా బట్టలు కొను. అయినా పెద్ద పండక్కి గంగిరెద్దులకి కూడా బట్టలు కట్టడంలా"

"ఏమోనే నేను మట్టిని నమ్ముకుని బతుకుతున్నా"

"మంచిది. సాంబయ్య కూడా నీకుమల్లే ఎర్రటెండలో చేనుకాడికి పోకూడదు. ఆడు బాగా సదువుకోవాలి. సదువుకునే పిల్లాడికి బట్టలుండాలి. ముందాడకికి బట్టలు చింపించు" అంది తులసమ్మ.

"ఆటి సంగతి నాకేం తెల్సు" అన్నాడు భూషయ్య.

"మరేం తెల్సు... ఆ గొడ్డకాడ బాగుచేయటం... ఆ పొలం దగ్గిరకెళ్లటం, ఇంటికొచ్చి పనిచేస్తే చాలా" అంది.

చివర్లో మెలకువ వచ్చిన సాంబయ్యకు అర్థం అయిన విషయం ఏమిటంటే త్వరలో తనకు మంచి బట్టలు రాబోతున్నాయని.

తెల్లవారాక తులసమ్మ ఈ విషయం గురించి తన పక్కింటావిడతో మాట్లాడింది.

వదినా... ఈసారి ఊరెల్తున్నప్పుడు చెప్పు. మా సాంబయ్యకి బట్టలు చింపించాలి"

"నువ్వు కూడా వస్తావా?"

"నేనెక్కడొస్తాను. నువ్వు వెళ్తన్నావుగా చింపించుకురా"

"మరి నీకు నచ్చాలిగా"

"నచ్చేదేముంది. పిల్లాడు తొడుక్కునేవి. ఆ మాత్రం నీకు తెలియదా... తెల్లవి కాకుండా ఉంటే చాలు. మట్టి అయినా కనపడకుండా ఉంటే చాలు" అంది.

"ఏ ధరలో తెమ్మంటావ్?"

తులసమ్మకు ఎంత చెప్పాలో అర్థం కాలేదు.

"నీకు తెలియందేముంది వదినా... ఎంతో నీకు నచ్చితే చాలు. నీ పిల్లలకి తెచ్చినట్లుతే" అంది.





"సర్లే" అందావిడ.



భూషయ్యగారి బట్టల విషయం గురించి పిల్లలేకాదు ఆ ఊర్లో మరికొందరు కూడా మాట్లాడుకుంటారు. ఆ ఊర్లో భూషయ్యగారి లాంటివారు మరికొందరు ఉన్నా కొన్ని విషయాల్లో భూషయ్యగారు మరీ ప్రత్యేకంగా ఉంటాడు.

"ఈ మానవుడు మన ఊరికివరం" అనంటే-

"భూషయ్యగారు పెళ్లప్పుడన్నా చొక్కా ఏసుకున్నాడా?" అనెవరో అడిగారోసారి.

"మొత్తంమీద ఆ కొంచెం సేపూ వేసుకునే ఉంటాడు. అయినా నాకు తెలీక అడుగుతా ఎప్పుడూ పని చేస్తానే ఉంటాడు. మరి సంపాయించిన డబ్బంతా ఏం చేస్తాడో"

"ఆఁ... నా బొంద సంపాదన. మాకో మావయ్య ఉన్నాడు. ఆయనకి హొటలుంది. అయిదు గంటలకి లేచి ఉల్లిపాయలు కోస్తూ చెబుతుంటాడు- 'ఒరేయి... నేను స్వయంగా ఉల్లిపాయలు తరుగుతున్నారా? జనం ఎందుకురారు' అని. చివరికి ఆయన ఏదో హొటల్లో ఉల్లిపాయలు తరుక్కోవాల్సివచ్చింది. జనానికి కావల్సింది ఏమిటో తెలియాలిగాని ఆయన ఉల్లిపాయలు తరగటంకాదు. అట్టాగే భూషయ్యగారి సేద్యం గురించీ, ఆయన సంపాదన గురించీ ఆ తులసమ్మగారికి తెలియాలి. లేకపోతే ఆ పూర్ణయ్యగారికి తెలియాలి"

"ఆయనకేం తెలుసు?"

"ఈయన వ్యవహారమంతా ఆ పూర్ణయ్యగారే చూసుకుంటాడు. భూషయ్యగారికి డబ్బులు కావాలన్నా భూషయ్యగారి దగ్గర డబ్బులున్నా ఆయనే చూస్తాడు."

"అంటే వడ్డీకిస్తాడా?"

"అవును ఆ వడ్డీ ఎంతలే... అయినా ఆయనకి తప్పితే ఇంకో మానవుడికివ్వడు"

"అదేంటి?"

"నమ్మకమయ్యా... అదంతే"

"భూషయ్యమావకి మినిష్టరైతే ఏం చేస్తాడు?"

"దేశంలో బట్టల మిల్లులన్నింటినీ మూయించేస్తాడు... ఎవడి పొలం ఆడుదున్నుకోవాలి. ట్రాక్టర్లు వాడకూడదు అని శాసనం చేస్తాడు"

అందరూ నవ్వుకుంటారు.

వారందరూ అలా నవ్వుకుంటారని కాదు. భూషయ్యగారి అభిప్రాయాలు అలానే ఉంటాయి. ఆయన పాతకాలం నాటి మనిషి.

"నాకెందుకయ్యా టాక్టరు... నావొంట్లో ఓపిక లేకపోతేగందా... ఆడికి చెప్పివదిలి పెడ్తే నిముషాల్లో అవతలికెల్తాడు. ఏవైనా నేను దగ్గరుండి సేయించుకోవాల"అంటాడు.

పూర్ణయ్యగారు ఆ ఊర్లో ధనికరైతు. ఆయనకు చాలా పొలం ఉంది. పొలం కాకుండా ధాన్యం కొంటాడాయన. ఇంకా అపరాలు కూడా కొంటాడు. అందుకని ఆయనకు డబ్బు ఎప్పుడూ అవసరం అవుతుంటుంది. భూషయ్యగారు తన దగ్గర డబ్బుంటే ఆయనకు ఇస్తాడు. అందరికంటే ఆయన ఇచ్చేవడ్డీ తక్కువే. అయినా కూడా భూషయ్యగారు ఆయనకే ఇస్తాడు.

అందుకు భూషయ్యగారికున్న కారణాలు పేరు.

పూర్ణయ్యగారు ఎప్పుడు కావాలంటే అప్పుడు డబ్బులు సర్దుతాడు. రెండోది ఆయన ప్రాణం పోయినా అబద్ధం చెప్పడు. డబ్బులేకపోతే ఈరోజు లేదంటాడు తప్పించి ఎప్పుడూ ఇతరులిచ్చిన డబ్బు ఎగవేసే ప్రయత్నం మాత్రం చేయడనే గట్టి నమ్మకం ఆయనకుంది.

ఒక్కోసారి తులసమ్మ కూడా అంటుంది-



"నీకు డబ్బులు చేతిలోకొస్తే చాలు ఆ పూర్ణయ్యగారు కనబడతారు"

"అదేంటే"

"మరి లేకపోతే ఏమిటంట? ఆయనిచ్చే వొడ్డీ ఎంత? ఇంకెవరి కన్నా చూసి ఇవ్వకూడదూ"

"ఆడాళ్ళ మాటలు ఇట్టాగే ఉంటాయి. మన వెంకట్రామయ్యగారి బుల్లబ్బాయి తెల్సుగా"

"అయితే"

"ఆడేడుత్తున్నాడు. రెండు రూపాయల వొడ్డీ వస్తందని చెప్పి మొత్తం తీసుకెళ్ళి పోశాడు. ఇప్పుడేం చేయాలో తెలవక కొట్టుకుంటున్నాడు"

"ఏందోలే... నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యి" అంటుందామె.

భూషయ్యగారి గురించి నవ్వుకుంటూ మాట్లాడుకున్నంత మాత్రాన ఆయనంటే ఊర్లో వారికి గౌరవం లేదని కాదు.

తనెప్పుడూ ఎవరి సొమ్ము గురించీ ఆశపడడు. తనకు చేతనయినంత సహాయం చేస్తాడు. అంతకుమించి ఇతరుల గురించి చెడుగా మాట్లాడటం ఆయనకే మాత్రం ఇష్టం ఉండదు. తనపనేదో తను చేసుకుపోయేవ్యక్తిగానే ఆయన్ని పరిగణిస్తారు.

సాంబయ్య ఎదురు చూసిన బట్టలు రానే వచ్చాయి.

"అమ్మా... అమ్మా... నేను కొత్త బట్టలు వేసుకొంటానే" అన్నాడు సాంబయ్య.

"ఇప్పుడెందుకు... పండగరానీ" అందామె.

అదేం వినకుండా కావాలని కొత్త బట్టలు వేసుకొని బడికి వెళ్లాడు. ముందు మాస్టారు పిలిచారు.

"ఏంటిరో సాంబయ్య ఈరోజు కొత్తబట్టలు వేసుకున్నాడే" అన్నారు. ఆ బడిలో సాధారణంగా ఎవరూ కొత్త బట్టలు వేసుకోరు. ఏ పండగలప్పుడో మాత్రమే కొత్త బట్టలు.

"చాలా బాగున్నాయిరా..." అని మాస్టారంటుంటే సాంబయ్యకి గర్వంగా అనిపించింది.

అవుట్ బెల్ కొట్టాక పిల్లలందరూ సాంబయ్య చుట్టూచేరి - "భలే ఉందిరా... ఎప్పుడు కుట్టించావ్" అన్నారు.

సాంబయ్య అందరికీ చెబుతున్నాడు.

అప్పుడో పిల్లవాడు అడిగాడు.

"సాంబయ్యా... కొత్త చొక్కా లాగూ కుట్టించావ్ బాగానే ఉంది. మరి మీ నాన్న జేబులో పెట్టుకోవడానికి డబ్బులిచ్చాడా?"

"ఎందుకు?" అన్నాడు సాంబయ్య

"ఎందుకేమిటిరా? కొనుక్కుంటానికి. అసలు నువ్వెప్పుడూ పదిపైసలయినా తీసుకురావెందుకురా? మీ నాన్న ఇవ్వడా? మాకు తెలిసినాయన కొత్త చొక్కాలు కుట్టించుకుంటే ముందు జేబులో డబ్బులు మెరుస్తుంటాయి తెలుసా?"

సాంబయ్య తెలియదన్నట్లు అడ్డంగా తలూపాడు.

"నువ్వెప్పుడైనా వందరూపాయల కాయితం చూశావా?" అన్నాడు.

"చూడలేదురా... నువ్వు చూశావా?"

"చూశా కూడా... అసలు మీ నాన్న చూశాడా?" అన్నాడా కుర్రాడు.

"ఏమోరా నాకు తెలియదు" అన్నాడు సాంబయ్య.

అప్పటికి గంట మోగటంతో ఎవరి తరగతులకి వాళ్లు వెళ్లిపోయారు.

సాంబయ్యకు కొత్త చొక్కా తొడుక్కున్న సంతోషంలో చాలా భాగం కరిగిపోయింది. ఇప్పుడదంతా శూన్యంగా కనిపిస్తుంది. దానిలో డబ్బులుంటే బాగుండేదనిపిస్తుంది. నాన్న ఎప్పుడూ డబ్బులు ఇవ్వడు. నాన్నే కాదు అమ్మకూడా ఇవ్వదు.

"అక్కడ కొనుక్కోవటం ఎందుకురా... నీకేం కావాలో చెబితే నేను ఇక్కడ చేసిపెడతాగా" అంటుందామె.

బడినుండి ఇంటికి వస్తుండగా అనుకున్నాడు సాంబయ్య-

"నాన్న ఎంతవరకు చదువుకున్నాడో... తను బడికి వెళ్తున్నప్పుడు తాతదగ్గర డబ్బు





లు తీసుకునేవాడు కాదా? ఇంతకూ నాన్న వందరూపాయల కాయితం చూశాడా?''

తను ఎదురు చూసినంత సంతోషం తన పిల్లవాడిలో కనిపించకపోయేసరికి ''ఏం సాంబయ్యా...'' అంది.

''అమ్మా... నాకు డబ్బులివ్వవూ'' అన్నాడు.

''ఎందుకురా''

''రేపు బళ్ళో కొనుక్కుంటానమ్మా''

''ఏం కొనుక్కుంటావ్?''

''అయినూ, పప్పు చెక్కా''

''వద్దమ్మా... అవి మంచివికాదు. నేను చేసిపెడతాగా''

''అయిను కూడా చేస్తావా?''

''అదెట్టారా?''

''మరి మా బళ్ళోపిల్లలందరూ కొనుక్కుంటున్నారుగా''

''తులసమ్మకు ఏం చెప్పాలో తెలియలేదు.

''మీ నాన్ననడిగి తీసుకో''

''నేనడగను''

''ఏమనడులే'' అంది.

''నేనడగను. మా బళ్ళో ఏమన్నారో తెలుసా?''

''ఏమన్నారు?''

''మీ నాన్న ఎప్పుడన్నా వందరూపాయల కాయితం చూశాడాఅన్నారు''

తులసమ్మ నోరు తెరిచింది.

★ ★ ★

''ఏం భూషయ్యగారూ... డబ్బులు కావాలని చెప్పి వెళ్ళారంట దేనికి? ఎరువులకట్టకా?'' అన్నాడు పూర్ణయ్యగారు.

''లేదు... మా సాంబయ్యగాడికి బట్టలు చింపిచ్చింది. ఆడికి డబ్బులియ్యాల. ఆడేమో బడికి పోయొచ్చి గొడవచేయటం. మా ఇంటిదేమో అదితే... ఇదితే అని సతాయించటం'' అని గొణిగాడు.

ఆయన నవ్వుతూ చెప్పాడు.

''మీరు మరీనూ. మనం ఉండే పద్ధతుల్లో మన పిల్లలూ ఉండాలంటే కుదరదు. అలా ఉండలేరు కూడా. మానాన్న చెప్పినట్లు నేనుండలేదని ఆయన చాలా బాధపడుతుండేవాడు. ఇప్పుడు నేనూ అంతే. రోజులు మారిపోతున్నాయి భూషయ్యగారూ... అయినా రెండు జతల బట్టలు కుట్టించారు అంతేగా... చదువుకునే పిల్లలకి ఆ మాత్రం అవసరం లేదా? మీ వాడింకానయం ఏమీ అడగడు. మా వాళ్ళయితే పండగ పండగకీ బట్టలు కుట్టించాల్సిందే'' అన్నాడాయన.

ఆ క్షణం సాంబయ్యను తలుచుకొని ఆనందించాడు భూషయ్య. ఆయన ఇచ్చిన డబ్బు తీసుకొని ఇంటికి వచ్చాడు. రాత్రి త్వరగా నిద్రపట్టలా. తులసమ్మతో సంభాషణకి దిగాడు.

''పూర్ణయ్యగారు మన సాంబయ్యగాడిని మెచ్చుకున్నారే'' అంటూ మొదలుపెట్టాడు.

''ఎందుకు మెచ్చుకోరూ... నువ్వు-తప్పితే అందరూ మెచ్చుకుంటారు.

''ఓయ్...'' అన్నాడు సరిగ్గా వినపడక.

''దేనికంటా?'' అంది తులసమ్మ.

''ఆడు నిన్నేమీ అడగడయ్యా అన్నాడాయన''

''అది సరేగానీ నాకు తెలియకడుగుతా ఆడిచేతిలో ఎప్పుడైనా పది పైసలుబెట్టా?''

''ఎందుకే''

''ఆడుకుంటానికి... ఎందుకంటావేంటి? డబ్బులు ఎందుకంట?''

''ఇంటో తిండి చాలటం లేదా?''

''అబ్బో... పంచభక్ష్యపరమాన్నం పెడతున్నావుగా''

''ఏందోవ్... మా జోరుగా ఉన్నావే'' అన్నాడు.

''లేకపోతే ఏందయ్యా... ఎప్పుడూ చేనంటావ్, పనంటావ్, గొడ్డకాడ బాగుసేయాలంటావ్. మరి ఊర్లో కెళ్ళినప్పుడు ఆ కోమటికొట్లో ఓ అణా కారప్పూసగానీ ఓ లడ్డుగానీ ఆడికి తెచ్చిచ్చావా? ఇంటో పిల్లాడుంటాడనే ఆలోచనే రాదేంటి?''

''ఆడికి తేవాలా? నీక్కూడానా?''

''అబ్బో... సరసం... నువ్వు తెచ్చిన పూలు

మోయలేక నా మెతలు పట్టాయి... నువ్వు తెచ్చిన లడ్లు తిని విరోచనాలయ్యాయి'' అంది తులసమ్మ.

''వాయబ్బో'' అన్నాడు.

''మరేందయ్యా... తెల్లారి లేసిందగ్గర్నుండి అడ్డీ పట్టుకుని ఆ పేడకళ్లు తియ్యి తియ్యి అంటావు తప్పితే ఇదిగో ఈ పావలా డబ్బులు తీసుకెళ్ళి కొనుక్కో... అని ఎప్పుడన్నా ఇచ్చా?'' అంది.

''ఆఁ ఇంకా''

''ఇంకా కూడా చెప్పాలా... నువ్వెప్పుడన్నా వంద కాయితం చూశావా?'' అంది.

''ఏందోవ్'' అన్నాడు భూషయ్య.

''అవునయ్యా... బళ్లో తవరి గురించి మీ అబ్బాయిని అడిగేదది... మీ నాన్న చొక్కా ఎందుకేసుకోడు? మీ నాన్న వందకాయితం చూశాడా? అని''

''మీ అమ్మ కొడుకులకేంటీ చెబుతారు. అవును మరి. నేను బురద తొక్కి బతికేవోణ్ణి. వందకాయితాలెట్టా చూత్తాను. కొత్త బట్టలు కొత్త బట్టలన్నావ్. అదయిపోయింది. ఇప్పుడు డబ్బులు డబ్బులంటన్నావ్... తయారుచెయ్యి'' అన్నాడు.

''ఏంటీ... తయారుచెయ్యాలి. అయినా నా బిడ్డ బంగారంలాంటోడు. ఇదిగో ఇదివ్వు అంటూ అడిగాడా? ఏదో ఇంటో నాలుగు మెతుకులు తిని చదువుకొంటున్నాడు. ఎప్పుడన్నా ఆ మినప్పిండితో ఆయుకుడుం చేసిపెడ్తే తింటాడు. చుట్టుపక్కల చూత్తే కళ్లు తిరుగుతాయి. ఆళ్లకి ఎప్పుడూ కాయాకమ్మా ఉంటాది. ఆ మొగాళ్లు కూడా బయటికెళ్తే చాలు చేత్తో ఏదో పొట్లాం తీసుకురాందే రారు. నువ్వుకాక వొళ్లొంచుతున్నావు. అందరూ పండిచ్చే దానికన్నా ఏం పండిస్తన్నా''

''ఏందే... దడదడ లాడించేత్తన్నావ్'' అంటూ లేచి బయలుదేరాడు.

''ఎక్కడికీ అటుబడిపోతావ్''

''గడ్డి తొక్కేసాయేమో చూసొత్తా''

''అవును మరి. ఆటికడుపు నిండకపోతే నీ కడుపు నిండదుగా కానీ'' అంది.

భూషయ్య వెళ్లి చూశాక...

''అయ్యయ్యో... అప్పుడే రొచ్చు రొచ్చు అయిందే'' అని గడ్డి తీసుకొచ్చి వాటిముందు వడేసి వచ్చాడు.

''ఏంటే తులసమ్మా ఇప్పుడు చెప్పు'' అన్నాడు.

తులసమ్మ మాట్లాడలేదు.

''అయి నోరులేని జీవాలే. ఆటికి ఆకలయితే అడగటానికి నోరేది. పొద్దుగూకగానే గడ్డివేసినా ఉచ్చలుపోసి రొచ్చు చేస్తాయి. ఇంక తినవు. తెల్లారేదాకా అట్టాగే వడుకోవ్వూ... ఆటిని తలుచుకుంటే బాధగా ఉండదూ'' అన్నాడు.

''గొడ్డాకలి తెలిసినోడికి బిడ్డాకలి తెలవొద్దంటయ్యా'' అంది.

''బిడ్డాకలి తల్లి తెలుసుకోవాల'' అన్నాడు.

ఆరాత్రి భూషయ్య తన భాషతో సుదీర్ఘంగా చెప్పుకొచ్చాడు.

అదంతా సాంబయ్య వింటుండిపోయాడు.

★ ★ ★

భూషయ్యగారు పెద్దగా చదువుకోలేదు. రెండు మూడు సంవత్సరాలు బడికి వెళ్లటం జరిగినా అవంత లెక్కలోవి కావు. మొదటి నుండి బడికంటే కూడా ఆయన్ని ఆకర్షించిన అంశాలు ప్రకృతీ... పశువులూ. వాళ్లింట్లో ఎప్పుడూ పాడివుండేది. సూడిగేదెల్ని మేపుకురావటంలో పశువులను కడగటానికి చెరువుకు తీసుకువెళ్లటంలో ఎప్పుడూ తను ముందుండేవాడు. చెరువులోపడి ఆ గేదెల్ని తళతళలాడేట్లు తోమేవాడు. అందుకోసం ప్రత్యేకంగా గడ్డి తీసుకుపోయేవాడు.

పశువులచావిడి ఎప్పుడూ శుభ్రంగా వుండాల్సిందే. ఈ పనిచెయ్యి అంటూ వాళ్ల నాన్న ఎప్పుడూ చెప్పేవాడు కాదు. బడికి వెళ్తానంటే వెళ్లమన్నాడు. ఆ తర్వాత బడిసొంతం మానుకుని గేదలు కాసేకుర్రాళ్లతో తిరిగినా ఏమీ అనలా. గొడ్లకాడ బుడ్డాళ్లందరితో కలసి ఆటలూ, పాటలూ అన్నీ.

బండి కట్టడం, వాటిని నడపటం... పొలం దగ్గరకు వెళ్లటం... భూమిని దున్నటం... దమ్ముచేయటం.... నారు పీకటం... ఎరువులు





చల్లటం... మాసూలు చేయటం... ఈ పనుల న్నింటివల్లా భూషయ్యలో ఓ గాఢమైన అను భూతీ, నమ్మకం కూడా ఎదగటం ఆరంభించాయి.

ఆయన దృష్టిలో తమ ఇంట్లో పనిచేసేవారి కీ, తమతోపాటు పనిచేసే పశువులకీ తమకూ భేదంలేదు. ఈ ప్రపంచంలో ఆయనకు అత్యంత ఇష్టం అయినది భూమి. తనకు సంక్రమించిన భూమి ఓ ఎకరం ఉంటుంది. ఇప్పుడది రెండున్నర ఎకరాలు అయింది. అలా కావటం వెనక తన శ్రమ ఉంది. భీముడులాంటి వారి శ్రమ ఉంది. వాటితోపా టు తమ పశువులదీ ఉంది.

అందుకే వాటి సంరక్షణపట్ల అంతగా ఆరా టపడతాడు. మానవుడూ, జంతుజాలం ప్రేమ పూర్వకంగా, స్నేహపూర్వకంగా ఈ ప్రకృతిలో భాగం కావాలనటానికి ఆయన ఓ సజీవ ఉదాహరణ. అది ఎంతటిస్థాయికి చేరు కుందంటే తన ఒక్కగానొక్క కొడుకు విషయం గురించి నిజంగానే ఆలోచన తట్టదు.

తను బజారుకి వెళ్తాడు. అక్కడ చిన్న హోటలు ఉంది. అక్కడ కూర్చున్నవారంద రూ ఏదో ఒకటి తింటుంటారు. పిలిచి పలకరి స్తుంటారు. అయినా కూడా తను జవాబు చెప్పి బయటకు వస్తాడు తప్పించి ఏదైనా తినాలని పించదు. పక్కనే అద్దాలమాటున కనిపించే తినుబండారాల్ని చూసినా అదే దృష్టి. కానీ వంట్లో ఎంత బాగుండకపోయినా ఓపిక చేసు కుని లేస్తాడు... పశువుల కోసం.

అవును మరి. అవి పశువులు. వాటికి నోరులేదు. అవి నోరుతెరిచి అడగలేవు. తమ రక్తాన్ని పాలుగా మార్చి అందిస్తున్నాయి. తమ శ్రమతో భూమిని పులకరింపజేస్తున్నాయి. అలాంటివాటితో ఆయన ఏర్పరచుకొన్న ప్ర పంచంలోకి తొంగిచూస్తే తప్ప ఆయన అర్థంకా డు.

ప్రతిరోజూ తన పొలం తనకు కొత్తగానే కనిపిస్తుంది. అందులో ఎదిగివచ్చే పంట చూసుకుంటే ఏదో తృప్తి. తను లెక్కలు కూడా చూసుకోడు. పంట చేతికందివచ్చాక డబ్బు మిగిలితే పూర్ణయ్యగారి దగ్గరకు వెళ్తుంది.

ఓసారి ఆయనే ఎప్పటినుండో లెక్కలు చూసి చెప్పాడు.

"భూషయ్యగారూ... డబ్బులు లెక్క చూ ద్దాం"

"అదేదో మీరో చూడండి"

"అదేంటి డబ్బులు ఏం చేద్దారని?" అన్నా డాయన.

"చేసేదేముంది. ఇంకోటి చేయటానికి నాకేం తెలుసు. భూమి కొనుక్కుంటా" అన్నా డు.

ఆయన చేతులమీదుగానే ఆ ఒకటిన్నర ఎకరం కొన్నాడు. అందులో కొంతభాగం ఆయన దగ్గర్నుండే అప్పు తీసుకున్నాడు. పంటలు వస్తున్నాయి. డబ్బుల విషయం పూర్ణయ్యగారికే తెలుసు.

వందరూపాయల కాయితం అనేకాదు. వెయ్యిరూపాయల కాయితం అయినా ఆ మహానుభావుడి కళ్లకు గొప్పగా కనిపించదు. ఆయన దృష్టిలో అవి విలువలేనివి అంటే మారకపు విలువ అనికాదు.

ఆయనకి తన ఆరాటం తప్పించి తన బాల్యం, తనతోపాటు రక్తం పంచుకుపుట్టినవా రూ, వీరంతా గుర్తుకు వస్తారా అన్నంత సందేహం కలుగుతుంది. ఆయన దృష్టిలో సాంబయ్య గురించి ప్రత్యేక ప్రణాళికలు ఏంలేవు.

"చదువుకుంటానంటే చదువుకుంటాడు. లేకపోతే నేను నమ్ముకున్నట్టు ఆడూ భూమిని నమ్ముకుంటాడు" అనుకుంటాడాయన. భూష య్య మాట్లాడుతూనే ఉన్నాడు.

తులసమ్మకి ఎప్పుడు నిద్రపట్టిందో తెలియ దు.

సాంబయ్య బడికి వెళ్తుంటే తులసమ్మ పిలిచి "బాబూ ఇదిగో" అంటూ పదిపైసలు చేతిలో వుంచింది. ఆ క్షణం సాంబయ్య కళ్ళలో కనిపించిన ఆనందం బహుశా ఆమెకు ఎప్ప టికీ మరపుకు రాకపోవచ్చు.

"కొనుక్కోమంటావా అమ్మా" అన్నాడు అనుమానంగా.

"అందుకేగా... ఇచ్చాను" అంది.

"మరి నాన్నకు చెప్తావా?"

"అయన్నీ నీకెందుకు? నువ్వు మాత్రం బాగా చదువుకోవాలి" అంది.

"మా అమ్మ మంచిది" అనుకొంటూ బడికి వెళ్లిపోయాడు సాంబయ్య. తులనమ్మ కూడా ఈ రకంగా జీవించాలని ప్రత్యేకమైన ఆలోచనలంటూ లేవు. అసలు వారికి తీరిక లభించటమే తక్కువ. ఎప్పుడూ ఏదో ఒకపనిలో నిమగ్నం అయివుంటారు. ఉచయం అంతా వంటపనీ, ఊడ్చుకోవటం, అంట్లు తోముకోవటం సరిపోతుంది.

భోజనం చేశాక కూడా నడుం వాల్చరు. తులనమ్మగారింటికి రాట్నాలు తెచ్చుకుని కొంతమంది వస్తారు. తనేమో బియ్యంలో రాళ్లు ఏరుకోవటమో, పీట వేసుకుని మినుములు చేయటమో, ఏ పిండి అయినా విసురుకోవటమో చేస్తుంటుంది. అసలు ఆమె ఎప్పుడూ చీపురు పట్టుకుని ఈ మూలనుండి ఆ మూలకు ఊడుస్తావుంటుంది.

ఆ ఇంటికి పెద్దస్థలమే ఉంది. అదంతా ఊడవాలంటే నడుములు పట్టుకుపోతాయి. అయినానసరే ఉదయమూ, సాయంకాలమూ ఊడవాల్సిందే. ఇంకా ఎక్కడైనా గడ్డిపరకలు లాంటివుంటే భూషయ్య ఊడుస్తాడు.



ఆ దొడ్లో ఓపక్క పాదులుచేసి వంగ, బెండ విత్తనాలు చల్లాడు. ఇంక సారపాదు విషయం చెప్పే పనిలేదు. అది విరగ కాస్తుంటుంది. భూషయ్యగారే కోసుకుని అందరికీ ఇచ్చివే స్తుంటారు.

"అయ్యో... తినలేక చచ్చిపోతున్నాం. ఇంకెందుకు చాలు" అన్నా ఊరుకునేవాడు కాదు. తులసమ్మకి బట్టల విషయంలో ఆయ నంత చాదస్తంలేదు. అలా అని ఆమె ఖరీదైన బట్టలు వేసుకోదు. తనకు ఉన్న బట్టల్ని మాత్రం శుభ్రంగా ఉంచుకుంటుంది.

వాళ్ల ట్రంకుపెట్టెల్లో భూషయ్య పెళ్లికి కుట్టించుకున్న చొక్కా... ఆమె కట్టుకున్న పట్టు చీరా వుంటాయి.

ఆ ఇంట్లో ఓ మూలగా భగవంతుడి విగ్రహా లు ఉంటాయి. వాటిలో వినాయకుడూ, ఆంజ నేయస్వామీ ఇంకా మరికొందరు వుంటారు. అయితే నిత్యమూ పూజలు చేయటంలాంటిది ఆమె చేయదు. ఏ శ్రావణ శుక్రవారాలప్పుడో తలంటుకొని భక్తిగా నమస్కరిస్తుంటుంది.

భూషయ్యగారి విషయం అయితే ఇంక చెప్పే పనేలేదు. ఆయనకి దేవుడు చాలా తక్కువగా గుర్తొస్తాడు. ఏ పండగలప్పుడో మాత్రం ఇంటిదగ్గర ఉంటాడు. అప్పుడు మంచంమీద కూర్చొని తులసమ్మతో ఏదో చెబు తుంటాడు. పొలం గురించి అడుగు...

"బాగానే వుంది... మరి చేతికి రావాలిగా" అంటాడు.

పిల్లవాణ్ణి గురించి అడుగు...

"ఆడా... బడికయితే ఎల్తన్నాడు మరి..." అనేసి "ఓయ్" అంటాడు.

పాడి గురించి అడుగు...

"ఏదో ఇత్తందిలే..." అంటాడు.

ఇంకేమైనా అడిగినా ఇలాంటి సమాధానాలే వస్తాయి.

అంతకుమించి తనేం అడగడు. అసలు అడగాలనిపించదు. తనను త్వరత్వరగా ప్రశ్న లు అడగటం పూర్తిచేస్తే ఇంక వెళ్ళిపోతాను గదా అన్నట్లుంటాడు.

సాంబయ్య బెల్ట్ బెల్లులో అయినుబండి దగ్గరికి వెళ్లాడు.

"సాంబయ్యా... అయిను కొంటున్నావా?" అంటూ వచ్చాడో కుర్రాడు.

"అవున్రా. మా అమ్మ డబ్బులిచ్చింది"

"నాక్కూడా కొనిపెట్టరా"

"నా దగ్గర పదిపైసలే వుందిరా" అన్నాడు.

"రెండొస్తాయిగా" అంటూ తనే తీసుకుని కొనుక్కొని వచ్చి సాంబయ్యకి ఒకటి అందించి- "చాలా బాగుందికదూ" అన్నాడు. సాంబయ్య అవునన్నట్లు తలూపాడు. ఆ తర్వాత ఆ పిల్లవాడు తన స్నేహితులందరితో నూ ఘనంగా చెప్పాడు.

"ఈరోజు సాంబయ్య నాకు అయిను కొనిపె ట్టాడు తెల్సా?" అంటూ.

సాంబయ్య కూడా అందరికేసీ గర్వంగా చూశాడు.

"సాంబయ్యా... ఇకనుంచి రోజూ కొను క్కుంటావా?" అన్నాడతను.

అప్పుడు సాంబయ్యలో మార్పు వచ్చింది.

"ఏమోరా? ఈ రోజయితే మా అమ్మ ఇచ్చింది" అన్నాడు.

సాంబయ్యలో కూడా ఓ ప్రత్యేకమైన గుణం వుంది. తను కూడా ఎటువంటి పరిస్థితులలో నూ గొప్పలు చెప్పుకోడు. తను ఎప్పుడన్నా బాధపడతాడు తప్పించి అది కప్పిపెట్టుకోవా లనే ఆలోచనే రాదు.

ఆరోజు తమ క్లాసుకి మాస్టారు రాకపోతే సాంబయ్యా, ఇతర పిల్లలూ కూర్చుని కబుర్లు చెప్పుకొన్నారు. ఒక్క సాంబయ్య మాత్రమే శ్రోతగా ఉండిపోయాడు. అందరూ అంత గొప్పగా చెప్పుకొచ్చారు.

"అసలు మా నాన్నయితే నాకు చాలా డబ్బులు ఇస్తార్రా... నేను అడక్కపోయినా సరే ఇస్తారు. అంతగా ఇవ్వకపోయినా సరే నేనే ఆయన జేబులో చెయ్యిపెట్టి తెచ్చుకుంటా"

"మా అత్తయ్య దగ్గరికి వెళ్తే చాలు రూపా యలు రూపాయలిస్తుంది. నేను కూడా రేపు సెలవులకి అక్కడికి వెళ్లిపోతా"

"మా నాన్నేమో రాత్రిపూట నా దగ్గరే పడు కుంటాడు. బాగా చదువుకుంటే సైకిల్ కొనిపె




ద్దానన్నాడు. ఇంక అదెక్కి రయ్ రయ్‌మంటూ తొక్కుకుపోవటమే''

''మా క్కూడా ఇస్తావంట రా''

''అసలు నేను ఈ ఊర్లో ఏడోతరగతి అయిపోగానే ఈ ఊరునుంచి వెళ్లిపోతా. ఎప్పుడయినా శెలవులప్పుడే వస్తా''

''నేనూ అంతేరా. మా మావయ్యావాళ్లు కూడా నన్ను పంపించేయమంటున్నారు. ఇక్కడయితే చదువు బాగా రాదు. పిల్లలు చెడిపోతారు. అని మా అమ్మకి చెబుతుంటే నేను విన్నాను.''

సాంబయ్య అందరినీ చూస్తున్నాడు.

తనకూ అత్తయ్య వుంది. ఎప్పుడన్నా అత్త దగ్గరకు వెళ్తే...

''మీ అమ్మేం చేస్తుందిరా సాంబయ్యా'' అంటుంది. లేదా ''ఓస్సారి కనపడమని చెప్పురా'' అంటుంది.

అంతేగాక బళ్ళారి వెళ్ళిన వారి గురించి మాట్లాడదు. తన నాన్న కూడా అంతే. వాళ్లయినా ఒక్కసారి వస్తే బాగుండుననిపిస్తుంది సాంబయ్యకి.

''అమ్మో అంత దూరంనుంచి రావటమే'' అన్నప్పుడు-

ఎంత దూరం అయివుంటుందో అనే ఆలోచన కలుగుతుంది. వారందరూ అంత దూరంనుండి రావాలంటే రైళ్లూ, బస్సులమీదుగా ప్రయాణంచేసి రావాలని తెలుసుకున్నప్పుడు తిరిగి ఆనందం కలుగుతుంది.

అయితే వారు రారు. అంతకుమించి భూషయ్య ఇంటినుండి కదలడు. ఇంక తులసమ్మ సరేసరి. కనీసం ఉత్తరం అయినా వస్తే బాగుంటుంది అనుకోవటం ప్రారంభించాడు సాంబయ్య. అదీ లేదు!

★ ★ ★

''డాడీ...''

ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు రావ్.

ఆలోచనాస్రవంతి తెగిపోయిందక్కడ.

ఎదురుగా తన కూతురు.

''రామ్మా'' అన్నాడు.

తను మెల్లగా నడిచివచ్చింది.

''చెప్పమ్మా'' అన్నాడు.

''కిందకు వెళ్దాం రండి డాడీ'' అంది.

''నేను కొంచెంసేపు ఇక్కడే కూర్చుంటానమ్మా''

ఆ అమ్మాయి నాన్న దగ్గరగా వచ్చింది. రావ్ తన కూతుర్ని దగ్గరకు తీసుకున్నాడు.

''తాతయ్య ఎందుకు చచ్చిపోయాడు నాన్నా?'' అంది.

జవాబు చెప్పకుండా తన బిడ్డ కళ్లలోకి చూశాడు. ఆయన కళ్లలో ఓ నీటిపొర మెరిసి మాయం అయింది.

''ఏమోనమ్మా... రాత్రి కూడా బాగానే వున్నాడుకదా''

''అవును డాడీ. ఈరోజు ఉదయం లేచి మనవూరు వెళ్ళిపోతానన్నారు. నేను అదేం వీలుకాదు. ఇంకా టెన్‌డేస్ వుండాలని చెప్పాను. తాతయ్య కాదు నేను వెళ్లిపోవాలన్నారు డాడీ''

''అవునమ్మా... ఆయనకి ఆ ఊరంటే ప్రాణం''

''ఆ ఊర్లో ఏముంది డాడీ''

''అక్కడ ఆయన పుట్టారు పెరిగారు. ఆడుకున్నారు. పనిచేశారు. ఆయనకు తెలిసింది ఆ ఊరే కదమ్మా. అందుకే ఆ ఊరంటే అంత ప్రేమ''

''డాడీ... మనుమలు ఊర్లను కూడా ప్రేమిస్తారా?''

''మీ తాతయ్యను చూస్తున్నావుకదమ్మా''

''మరి తాతయ్యతోపాటు నాయనమ్మ ఎందుకు రాలేదు డాడీ''

''రాలేదమ్మా. అక్కడ ఇంకా గేదెలున్నాయి. అవి నాయనమ్మకి తప్పితే పాలు ఇవ్వవు. అందుకని ఎవరో ఒకరు అక్కడ వుంటారమ్మా''

''అయినా డాడీ! వాళ్లంతా ఓల్డ్ అయిపోతున్నారుకదా. మన దగ్గరకొచ్చి ఎందుకు ఉండరు?'' అంది ఆ అమ్మాయి.

''అదంతే అమ్మా... ఈ హైదరాబాద్ విడిచిపెట్టి నువ్వు దూరంగా ఉండగలవా?''

"ఎందుకుండను"

ఆయనకు నవ్వు వచ్చింది.

"నిన్ను నాయనమ్మ దగ్గరికి పంపిస్తే ఉంటావా అమ్మా"

"డాడీ" అంది ఆ అమ్మాయి.

"చెప్పమ్మా"

"నాయనమ్మకు ఈ విషయం తెలియదుగా"

తిరిగి ఆయన ముఖంలో ఉద్వేగం చోటుచేసుకుంది.

కేవలం తలూపగలిగాడు.

"ఇప్పుడేం చేద్దాం నాన్నగారూ" అంది.

ఆయనకి దుఃఖం ఎగతన్నుకురాగా పక్కకు తిరిగివెళ్లాడు.

తిరిగి కిటికీ తలుపు తెరిచి చూశాడు.

ఎటు చూసినా భవనాలు... నీలాకాశం... నిశ్శబ్దం... మానవుడు సాధించిన ప్రగతికి గుర్తులు. కొద్దిసేపు అలా చూస్తూ నిలబడ్డాక తనలో ఉబికివస్తున్న ఉద్వేగాన్ని తనలో తాను దిగమింగుకోగలిగాడు.

"స్వప్నా... ఏం చేస్తున్నావమ్మా" అంటూ వచ్చింది సులోచన.

"ఏం లేదమ్మా... డాడీతో మాట్లాడుతున్నా"

"ఏం మాట్లాడుతున్నావు" అంది మెల్లగా.

అప్పుడే ఫోన్ మోగింది.

రావ్ నడుచుకుంటూ వచ్చి అందుకున్నాడు.

"యస్..."

అటునుండి ఎవరో ఏదో చెబుతున్నారు. మౌనంగా తలూపుతూ వింటున్నాడాయన.

"అలాగే... అలాగే" అంటూ ఫోన్ పెట్టేసి సులోచన ముఖంలోకి చూశాడు.

"ఎవరు?" అందామె.

"ఫ్రెండ్ ఫోన్ చేశాడు"

"పరిస్థితి బాగుండలేదంట. రెండురోజుల దాకా కర్ఫ్యూ ఉంటుందంటున్నారంటాడు"

"మరెలా?" అందామె.

ఎంత దాచుకొందామన్నా ఆమెలో ఆందోళన దాగటం లేదు.

రావ్ తల పంకించాడు.

వెంటనే ఫోన్ అందుకుని రింగ్ చేశాడు.

"గంగాధర్ కావాలి"

ఆయన లైన్లోకొచ్చాడు.

"గంగాధర్... వెంకట్ ఇప్పుడే ఫోన్ చేశాడు. పరిస్థితి బాగుండలేదంటున్నాడు. నిజమేనా?"

"అవును. పాతబస్తీలో అల్లర్లు దారుణంగా వున్నాయి. ఎంతమంది పోయారో లెక్కలేదు. దిస్ బ్లడీపొలిటీషియన్స్‌నందరినీ వరసగా కాల్చేస్తే ఈ దేశం బాగుపడుతుందేమో" గంగాధర్ కంఠం ఆవేశంగా వణికింది.

"ఏమిటంత ఆవేశపడుతున్నావ్?"

"లేకపోతే ఏమిటి రావ్?" ఇప్పుడే నాకెవడో ఫోన్‌చేసి చెప్పాడు.

"ఏమని?"

"సరిగ్గా ఈరోజు రాత్రి పన్నెండుగంటలకి ఈ ప్రాంతమంతా స్మాష్ చేస్తారంట"

"కంట్రోల్‌రూంకి ఫోన్ చేశావా?"

"పుకార్లు నమ్మవద్దని జవాబు. మరి ఇప్పుడు ఏమిటి చేయటం?"

"చేసేదేముంది. ఎలా అయినాసరే మనం నాన్న బాడీని మా ఊళ్ళు తీసుకువెళ్లాలి"

"ఈ పరిస్థితుల్లో కుదురుతుందంటావా?" గంగాధర్ నిరాశగా అన్నాడు.

"నువ్వేమైనా చెయ్యి. ఇది జరిగితీరాలి"

"కనీసం కర్ఫ్యూ పాస్‌లు ఇచ్చే సమయం కూడా లేదు. ఇదేదో కార్చిచ్చు రగిలినట్లు రగిలింది"

"అవును"

"కొద్దిసేపు నిశ్శబ్దం అనంతరం గంగాధర్ కంఠం వినిపించింది.

"నువ్వు మరీ సెంటిమెంటల్‌గా ఆలోచిస్తున్నావా రావ్"

"నో..." దృఢంగా అన్నాడు.

"ఐయామ్ సారీ. ఇలా మాట్లాడాల్సి రావటం దురదృష్టకరమే. పరిస్థితులు మన చేతుల్లో లేవుకదా"





"ఏదిఏమైనా ఆయన చివరి కోరికను తీర్చటం నా కనీస బాధ్యత. మనం ఏం చేయగలం అనేది అమ్మ ఆలోచించదు. కడ సారి చూపుకు ఆమె నోచుకోకపోతే ఈ జీవితంలో ఆమె క్షమించదు"

"అయినా..."

"గంగాధర్... నాన్న శరీరాన్ని ఎలా అయినా సరే మా ఊరు చేర్చాలి. నిజమే. మా ఊరు కొన్నివందల మైళ్ల దూరంలో వుంది. నిజానికి అదో దూరం కాదు. ఇప్పుడు దూరమంతా ఈ నగరంలోనే వుంది. ఈ ఇరవై కిలోమీటర్ల దూరం... ఆ మాటకొస్తే అంత దూరం కూడా కాదు. కేవలం పది కిలోమీటర్ల దూరం అధిగమిస్తే చాలు. మనం గమ్యం చేరతాం"

"నిజమే. కానీ ఈ దూరంలోపే ఏమైనా జరిగితే"

"కీడెంచి మేలెంచమని పెద్దలు చెప్పారు. నువ్వు చెప్పేది నిజమే. కానీ నన్ను కూడా అర్థం చేసుకో. అర్థంలేని విశ్వాసాలకోసం అవి కూడా అందరివీ కాదు. ఏ కొద్దిమందో స్వార్థపరుల ప్రయోజనాలకోసం ప్రశాంతకర వాతావరణం బద్దలైంది. నాకిప్పుడు చాలా పట్టుదలగా వుంది. చాలాకాలం నాన్నను నేనూ అర్థం చేసుకోలేకపోయాను. ఇప్పుడు ఆయన చాదస్తుడుగా నాకు కనిపించటంలా. నా తండ్రిగా చెప్పటంలేదు. ఆయనకు తలవంచి అభివాదం చెయ్యాలనిపిస్తూంది"

"అఫ్‌కోర్స్... అఫ్‌కోర్స్..." అవతలనుండి గంగాధర్ అంటున్నాడు.

"నీకు తెలియదు గంగాధర్. నాన్న ఈ రోజుకీ తన శరీరాన్ని పూర్తిగా కప్పుకోడు. ఎర్రటి ఎండలో కొన్ని దశాబ్దాలపాటు ఆయన శ్రమంతా ధారపోసి పంటలు పండించాడు. పదిమంది తింటుంటే ఆనందపడ్డాడు.

అతను జీవితాన్ని ప్రేమించాడు గంగా... ధ...ర్" కంఠం వణికింది.

"కంట్రోల్ రావ్... ప్లీజ్ కంట్రోల్"

"నో... ఐయామ్ నాట్ రావ్... నేను సాంబయ్యని... భూషయ్యగారి సాంబయ్యని. నేను నిర్మించుకున్నవన్నీ కృత్రిమంగా కనిపిస్తున్నాయి. వాటే హెల్. ముక్కుపచ్చలారని బిడ్డల్ని కూడా కత్తుల్తో పొడుస్తున్నారంటే... పండు ముసలివాళ్లని కూడా నరుకుతున్నారంటే... ఏమిటిది? ఎటు పోతున్నాం మనం..."

గంగాధర్ హతాశుడై వింటున్నాడు.

"అందుకే నేను ఒకటే నిర్ణయించుకున్నాను. ఎలా అయినా సరే. నేను ఇక్కడినుండి బయలుదేరతాను. నాన్నను తీసుకెళ్లటంకోసం నా ప్రాణాలు బలయినా ఐ డోంట్ కేర్. అసలు ఆయన్ని ఈ నగరం రమ్మని ఎందుకు బలవంతం చేశానా అని ఇప్పుడు సిగ్గుపడుతున్నా"

సులోచన తన భర్త దగ్గరకు వచ్చి ఏదో చెప్పాలనుకుంది. ఎప్పుడూ కనిపించని ఆగ్రహం తన భర్త కళ్లలో ఈనాడు కనిపిస్తూంది. ఆయన మాటలు కూడా చాలా తమాషాగా వున్నాయి.

స్వప్న నిర్ఘాంతపోయి చూస్తోంది.

"ఓకె. రావ్. నిన్ను నేను అర్థం చేసుకున్నాను. బాడీ చెడిపోకుండా చూడు. నేను గంటతర్వాత నీకు ఫోన్ చేస్తాను"

"బాడీకి ఏం కాదనుకుంటా. ఇప్పుడు సరిగ్గా పన్నెండుగంటలవుతూంది. నాలుగు గంటలకల్లా మనం ఇక్కడినుండి బయలుదేరగలిగితే బాగుంటుంది"

"ఐ విల్ ట్రై మై లెవెల్ బెస్ట్... రాత్రిపూటయితే చాలా కష్టం. రేపటికి పరిస్థితి ఇంకా వరస్ట్ కావచ్చు. అందుకే నేను గంటలో ఏ విషయం చెబుతానన్నాకదా"

"అలాగే... ఎదురు చూస్తుంటాను" అంటూ ఫోన్ పెట్టేసి సులోచన కళ్లలోకి చూశాడు.

"అంత అవసరం రాకపోవచ్చు. అంతగా అయితే మన ఫ్రిజ్ మొత్తం ఖాళీ చేయాల్సి వుంటుంది" అన్నాడు.

ఆమె తలూపింది.

"పదండి. ఓసారి చూసివద్దాం" అన్నాడు.

అందరూ మెట్లుదిగి వెళ్లారు.

హాలు మధ్యభాగంలో నిద్రపోతున్న వ్యక్తిలా భూషయ్య పడుకొని ఉన్నాడు. ఆయనకింద మెత్తటి పరుపులు వేశారు. ఆయన శరీ



రంమీద తెల్లటి వస్త్రం కప్పారు. చూసేవారికి ఆయన మరణించినట్లుగా లేదు. విశ్రాంతి తీసుకుంటున్నట్లుగా ఉంది.

ఆయన తలదగ్గర సాంబ్రాణి కడ్డీలు వెలిగించారు. అవి సువాసనను వెదజల్లుతున్నాయి. 'రావ్'ను చూడగానే వాళ్లందరూ లేచి నిలబడ్డారు. ఓసారి తన తండ్రిని చూసుకున్నాక తిరిగి పైకి వెళ్లిపోయాడు.

"స్వప్నా... రామ్మా" అంటూ పిలిచాడు.

నిశ్శబ్దంగా అనుసరించింది.

పైకి వెళ్లాక తనే మాట్లాడింది.

"డాడీ... మా స్కూల్ బిల్డింగ్ గోడలమీద రాశారు"

"ఏం రాశారమ్మా?"

"మతం మత్తుమందట. నిజమా డాడీ?"

"చూస్తున్నావుకదమ్మా"

"ఒక మనిషిని ఇంకోమనిషి చంపటానికి చేతులెలావస్తాయి డాడీ"

"అలాంటిపనులు చేసేది పిరికివాళ్లమ్మా. ఇంక మాటల్తో తాము ఎదుటివాడితో గెలవలేం అనుకున్నప్పుడు ఆ రకంగా వస్తారు"

"అది చాలా ఘోరంకదూ"

"అవునమ్మా"

"అలా చేసేవారికి అమ్మా, నాన్నా పిల్లలూ వుండరా"

"ఎందుకుండరు? నువ్వు చెప్పావుగా... మతం మత్తుమందని. ఆ మత్తులో ఉన్నప్పుడు వాళ్లు ఏమైనా చేస్తారు?"

"మతం అంటే ఏమిటి డాడీ"

ఆయన తన బిడ్డకేసి చూశాడు.

"నాకు తెలియదమ్మా"

"నిజంగానా? నిజంగా మీకు తెలియదా?"

"నిజంగానే తెలియదు. నాకే కాదు. ఈ దేశంలో చాలామందికి తెలియదు. మా మతం గొప్పది మా మతం గొప్పది అనేవారికి అసలు తెలియదు. వారికి తెలిసిందల్లా అధికారం మాత్రమేనమ్మా"

"డాడీ..." అని అడిగింది.

"ఏమిటమ్మా?"

"డెడ్‌బాడీని ఏంచేస్తారు? బరీ చేస్తారా?"

తను ఏదో చెప్పబోయేలోగా తనే అంది.

"మన తమ్ముణ్ణి కూడా పూడ్చిపెట్టారుకదూ"

"స్వప్నా" సులోచన పిలిచింది.

స్వప్న అక్కడినుండి లేచి వెళ్లిపోయింది.



"సాంబయ్యా... ఇవాళ చేనుకాడికి వెళ్దాం" అన్నాడు భూషయ్య.

"నేను అన్నాలు వండి పంపిస్తాగా అప్పుడొస్తాడులే" అంది తులసమ్మ.

"సరే..." అంటూ వెళ్లిపోయాడు.

ఆరోజు మాసూలు చివరిరోజు పెద్ద కుండ పెట్టి అన్నం వండింది. చిన్న స్టీలు టిఫిన్ నిండా నెయ్యిపోసింది. పాలతాలికలు చేసేటప్పుడు బెల్లం తరిగింది. సాంబయ్యకి తెల్లటి రంగులో ఉన్న ఆ బెల్లం చూడగానే నోరూరింది. తులసమ్మే కొద్దిగాతీసి చేతిలో పెట్టింది.

ఇంకా వంకాయలూ, ములక్కాయలూవేసి దప్పళం పెట్టింది. పచ్చళ్లూ... పెద్ద టిఫిన్ నిండా పెరుగూ, ఇంకా పండిన అరటికాయలూ, పెద్ద తట్టలోపెట్టి పని అవుతుందనుకుంటుండగా పొలంనుంచి మనిషి వచ్చాడు.

"అయిపోయింది. ఆ దొడ్లో నాలుగు అరిటాకులు కోసుకురా. ఇంక బయలుదేరుదురుగానీ" అంది.

అవి కూడా తట్టమీద పెట్టుకున్నాక బయలుదేరారు. దారిలో సాంబయ్యను ఎవరెవరో పలకరిస్తూనే ఉన్నారు.

"ఏందిరా సాంబయ్యా... చేనుకాడికి పోత న్నావా"

"మా నాన్న రమ్మన్నాడు"

"ఈ రోజుతో మీ అయ్యకి మామూలు పని అయిపోతుందిలే"

చేలగట్లమీదుగా నడుస్తుంటే వస్తున్న గాలీ, పొలాల్లో గుంపులుగా కనిపిస్తున్న మనుషు లూ... అక్కడక్కడా దర్శమిస్తున్నా వరికుప్ప లూ... చాలా ఆహ్లాదకరంగా ఉంది వాతావ రణం.

తట్ట చూడగానే అందరూ పనులు ఆపేసి చేతులు కడుక్కుని వచ్చారు. "భీవుడూ" అంటూ పిలిచాడు భూషయ్య.

"అందరికీ ఇస్తర్లు వెయ్యండిరా మీ ఇద్ద రూ"

"భూషయ్యగారూ చిన్నబ్బాయిగోరెందుకు లెండి" అంటూ మొహమాట పడుతుంటే...

"నువ్వట్టా కూకో ఎంకయ్యా" అంటూ తనే గారెలు అందుకున్నాడు. ఇంకోపక్కన పూర్ణా లు కూడా ఉన్నాయి.

"సాంబయ్యా నువ్వాటిని అందుకో" అంటూ అందరి దగ్గరికి వెళ్లి వడ్డించటం మొదలుపెట్టాడు.

"గారెలప్పుడే తినేయ్యబాకండి... పచ్చడి చేసి పంపిచ్చుద్ది... చూడరా... ఆ నేతిగిన్నె పట్రా" అంటూ అరిచి... ఆ తర్వాత తనే అందుకుని చాలు బాబూ అంటున్నా విన కుండా వడ్డించాడు.

"తులసమ్మగారి చెయ్యంటే చెయ్యి" అంటున్నారెవరో... సాంబయ్యకి కూడా ఓ ఆకు వేసి... 'నువ్వూ తినరా' అంటూ వడ్డించాడు.

వారందరితోనూ కూర్చుని తింటుంటే వన భోజనాలకు వెళ్లినట్లుగా అనిపించింది. అత్యంత తృప్తితో అక్కడివారందరూ భోంచేశా రు. చేతులు కడుక్కున్నాక అందరూ తలోప క్కన నడుం వాల్చారు.

"భూషయ్యగోరు నెయ్యి చాలంటే యింటేగా... ఇంక ఈ పూటతో పనాపెయ్య టమే"

"అంటే రేపు కూడా తులసమ్మగారి చేతి వంట తింటాడు కాబోలు" అన్నాడో యువకు డు. అతను అయిదోతరగతివరకూ చదువు కొని, ఆ తర్వాత ఎందుకో తిరిగి పనులు చేసుకోవటానికే వచ్చేడు. వారందరూ మాట్లా డుకుంటుంటే భూషయ్యగారు భీముడితో కలసి భోజనం చేస్తున్నాడు. అయిపోయాక వచ్చి అన్నాడు.

"ఇంక లేద్దామా"

"ఉప్పుడేగదండయ్యా తింది. మెతుకు లింకా కడుపులో ఉన్నాయి"

"నీ ఇష్టం వచ్చినప్పుడు లేద్దాం కోటేసు" అన్నాడాయన.

ఓచోట కూర్చుని సాంబయ్యను దగ్గరికి పిలుచుకున్నాడు. ఏదో చెప్పాలని ఆరాటం ఉంటుంది. అయితే ఎలా చెప్పాలో అర్థంకా దు.

"అది కాదురా... మనం పనిచెయ్యకుండా ఆళ్లని చెయ్యమంటే చెయ్యరు. మనం కూడా వాళ్లతోపాటు పనిచేత్తాఉంటే చకచక పనులు చేత్తారు" అన్నాడు.

సాంబయ్య మాట్లాడకుండా నాన్నకేసే చూశా డు.

"ఇన్ని మాసాలనుండి పసిబిడ్డని పెంచు కున్నట్లు సాక్కొచ్చా. ఏదైనా చేతికొచ్చిందాకా మనదిగాదు. ఈసారి రెండోపంట ఇత్తాలో... మినుములు చల్లాలో" అంటుంటే కోటేసు లేచి వచ్చాడు.

"భూషయ్యగారూ... అబ్బాయిగారు బాగా చదువుకుంటున్నాడా?"

"అడ్నె అడుగు"

సాంబయ్య తలూపాడు.

"అబ్బాయిగోరికి పట్నంలో పెద్ద నౌకరీ దొరకాలయ్యగోరు" అన్నాడు.

"ఈ తులసమ్మకి చెబితే గయ్యిమంటదిగాని నౌకరన్నాక ఎవుడో ఒకడికి తలకాయొంచా లిగా కోటేసూ"

"అదయితే నిజమే దొరా... అయినా కలకటే రు నౌకరయితే ఆయనగోరి దగ్గరికే అందరూ అగెత్తు[illegible] కదండయ్యా"

"కలకటేరుగానీ... అది బాబుగానీ అది మీన ఇంకో మొగుడుంటాడు కోటేసూ"

"అయ్య..."

"అందుకే భూవిని నమ్ముకోవాల. మడిసికి రెండెకరాల చెక్కుంటే సరిపోదా కోటేసూ"

"సరిపోతుందండయ్యా"

"ఎవడిపని వాడు చేసుకు బతకాల. సాంబయ్య కూడా భూవిని నమ్ముకుంటే సరిపోలా?"

కోటేసు సంశయంగా గొణుగుతుంటే అన్నాడు.

"ఓయ్..."

"అది కాదులే భూపయ్యగోరు. అబ్బాయిగోర్ని సదువుకోనీండి. అదిసరే బాబో... గేదె ఈనుద్దని తులసమ్మగోరు అన్నారు" అంటూ మాటమార్చేడు.

తిరిగి భూపయ్యగారు తన ధోరణిలో తను పడిపోయాడు.

"అవును కోటేసూ- ఇయ్యాలా... రేపా అన్నట్టుంది"

"ఈసారి పెయ్యదూడయితే బాగుంటది"

"ఏ దూడయితే ఏందయ్యా... ఆటికి మనం చేసేదేవుంది. ఆటమ్మ దగ్గర పాలుకుడుస్తాయి. ఆటితిండి అయితింటాయి. ఏళకి కొంచెం వొళ్ళు కడిగి ఆటిముందు గడ్డి పడేస్తే చాలు. ఇంక లేద్దామా... పొద్దు గూకిపోద్ది"

"లెగుద్దాం అయ్యగోరూ" అంటూ కోటేసు నిలబడి పెద్దగా కేకపెట్టాడు. సాయంకాలం నాలుగు గంటలు అవుతుందనగా పొలంలో ధాన్యపు రాసి... ఆ దృశ్యం ఎంతో అపురూపంగా ఉంది. సంవత్సరం పొడవునా తమ రక్తం ధారపోసి సృష్టించిన సంపద అది.

వాటినన్నింటిని గోతాల్లోకి ఎత్తారు.

బండి తయారయివుంది.

"ఏం బాబూ... బండి తోలతావా?" అన్నాడు భీముడు.

"నాకు రాదుగా" అన్నాడు సాంబయ్య.

"రాదంటే ఎట్టా నేర్చుకోవాలి. తొట్లో కూకోండి. నేను చూపిత్తా" అన్నాడు.

సాంబయ్య బండిఎక్కి తొట్లో కూర్చున్నాడు. దాన్నిండా గడ్డిపరిచి దానిమీదో గోతాంవట్టా పరిచారు. భూపయ్యగారింకా ఎవరితోనో మాట్లాడుతూనే వున్నాడు. కళ్లాం దగ్గర చాకలాయనా, మంగలాయనా గోతాలు పట్టుకుని నిలబడి వున్నారు. అక్కడో మానిక కూడా వుంది. దాంతో ధాన్యం కొలిసి పోశాడు. కొలిచే ముందు గోతాంలో కొంచెం ధాన్యంవేసి ఆ తర్వాత కొలిచాడు.

"సరిపోయిందా" అన్నాడు.

"అయ్య..." అంటూ వాళ్లు సంచుల మూతులు కట్టుకోవటం ఆరంభించారు.

ఆ చుట్టుపక్కల వరిగెలు ఏరుతున్న పిల్లల్లో కొందరు వచ్చి నిలబడ్డారు.

"మీకేంట పనేంది" అంటూ కోటేసు వెంటపడ్డాడు.

"అయ్యగోరూ..." అంటూ వాళ్లింకా అలానే నిలబడితే...

"ఏందే... ఏమాత్రం ఏరుకొచ్చా..." అంటూ అడిగాడాయన.

"ఆ ఎన్నిలెండయ్యా... నూర్పుకుంటే అన్ని తాలుగింజలు నడువులొంగిపోయినయిగాని గిద్దెడు గింజలు రాల్లా"

"అయితే నన్నేం చెయ్యమంటావే"

"నీ దయ దొరా"

"కోటేసూ... ఆ పిల్లలందరికీ తలా సోలెడు పోసి పంపు"

"ఎందుకండయ్యగోరూ... మీరూరుకోండి"

"పోనీలే కోటేసూ... మనచేలో పరిగ ఏరుకున్నా ఏం దొరకదు. అయినా పండిందంతా మనదేనా? ఎవడికెంత చేరాలో... ఎక్కడికి చేరాలో అక్కడికి చేరిపోద్ది" అంటూ వేదాంతం మాట్లాడాడు.

అంతా అయిపోయాక బళ్లన్నీ బయలుదేరాయి. వెనకాల కర్రతో బయలుదేరి వచ్చాడు భూపయ్య. భీముడు బండితోలుతూ చెప్పాడు.

"ముందు నాకు బండితోలటం రాదు. వెలపటదేదో... దాపటిదేదో చెప్పమని నన్ను పరాచికాలాడేవోరు. మనయ్యగోరు ఊరుకోరుగాని మన దున్నల్ని పందాలకు తీసుకెళ్తే... సిగదరగ ఆటికెదురేలేదు"

"పందాల్లో ఏం చేస్తారు?"

"బరువులేసి లాగిత్తారు. ఏది ముందువెళ్తే అది గెలిచినట్టు"

"మరి నాన్న పందాలకి ఎందుకు ఒప్పుకోడు?" అన్నాడు సాంబయ్య.

"నోరులేని జీవాల్తో పోటీ ఎందుకంటాడు దొర. అయినా దున్నపోతులు బరువులు మొయ్యటాకేగదా పుట్టింది"

"అవును" అన్నాడు సాంబయ్య తనకు తెలియకుండానే.

ఆ చుట్టుపక్కల సంవత్సరానికో, రెండు సంవత్సరాలకో పందాలు జరుగుతుంటాయి. అందులో ఎడ్లపందాలూ ఉంటాయి. దున్నపోతుల్తో కూడా ఎప్పుడైనా జరుగుతుంటాయి. మొత్తం గ్రామీణులంతా ఆ పోటీలపట్ల ఎంతో ఆసక్తి కనపరుస్తారు. వారిలో వారికి పోటీలు జరుగుతుంటాయి. ఒక్కోసారి అవి పట్టుదలలుగా మారతాయి. అయితే సాధారణంగా గ్రామీణులు ఆనందించే పోటీల్లో ఇవి ఒకటి.

భూషయ్యగారికి మాత్రం ఈ పోటీలు ఏమాత్రం ఉత్సాహం కలిగించలేకపోయాయి. ఒకటి రెండుసార్లు అలాంటి పోటీలకు ఎవరి బలవంతంమీదనో వెళ్లి ఆ తర్వాత చాలారోజులపాటు బాధపడుతుండిపోయాడు.

"ఏంటో ఎవడివెర్రి వాడికానందవని... అంతంత బరువులేసి... పానం పోయేట్టు బాదితే గెలిచినట్టా... ఎందుకంటా ఇయన్నీ"

ఆయన బండి తోలుతున్నప్పుడయినా సాధ్యమైనంతవరకూ వాటి వంటిమీద దెబ్బ పడనీయడు. చెర్నాగోలు గాల్లో మోగాల్సిందే తప్ప వాటి శరీరాన్ని తాకదు. సామాన్యంగా చాలామంది బండినడక మరీ మెల్లగా వుందంటే వాటిని కొట్టకపోయినా తోక మెలిపెట్టటం, బూతులు తిడుతూ అదలించటం చేస్తారు. భూషయ్యగారు అలాను చేయడు. మెల్లగా వాటిని బతిమాలుకునే రీతిలో నడుపుతాడు. అవి కూడా ఆయన మనను తెలుసుకున్నవిధంగా ప్రవర్తిస్తాయి. ఎప్పుడూ నడువనని మొరాయించవు.

తనకు ఏ అభిప్రాయాలూ లేనట్లుగా, ప్రపంచంలో ఏ విషయం పట్టనట్లుగా కనిపించే తన నాన్న ఉద్యోగాల విషయంలోనూ, ఎడ్ల పందాల విషయంలోనూ ఏర్పరచుకున్న అభిప్రాయాలు సాంబయ్యను ఆశ్చర్యపరిచాయి. దారిపొడుగునా అడుగుతూనే వున్నారు.

"ఏయ్... ఏమాత్రం రాలినియి"

"ఓ పాతిక కాడికి అయ్యుంటాయి"

"ఫర్వాలేదు గానీ... ఇంకో నాలుగయితే బాగుండేది... పురిగాని కడుతున్నావా?"

"పురా... ఇంకేవన్నానా? తిండిగింజల కుంచుకుని ఒకిడతవి అమ్మితేగానీ కుదరదు. ఇంకా బాకీలుండిపోలా..."

"అవున్లే... ధరడిగావా?"

"లేదే... పూర్ణయ్యగారికి తెలునుగా. అన్నీ ఆయనే చూసుకుంటాడు..."

ఇంటిముందు బండ్లు ఆగాయి. బస్తాలన్నీ ఓ మూలగా పేర్చారు. కొన్ని బస్తాలు ఇంటిలోపలి బల్లమీద సర్దించాడు.

తులసమ్మకి ఇంటికొచ్చిన ధాన్యం చూసుకున్నాక కళ్లలో తృప్తి కనిపించింది. ఏమాత్రం అయ్యాయని తనూ అడిగింది. ఇరవైఎనిమిది దాకా అయినట్లు చెప్పాడు.

"ఇంకా తాలూ... తప్పా ఉంటయ్యిగా" అన్నాడు.

"సాంబయ్య ఏం చేశాడు?"

"ఆడేం చేత్తాడు. దిక్కులు చూశాడు. అట్టా కూకుండేబదులు ఆడూ వచ్చి పనిచేయొచ్చుగా" అన్నాడు.

"చాల్లే... నువ్వు చేస్తంటేనే ఇన్ని వడ్లొచ్చిపడతన్నాయి. అయ్యా కొడుకూ కూడా చేత్తే అయ్యన్నీ ఎక్కడ పోసుకుందాం"

"సర్లే... దానికెట్టా వుంది" అన్నాడు.

"ఏమో ఈరోజు రేత్రికి నిద్రపోనిచ్చేట్టు లేదు"

"ఒక్కరోజు నిద్రదేవుందిలేవే. ముందావనయితే బాగుంటది. దాని బాధ చూడలేకపోతున్నా..." అంటూ వెళ్లాడు.

ప్రసవవేదన అనుభవిస్తున్న నెలలు నిండి నగేద తన యాజమానివంక దీనంగా చూసింది. భూషయ్యగారు వెళ్లి తలమీదా, పొట్ట





మీదా చేతులువేసి నిమిరాడు.

''అయిపోతుంది, ఈరోజు అయిపో తుందిగా'' అన్నాడు ఉదరాన్ని స్పృశిస్తూ...

అట్లా ఆపనీ, ఈపనీ చేస్తుంటే సమయం ఎప్పుడు గడిచిందో తెలియదు. సాంబయ్యా పుస్తకాలు ముందేసుకొని జోగుతున్నాడు.

''సాంబయ్యా పడుకుంటావా?'' అంది తులసమ్మ.

''నేను నిద్రపోవటంలా'' అన్నాడు సాంబయ్యా.

''పొద్దునే ఎండలో తిరిగివచ్చావుకదా... కళ్ల మీదకు చూడు నిద్రముంచుకువస్తోంది. ఈ రోజుకి పడుకోలే. రేపు చదువుకుందువుగానీ'' అంది.

సాంబయ్యా కూడా మాట్లాడకుండా లేచివెళ్లాడు.

పడుకోగానే నిద్రపట్టేసింది.

మామూలుగా రోజూ మెలకువ వచ్చే సమయానికి మెలకువ వచ్చింది. కొద్దిసేపు ఎవరి మాటలూ వినిపించలేదు

''దాని బాధ చూడలేకపోతున్నానే... చావిడంతా తిరుగుతుంది'' అంటూ వచ్చాడు.

''అదంతేలే... నొప్పులు వస్తున్నాయి. నువ్వొచ్చి ఇటు కూర్చో'' అంది.

''నొప్పులొస్తుంటే ఎలాగే'' అన్నాడు.

''పోనీ- దానిబదులు నువ్వు కను'' అందామె చిరాకుగా.

''ఏంటామాటలు కొంచెం లాంతరు తీసుకుని నువ్వూం'' అని తిరిగి చావిడి దగ్గరకు వెళ్లిపోయాడు.

సాంబయ్యకు కూడా లేచి ఏం జరుగుతుందో చూడాలనిపించింది. అయితే లేవాలంటే బద్ధకం వేసింది. మరి కొంచెం సేపటికి ఎలాంటి మాటలూ వినిపించకపోవటంతో తిరిగి నిద్రలోకి జారిపోయాడు.

ఆ గేద బాధ భరించలేక మూలుగుతుంది. మనిషి కళ్లనీళ్ల పర్యంతం అయిపోయాడు. కొద్దిగా బయటకు వచ్చిన తలను పట్టుకుని గేదతోపాటు చుట్టూ తిరుగుతూనే వున్నాడు. అలా ఎంతసేపు తిరిగాడో లెక్కలేదు. ఎప్పటికో దూడ బయటకు వచ్చింది. దాన్ని జాగ్రత్తగా గడ్డిమీద పడుకోబెట్టాడు. ఆ తర్వాత అలానే కూర్చుని 'మాయ' వేసేదాకా ఆగి... అది తీసుకువెళ్లి పారేసివచ్చాడు. ఆ దూడగోళ్లు గిల్లాడు. ఇంకా ఏమేమో చేస్తున్నాడు. తులనమ్మ తన భర్తకేసి మంత్రించినదానిలా చూస్తోంది.

ఎవరితను? మొగమనిషేనా? కేవలం తమ సుఖం తప్పితే మాతృత్వాన్ని అందించటానికి స్త్రీ పడే తపనను అర్థం చేసుకునే తీరికలేని పురుషజాతికి చెందిన వ్యక్తా? కాదు... కానేకాదు. జన్మనివ్వటంలోని మధురమైన అనుభవమూ, ప్రాణంపోయే బాధా తనకు తెలును. అయినా సరే ఈ అనుభవాలన్నీ ఉన్నా బొమ్మలా నిలబడిపోయింది.

ఎందుకాయన కళ్లలో నీళ్లు... ఎందుకా వ్యక్తి అంతగా తపించాడు. అతనికి వాసన లేదా? చీదర లేదా? జలదరింపు లేదా? అత్యంత క్రమశిక్షణతో పని పూర్తిచేసే డాక్టరా తను? ఎండలో, వానలో, చలిలో తన శరీరాన్ని నిరంతర బాధకు గురిచేయటం మాత్రమే తెలిసిన ఈ వ్యక్తిలో ఇంతటి అపురూప స్పందనలున్నాయా? ఇది పిచ్చా? ఛాదస్తమా? మాటలకందని గొప్ప భావమా? మనిషికీ, ప్రకృతికీ, మనిషికీ, జంతుజాలానికీ ఉన్న సజీవ సంబంధాల ప్రేరణా?

ఏమిటిది? ఆ పశువు ఎంత బాధననుభవించిందో తను చెప్పలేదు. కానీ తన భర్త బాధను తను చెప్పగలదు. తన బిడ్డను చూసి ఆ పశువు పొందే ఆనందమూ తను ఊహించలేదు. ఎర్రటి ఎండలకు నల్లబడిపోయి... గడ్డం పెరిగిపోయిన తన భర్త కళ్లలో మాత్రం గొప్ప సంపద కనిపిస్తోంది. ధన్యుడు... అంతవరకూ ఖాయం. మానవజన్మగానీ, పశువుల జన్మగానీ... మరింకేమైనాగానీ...

ఇంకేమైనా అంటే... అవును... మొక్కలే... తనే స్వయంగా పాదులు తీస్తాడు. విత్తనాలు నాటుతాడు. నీళ్లు పోస్తాడు. తను నాటిన విత్తనాలు తమ మొదటి లేత ఆకుల్ని ప్రపంచానికందిస్తున్నప్పుడూ అంతే... ఆ మనిషి పులకరిస్తాడు...



ఉదయాన్నే లేచి... పాలు ఇస్తున్నప్పుడూ... దూడ చెంగుచెంగున వెళ్లి మాతృమూర్తి దగ్గర ఆబగా పాలు కుడుస్తున్నప్పుడూ...

ఇదే ఆనందం... ఇదే అనుభూతి.

ఒక్కసారిగా భూమంతా నెర్రులు విచ్చుకొని... భూమి హృదయంనుండి ఉవ్వెత్తున దుఃఖం ఎగిసిపడుతుందా అనుకున్నప్పుడు ఆ కళ్లు చిన్నబోతాయి. ఆకాశంకేసి దీనంగా, ఆశగా చూస్తాడు. చినుకుపడితే భూమి పులకరిస్తుందో, లేదో తెలియదు. తను పులకరిస్తాడు. తన నాగలితో భూమంతా చదునుచేసి... తను చల్లిన విత్తనాలు మొలకెత్తి వచ్చుదనాన్ని నింపుకుంటే... ఆ కళ్లలో వెలుగులెన్నెన్నో...

ఎవరితను?

భూమి పుత్రుడు?

ఇతనికి తెలిసిందేమిటి?

నిర్మలంగా ప్రేమించటం...

ఎచటివాడు? ఏదేశంవాడు? ఏం చదివాడు?

ఏమీ చదువుకోలా... ఈ భూప్రపంచంలో ఓ మారుమూల గ్రామంలో అత్యంత సాధారణ వ్యక్తి... అతను నేర్చుకుందొకటే... జీవితం కోసం జీవించటం... జీవితంలోని అనుభవాన్ని ప్రేమించటం.

సాంబయ్య నడిచివచ్చాడు ఇంకేమాత్రం నిద్రపట్టని సమయంలో. అప్పుడు గడ్డితో తన చేతులు తుడుచుకుంటున్న నాన్న కనిపించాడు. ఆయన దగ్గరగా అమ్మ కనిపించింది.

ఈ ప్రపంచంలోకి అంతకుముందే ప్రవేశించిన ఓ ప్రాణి కనిపించింది. ఆ లేత హృదయంలో అవ్యక్తమైన తీనందం కలిగింది. అది ఎందుకో ఆ క్షణం సాంబయ్య చెప్పలేడు. ఆ తర్వాతికాలంలోనే 'రావ్'కు అనుభూతం అయింది.

"మిస్టర్ రావ్... నా మిసెస్‌కి ఎబార్షన్ చేయించాను"

"ఎందుకని?"

"మళ్ళీ ఆడపిల్ల"

"ఇప్పుడు నీకుంది ఒకటే ఆడపిల్లకదా"

"అవుననుకో. అయినా ఇప్పుడు మాకు మగబిడ్డ కావాలి"

"అలా అని చెప్పి..."

ఆ రోజంతా బాధ... ఈ ప్రపంచం ఎంతగా మారిపోతుంది! జననమనే అద్భుత విషయాన్ని ఎంతో ప్రేరణతో ఆహ్వానించే చోటులో నాగరికత పెరిగిపోయాక ఇంత దారుణమా? అయినా ఇద్దరు అమ్మాయిల్ని కూడా భరించలేరా? మరి తమ తండ్రులు అంతమందిని ఎలా కన్నారు? ఏ ధైర్యంతో కన్నారు? ఎలా పెంచారు? అలా అంటున్నామంటే అంతమంది పిల్లల్ని కనమనా? ఖచ్చితంగా కాదు. అయితే ఓ జననాన్ని నిరోధించటం అంటే... అది కూడా... ఓహ్... దారుణం... చాలా చాలా దారుణం...

మనిషి మారిపోతున్నాడు. బహుశా ఈ విషయం తన తండ్రికి తెలిస్తే ఎలా ఉంటుంది?

అంతకుమించి ఓ రాత్రంతా ఓ పశువు కోసం తన తండ్రి ఆరాటపడ్డాడంటే తన చుట్టూ ఉన్న మనుమలు ఏమంటారు? ఆయన్ని ఎలా అర్థం చేసుకుంటారు?

ఆ క్షణం నవ్వూ, ఏడుపూ, ఏకకాలంలో వచ్చాయి.

అప్పుడే ఏదో పుస్తకం కనిపించింది రావ్‌కి.

"సైన్స్ అండ్ టెక్నాలజీ"

ఎక్కడికి? ఎవరికి?

ఏ అగాధాల్లోకి పయనం?

తిరిగి ఆలోచనలను తెంపుతూ ఫోన్ రింగయింది.

* * *

ఫోన్ అందుకున్నాడు సాంబశివరావ్.

"అవును... నేనే మాట్లాడుతున్నా"

"గంగాధర్ ఫోన్‌చేసి పెట్టాడు. ఐయామ్ వెరీసారీ..." అవతలనుండి కంఠం వినపడుతూంది. ఆయనే అడిగాడు-

"అసలు ఎలా జరిగింది?"

"అదే మాకు అర్థంకావటంలేదు. ఈరోజు ఉదయంకల్లా ఎటువంటి పరిస్థితుల్లోనూ వెళ్తానన్నారు. ఎంతసేపటికీ లేవకపోయేసరికి అనుమానం వచ్చింది. లేపాం. ఆ తర్వాత





తెలిసింది''

"హార్ట్‌ఎటాక్‌లాంటిది వచ్చుంటుందా?"

"అదేనని నాకు అనుమానం"

"ఇంతకుముందు అలాంటి సంఘటనలు ఐమీన్ ఎప్పుడైనా వచ్చిందా?"

"అదేంలేదు... బహుశా ఇదే మొదటిసారి"

"మీ ఇంట్లో ఇలాంటివి ఇంతకుముందు జరిగాయా?"

"నో... ఆయన ఇప్పటికీ తన పనులు తాను చేసుకొంటాడు. నాకు తెలిసినంతవరకూ కనీసం చీదిఎరగడు. ఆయన్తోపాటు ఈ రోజుకీ మనం నడవలేం. మరి ఎందుకిలా జరిగిందో నాకు అర్థంకాలేదు"

"ఐయామ్ వెరీ సారీ రావ్... ఇలాంటి సమయంలో జరగటం నాకు చాలా బాధ కలిగిస్తూంది. ఇంకా నయం. ప్రస్తుతం ఫోన్లు పనిచేస్తున్నాయి. అవి కూడా పనిచేయకపోతే ఏం జరుగుతుందో. నిన్న సాయంకాలందాకా ఏంలేదు. ఆరుగంటలకి నేను సికింద్రాబాద్‌లో ఉన్నా. అప్పటికే గొడవలు జరుగుతున్నాయనుకుంటా... జనంలో ఏదో ఆందోళన కనిపించింది. పోలీసులు కూడా చకచకా రోడ్లమీద కొచ్చేశారు. మనవరికి ఫర్వాలేదనుకో. ఏరోజుకారోజు పొట్టపోసుకునేవారి పరిస్థితి ఏమిటి? డెలివరీ కేసులుంటాయి. అర్జెంటు కేసులుంటాయి- ఇవన్నీ ఎలా?" ఆయన చెప్పుకుపోతున్నాడు.

సాంబశివరావు మౌనంగా వింటున్నాడు. ఆయన చెప్పిందంతా విన్నాక అన్నాడు-

"ఏంచేద్దాం. ఇవన్నీ మనం భరించాలి. అసలు ఇలాంటి పరిణామాలు రాబోతున్నాయని సూచనలు కనిపిస్తూనే వున్నాయి. మనం నిర్లక్ష్యం చేశాం. ఇదంతా ఎవరో చూసుకోవాలనుకున్నాం. మరి ఈరోజు ఆక్రోశిస్తే లాభం ఏముంటుంది?" ఖచ్చితంగా అన్నాడు.

"అది సరే ఇప్పుడేమిటి చెయ్యటం?"

"చేసేదేముంది. నాన్న శవాన్ని మా ఊరు తీసుకుపోవాలి. గంగాధర్ ఆ ప్రయత్నంలో ఉంటానన్నాడు. అతని ఫోన్‌కోసం చూస్తున్నా"

"రిస్క్ తీసుకుంటున్నారు"

"తప్పదుకదా"

"ఏమైనా జాగ్రత్త. మీరు వచ్చాక ఫోన్‌చేసి చెప్పండి"

"అలాగే"

"మీ అమ్మగారికీ, మీ కుటుంబానికీ నా సానుభూతి. మీరు ధైర్యంగా ఉండండి. అమ్మకు ధైర్యం చెప్పండి- ఉంటా"

ఫోన్ పెట్టేశాడు.

"ఎవరు?" వాకిట్లో నిలబడిన సులోచన అడిగింది.

"రాజారావుగారు ఫోన్ చేశారు. ఆయనకి గంగాధర్ చెప్పాడంట" అన్నాడు సాంబశివ రావ్.

"గంగాధర్‌గారి ఫోన్ రాలేదుగా" అంది.

"రాలేదు" అన్నాడు.

సులోచనకు చాలా ఆందోళనగా వుంది. మరీ ముఖ్యంగా తన భర్త మానసిక పరిస్థితిపట్ల ఆమెకు అంతులేని వేదన కలుగుతుంది. ముందసలు ఉదయంనుండీ ఆయన గంభీరంగా ఉన్నతీరే ఆమెకు ఆశ్చర్యానికి కారణం.

"అమ్మా... పెద్దాయన లేపినా లేవటంలేదు" అంటూ వచ్చి చెప్పింది పనిమనిషి ఎందుకో అనుమానం వచ్చింది. అప్పటికి రెండురోజులనుండి వెళ్లిపోతానంటూ గొడవ- "వెళ్దురుగానిలే మావయ్యగారూ" అంది.

ఈ నడుమే కారుని రిపేర్లకోసం గ్యారేజ్‌కి పంపించారు. అది వస్తే దానిలో పంపించాలని అనుకున్నారు. అది ఈరోజూ రేపూ అంటూ ఆలస్యం జరిగిపోతూనే ఉంది.

"నాకు కారెందుకమ్మా... బస్సులో ఎళ్తాగా" అన్నారు.

"అదేంకాదు. మీ అబ్బాయి కార్లోనే పంపించాలంటున్నారు"

"ఆడికేంటి సంపాయిస్తన్నాడుగా... అట్టానే చెబుతాడు. నేను కారుల్లో కూకుంటే నవ్వరంటమ్మా"

"ఎవరు మావయ్యగారూ నవ్వేది? అది మీ అబ్బాయి కారు. ఆయన స్వయంగా సంపాదించి కారు కొనుక్కున్నారు. ఇందులో ఒకరు





నవ్వటానికేవుంది?'' అంది.

"నీకు తెలియదమ్మా. ఇక్కడంటే అందరూ కారుల్లో తిరుగుతున్నారు. మరి మేవంతా కాళ్లకి సెప్పుల్లేకుండా నడిచినోల్లం. చేతిలో కఱ్రుంటే చాలు. ఎంత దూరమైనా నడుచుకుంటూ పోటమే. అలాంటోడ్ని కారులెక్కి పంపిత్తానంటే ఊర్లో నవ్వుతారు మరి'' అన్నాడు.

ఆమెకి కూడా ఆయన ఛాదస్తానికి నవ్వు వచ్చింది.

"ఊరు నవ్వటమేంటి? మీ అత్తే నవ్వుద్ది. ముసలాయనా నీకు సోకులు కావాలా అంటూ. ఇప్పటికే ఊళ్లో ఏవనుకుంటున్నారో తెల్సా?'' అని ఆగాడు.

"ఏమనుకుంటున్నారు మావయ్యగారూ''

"భూషయ్యా... నువ్వు ఇన్ని ఏళ్లపాటు రెక్కలు ముక్కలు సేసుకొని సంపాయించకపోయావు. నీ కొడుకు చూడు చిటికెలో సంపాయించాడు. ఆడి దగ్గర మంతరదండం ఉందా అనడుగుతుంటారు''

"మీరేమంటారు?''

"నేనేవంటానమ్మా. ఆడిదగ్గర ఏవుందో. ఆడిదగ్గరకి ఇంత డబ్బులు ఎట్టా వచ్చాయో నాకు తెలవదు. ఆడ్ని నేను అడగలా. అడగను కూడా. ఆడు ఏంచదివాడో, ఎన్ని మారుకులు వచ్చినయ్యో నాకు తెలవదు. అంతా ఆడూ తులసమ్మా చూసుకున్నారు. ఆడేం అడిగినా తులసమ్మనే. ఆడికి డబ్బులు కావాలంటే అదే చెప్పేది. నేవెల్లి ఆ పూర్ణయ్యగారిని అడిగేవోణ్ణి... ఆయనిచ్చింది తీసుకొచ్చి దాని చేతుల్లో పెట్టేవాడిని. అంతటితో నా పనయిపోయిందన్నమాట''

"మీ అబ్బాయిని గురించి మీరేం అనుకుంటున్నారు?'' అంది సులోచన కుతూహలంగా.

భూషయ్యగారు కోడలి ప్రశ్నకి కొంచెం ఇబ్బంది పడ్డాడు.

"అనుకుంటానికేం వుందమ్మా... ఆడూ నేనూ ఎక్కువ మాట్లాడుకోంగా. సిన్నప్పటి నుంచీ అంతే. మా నాయనతో కూడా అంతే. నేను పొలంపనులకి పోతంటే ఆయనేవనుకున్నాడోగాని నన్నేవనలా. మరి సాంబయ్య కూడా బళ్లోకి పోతానంటే నేనూ ఏవనలా. ఆడికి కళ్లనిండా నీళ్లుంటాయి. గట్టిగా ఏవన్నా అంటే బొటబొట కారిపోతాయి'' అన్నాడు.

"మీ మనవరాలు మిమ్మల్ని వెళ్లనీయనూ అంటుంది. దానికి నాయనమ్మా, తాతయ్యా కావాలంట'' అంది.

"చిన్నపిల్లకాయకదా. అట్టాగే అంటది. రేపు మనువు చేసుకొని ఎల్తే అమ్మా వద్దు... బాబూ వద్దు'' అని నవ్వాడు.

"ఈ మాటలు వింటంటే మీ మీదపడి గోల చేస్తుంది''

"దానిగోల భరించలేక వచ్చాగా... నాలుగు రోజులున్నా. ఇంతవరకీ తులసమ్మని యిడిసిపెట్టి వుండలా... గొడ్డూ గోదా ఎట్టా వున్నాయో మరి. నాకింక గాలి తిరిగింది. అసలు ఇంటి కాడ ఆళ్లంతా ఎట్టా వున్నారో సూసుకోవాలి. అందుకే నామాట విను. నేను పొద్దున్నే లేచి బస్సుకి ఎల్లిపోతా. మళ్లీ వత్తాగా... ఈసారి నేనూ తులసమ్మా వత్తాంగా''

"మీరేం రారు. అందులోనూ మీరిద్దరూ కలిసి అసలు రారు. ఇక్కడ మమ్మల్ని అందరూ అడుగుతున్నారు. ఎందుకని మీ మావగారూ, అత్తగారూ మీ దగ్గరికి రారు? మీకేవైనా తగాదాలున్నాయా అని''

"ఉన్నాయని చెప్పకపోయావా?'' అన్నాడాయన.

"అందరూ వెనకాల నన్నే అనుకుంటారు. మీరు రావటం నాకు ఇష్టం వుండదేమోనని''

భూషయ్యగారు నవ్వేరు.

"ఎవరేమనుకుంటే మనకేంటమ్మా. అయినా ఈ వంట్లో ఇంకా ఓపికుంది. ఓపికున్నంతవరకూ మనిషి పనిచేసుకు బతకాలి. ఈ ఓపిక కూడా అయిపోయి మంచంలో పడ్డావనుకో అప్పుడెటూ మీ దగ్గరకు రావాల. అప్పుడు నువ్వొద్దన్నా కుదరదు. అంతదాకా మాకు అక్కడుండేనే బాగుంటది'' అన్నాడు.

"అయినా ఇంక మీరు దగ్గరుండి వ్యవసాయం చేయించటం అనవసరమండి. కౌలుకిచ్చేస్తే బాగుంటుంది. అంతగా అయితే ఓ



గేదెని ఉంచుకుని మిగతావాటిని అమ్మివేయ మని ఆయన అంటున్నారు. ఈ వయసులో ఖాళీగా కూర్చుని కృష్ణా రామా అనుకుంటే సరిపోతుందికదా'' అంది.

భూషయ్యగారు మాట్లాడకుండా- ''సరిపో తుంది'' అన్నాడు.

మరి ఇంత త్వరగా తను తన ఊరికి శాశ్వతంగా ప్రయాణం చేయగలడని తను ఊహించలేదు. ఎలా ఊహిస్తుంది? మనిషి చక్కగా తిరుగుతున్నాడు. హాయిగా తింటు న్నాడు. వేళకు నిద్రపోతున్నాడు. ఇలా జరుగు తుందని ఊహించటానికి తనకు ఎలాంటి ఆధారాలూ కనిపించలేదు.

రాత్రంతా ఆయన గురించే మాట్లాడా యన.

వారిద్దరి సంబంధం కూడా చాలా తమా షాగా వుంటుంది. ఇద్దరూ ప్రత్యేకమైనవారే. రాగానే ఆయన అడిగింది...

''ఎప్పుడొచ్చావ్ నాన్నా...'' అని.

''ఇప్పుడేగా వత్తన్నాం''

''అమ్మ బాగుందా?''

''ఓయ్...'' అన్నాడు సరిగ్గా వినపడక.

''అమ్మ ఆరోగ్యం ఎలా వుంది?''

''బాగానే వుంది''

''అమ్మని కూడా తీసుకురాకపోయారా?''

''అదెట్టా వచ్చుద్దిరా...''

''ఏమవుతుంది... తాళంవేసి రావల సింది''

''ఇప్పుడు కాదులే''

''అంతటితో ఆ సంభాషణ పూర్తయిపో యింది. రాత్రి తనే అడిగింది-

''ఇంకా ఆ పొలంపనులు ఆయన చే యటం ఎందుకండి? అసలా పొలం అమ్మేస్తే సరి'' అని.

''కొంపతీసి ఈమాట ఆయన్తో అన్నా వేంటి?'' అన్నాడు.

''లేదు... మీతోనే అంటున్నా''

''మంచిపని చేశావ్. ఆయనకి ఆనందం కలిగించే విషయం అది. పొలంలో ఎంత పండుతుంది? అది లాభమా? నష్టమా? ఈ లెక్కలు ఎప్పుడూ వేసుకోలా. చాలామంది మా ఊర్లో రకరకాల పంటలు వేసేవారు. ఈయన్ది మాత్రం ఒకటే ధోరణి. ఆయన జీవితకాలంలో సంపాదించిందీ లేదు. ఒకప్పుడు రెండున్నర ఎకరాలదాకా చేశాడు. తిరిగి అది ఎకరంన్నర అయింది. అయినా బాధపడేవాడు కాదు. ఒక్కోసారి వానలు కురిసీ, కురవకా చాలా నష్టాలు వచ్చేవి. అయినా కూడా 'మనకు ప్రాప్తం లేదు' అనుకునేవాడు తప్పించి ఇంకేం అనేవాడు కాదు. మా ఊర్లో చాలా మంది ఉన్నారు. నాలుగు బస్తాలు ఎక్కువ పండితే వాళ్లెంత గొప్పలు చెప్పుకుంటారో, ఏదన్నా జరిగి నష్టం జరిగినా ఆ గోల గోలకా దు. మరాయన మనసులో ఏముంటుందో మనకు తెలవదు. కడుపులో విషయం అంత త్వరగా బయటపెట్టడు.

అసలాయన ఓ ఫిలాసఫర్ అనుకుంటా. తను ఏంతినేదీ... ఏం చేసేదీ అసలు పట్టించు కోడు. అయితే ఎవరైనా తింటుంటే మాత్రం ఆ కళ్లలో ఎంతో ఆనందం కనిపిస్తుంది. ఆయన పొలంపని చేస్తున్నా పంటలు పండిస్తున్నా అదంతా తన తోటిమనుషుల కోసమని అను కుంటాడనుకుంటా. అక్కడిదాకా ఎందుకు మా ఊర్లో చాలామంది పాడిగేదల్ని మాత్రం ఉంచుకునేవారు. అది కట్టడం మొదలైతే ఇంక మేపటం ఎందుకనే ఆలోచన. వాటిని అమ్మేసి వేరే పాడిగేదలు కొనుక్కునేవారు. మొదటినుండి ఆయనకి వ్యాపారదృష్టి లేదు. వ్యవసాయంలోగాని... వాటి విషయంలో గాని''

''మరి అమ్మగారు ఏమీ అనేవారు కాదా?''

''ఏమీ అననట్టే... ఏమన్నా అన్నా ఆయ నంత పట్టించుకోడు. అసలు పల్లెల్లో ఏమైనా అనటం కూడా ఏదో ఒకటి అనాలనే అంటారు. నాన్న చేసే పనులన్నీ అమ్మ ఆమోదించేది. ఒక్క నా చదువు విషయంలో మాత్రమే ఆమె పట్టుబట్టింది. అంతకుమించి ఆయన్ని వ్యతి రేకించింది లేదు''

''ఎప్పుడూ వాళ్లిద్దరూ తగాదా ఆడుకో లేదా?''

''తగాదానా? ఏమో నాకు గుర్తులేదు. అదస లు తగాదా కాదు. ఇద్దరూ ఇద్దరే అర్ధరాత్రి





కూర్చుని మాట్లాడుకుంటారు. ఇప్పటికీ అంతే అనుకుంటాను. పైకి చెప్పరుగానీ ఒకరంటే ఒకరికి ఎంత ప్రేమో. అయినా వారికి పోట్లాడుకునే తీరిక ఉండొద్దూ?''

''అంతలావుపని ఏముంటుంది బాబూ''

''సులోచనా... పనికల్పించుకోవాలేగానీ ఎప్పుడూ వుంటుంది. అది వాళ్లకి ఆనందం కలిగిస్తుంది''

''పనిలో అంత ఆనందం ఉందంటారా?'' అంది సులోచన.

''ఉండేవుండాలి. లేకపోతే ఆయన ఎందుకంతగా శ్రమించాలి. డబ్బులకోసం అయితే అవసరంలేదు. తన పిల్లలకోసం అయితే అవసరంలేదు. రేపు తను సంపాదించకపోతే మనం చూడం అనే దిగులులేదు. మరి ఎందుకు పనిచేయటం అంటే అందులో ఆయనకు అనిర్వచనీయమైన ఆనందం లభిస్తుందికదా''

''అవునండి... నిజంగా మావయ్యగారు అద్భుతమైన వ్యక్తికదూ'' అంది సులోచన.

''ఆయన నా కన్నతండ్రి. మరి అలా ప్రశంసించవచ్చా అనేది నాకు తెలియదు. ఈ దేశంలో ఆయనలాంటివారు అరుదైపోతున్నారు. మనం ఏమాత్రం గౌరవించని, గుర్తించని శ్రమలో వారు సేదదీరటం గొప్ప విషయమే'' అన్నాడు సాంబశివరావు.

అతను ఇంకా చెప్పుకుపోయాడు.

''ఆయన నాస్తికుడు కాదు. అయితే ఆయన్ని మించిన నాస్తికుణ్ణి నేను చూడలేదు ఎప్పుడూ. భగవంతుణ్ణి గురించి స్మరించటంగానీ, మాకు ఇదివ్వు బాబూ అని కోరటంగానీ నేను చూడలా. అలా అని చెప్పి ఆయన దేవుడు లేడని కూడా చెప్పలా. ఆయనపని ఆయనది. ఆయనకు కావలసిన ప్రశాంతత, తృప్తి, అన్నీ ఆయన శ్రమ ద్వారానే లభిస్తున్నప్పుడు భగవంతుడి గురించి ఎదురుచూడాల్సిన అవసరం ఏమిటి?''

''అంటే అలా ఎదురు చూసేవారందరూ తమకు దూరం అయినవారేనా?'' అంది.

''అలా అని కాదు. వారు భగవంతుడి నుండి ఏదో ఆశిస్తున్నారు. కనీసం ప్రశాంతత. ఆయన్ని స్మరించుకుంటే అలాంటి భావం కలుగుతుందనుకుంటే అలా చేయటాన్ని మనం అర్థం చేసుకోవచ్చు. అలాగే నాన్నని కూడా. సాధ్యమైనంతవరకూ ఆయన ఇప్పుడు తన పనులు తగ్గించుకుంటే బాగుంటుంది. ఎందుకంటే ఇదివరకున్నంత ఓపిక ఇప్పుడు ఉండదు. ఆ తర్వాత ఆయన ఇష్టం''

అలాంటి మనిషి తెల్లవారేసరికి తమ కళ్ల ముందుమరోస్థితిలోవున్నాడు.ఆయనజీవితమే ఓ పాఠం అయివుంటుంది. మరణం రావటాన్ని మనుషులు ముందుగా ఊహించలేకపోతున్నారు. మరెందుకనో ఆయన పనిమనుషులతో ఆ విషయమూ ముచ్చటించటం యాదృచ్ఛికం అయితే కావచ్చు. వారందరూ మరికొన్నిరోజులు ఇక్కడే వుండిపొమ్మని అడిగితే అందుకాయన-

''లేదు... లేదు... ఎల్లిపోవాలి. నేనిక్కడ సచ్చిపోతే ఎట్టా?'' అన్నాడు.

''అంటే ఏందయ్యగారూ... ఈ ఊర్లో మనుమలు చచ్చిపోవటంలేదా?''

''ఎందుకు చచ్చిపోరు?''

''మరెందుకలా అంటన్నారు''

''ఇక్కడ నేను సచ్చిపోతే తులసమ్మ లేదుగా. ఇంకా మా ఊర్లో మా వొదినుంది. మా అక్కయ్యుంది. అల్లందరూ కడసారి చూపు చూసుకోవద్దూ''

''అయన్నీ మనకి తెలవవుగా అయ్యగారూ''

''అందుకేగా ఎల్లిపోవాలనుకుంటుంది. నేను సచ్చిపోయాక మా వాళ్లంతా చూడాలి. నేను మా ఊర్లోనే ఈ కట్టెను విడిచిపెట్టాలి'' అన్నాడు.

ఈ సంభాషణ గురించి తనకు చెబితే వారిని చివాట్లు పెట్టింది కూడా.

మరణం తమ ఇంట్లో ఓ శాపం. తమకు అత్యంత ప్రీతిపాత్రమైన తమ ముద్దులబిడ్డను కబళించింది మృత్యువే...

ఆమెకు తన బిడ్డ గుర్తుకు వచ్చి ఒక్కసారిగా కదిలిపోయింది.

"భూపేష్"

అయిదు సంవత్సరాలపాటు తమను అలరించి, తమను తన ఆటపాటలతో, పసితనంలో సేదదీర్చి ఓ జ్ఞాపకంలా మిగిలిపోయిన తన బిడ్డ...

ఆమె మెల్లగా లేచివెళ్లి గోడకేసి చూసింది.

నవ్వులు చిందిస్తూ భూపేష్...

ఆ పటానికి వేలాతున్న దండ...

"మా నాన్న పేరుని స్ఫురించేలా ఉండాలి. ఏం పెడదాం... ఆలోచించు" అన్నాడు తన భర్త...

"మీ ఇష్టం... నేను ఏ పేరూ పెట్టాలనుకోలేదు"

"అయితే... భూపేష్ అందాం. అందులో మొదటి అక్షరం నాన్న పేరు సూచిస్తుంది కదా"

"బాగానే వుంది"

తమ భూపేష్. తను నవమాసాలు మోసి జన్మనిచ్చాక...

ఇంక స్వప్నా... భూపేష్‌లు చాలు అనుకొని ఆపరేషన్ చేయించుకున్న అనంతరం...

ఇలానే...

ఎందుకో తెలియకుండా... అర్థం కాకుండా... అంతర్థానం అయిపోయేడు.

అప్పటివరకూ తన భర్త గురించిన ఆలోచనల్లా మారి తన బిడ్డమీదకు, ఆ జ్ఞాపకాల్లోకి ఆమె జారిపోయింది.



ఎదురుచూస్తున్న ఫోన్ వచ్చింది గంగాధర్ నుండి.

అతను ఏమైనా సాధించగలడు. ఆ నమ్మకం సాంబశివరావుకి ఉంది. అతనికి వివిధరకాల పరిచయాలు ఉన్నాయి- రాజకీయ నాయకులనుండి, పోలీసు అధికార్లదాకా. కవులనుండి సినిమాతారల వరకూ. ఆయనకు చాలా పొలాలున్నాయి. రకరకాల కంపెనీల్లో వాటాలున్నాయి. అతనికి డబ్బు సంపాదన కంటే మిత్రులతో గడపటంలోనే ఆనందం వుంది.

"మరీ ఈ నగరానికొచ్చాక జీవితాన్ని మిస్ అవుతున్నాం" అంటుంటాడు.

"నాకున్నదేదో నాకుంది. ఇంకసంపాదన గురించి నేను ఆరాటపడటంలేదు. కనీసం ఇప్పటినుంచయినా అర్థవంతంగా జీవించాలి" అంటాడు.

"అర్థవంతంగా జీవించటం అంటే ఏమిటి?" అంటారు అతని మిత్రులు.

"ముందు కొన్ని తపనలనుండి మనం బయటపడాలి. మనం మన కుటుంబసభ్యుల్తో ఎంతసేపు కాలం గడుపుతున్నాం? వ్యాపార విషయాలకు ఇవతలగా వచ్చి కనీసం హృదయం విప్పి మాట్లాడుకోగలుగుతున్నామా? నాకయితే చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. మనం ఎక్కడినుండి వచ్చాం. మన ఊర్లనెందుకు మరిచిపోయాం. స్వేచ్ఛగా ఆడుకోవటం ఎందుకు మరిచిపోయాం. మన ముఖాల్లోని నిర్మలత్వం ఎందుకు కరిగిపోయింది. మనం ఎవరైనా కావచ్చునేమోగానీ వెనకటి మనుషులం కాదు"

"వెనకటి మనుషులం ఎలా అవుతాం. కొత్త శతాబ్దపు మనుషులం"

"కొత్త శతాబ్దపు మనుషులంటే ఇలానా? అయినా ఈ తిళ్లుతిని ఎంతకాలం బతుకుతామయ్యా బాబూ. త్వరత్వరగా మరణించటంకోసం పరుగులు పెడుతున్నాం. అందుకే కొంచెంసేపు లౌకిక ప్రపంచానికి దూరంగా పోదాం"

అందుకోసమే వారాంతంలో రకరకాల కార్యక్రమాలు ఏర్పాటు చేస్తుంటాడు. అందులోనూ ఆ సర్కిల్‌లో అందరికీ డబ్బు సమస్యలేదు. ఉన్నదల్లా తీరిక సమస్య. అయినా గంగాధర్ కోసం వారందరూ తీరిక చేసుకోవటానికే ప్రయ





త్నం చేస్తారు. ముఖ్యంగా గంగాధర్‌ను ఆడవారు అభిమానిస్తారు.

"మనం ఈ ప్రపంచాన్ని చూస్తున్నాం. వ్యాపారం పేరుతోనో, ఇంకో అవసరం పేరుతోనో ప్రయాణాలు చేస్తున్నాం. మరి ఇంట్లో ఉన్న ఆడవాళ్ల పరిస్థితి ఏమిటి? ఎప్పుడూ ఇంట్లోకి చెన్‌కీ, గార్డెన్‌కీ పరిమితం కావాలా? నో... వాళ్లని కూడా విశాల ప్రపంచంలోకి తీసుకురావాలి"

ఆయన బలవంతంమీదే ఎప్పటికీ బయటకు రానివారందరూ చొరవగా వస్తున్నారు. పరస్పరం అభిప్రాయాలు మార్చుకుంటున్నారు. అవన్నీ మంచివా అంటే కాకపోవచ్చు. అవన్నీ చెడ్డవి కూడా కాకపోవచ్చు. ఏదిఏమైనా వ్యక్తిగతమైన జీవనాన్ని చిన్న సర్కిల్‌లోనయినా సామాజికం చేయటానికి అతను ప్రయత్నించాడు. పేరుకంటూ అతనికి ఓ కంపెనీ వుంది. ఏమైనా దాని వ్యవహారాలు అతనికి పట్టవు. అతను నియమించిన మనుషులు ఆ పని చేసుకుపోతుంటారు. ఆ విషయంలో అతనికి నమ్మకమైనవారు దొరికారు.

ఇంట్లో కూడా ఆయనంటే, ఆయన విధానాలంటే వ్యతిరేకతలేదు. వారు అలా అలవాటు పడిపోయారు.

భూషయ్యగారు వచ్చిన ఈ రోజుల్లో ఆయనతో అత్యంత సన్నిహితంగానూ, సహజంగానూ గడిపింది గంగాధరే. తను కూడా పల్లెల నుండి రావటంతో ఆ భాషతో, ఆచారవ్యవహారాలతో పరిచయం ఉండటంవల్ల ఆయనతో అదే భాషలో మాట్లాడేవాడు. భూషయ్యగారు తన కొడుకుతోకంటే గంగాధర్‌తోనే ఎక్కువగానూ, స్వేచ్ఛగానూ మాట్లాడాడు.

గంగాధర్ సాంబశివరావుకు పరిస్థితి వివరిస్తున్నాడు.

"పరిస్థితి దారుణంగానే ఉంది. ఇంతకుముందులా లేదు. దానివెనక చాలా కారణాలున్నాయంటున్నారు. ముఖ్యంగా రాజకీయాలు ఇమిడి ఉన్నాయంటున్నారు. ఎప్పుడు ఎలా పరిస్థితి మారుతుందో చెప్పలేకపోతున్నారు. మరో ఇంటర్నల్ పాలిటిక్స్ కావచ్చుననే ఓ అభిప్రాయం ఉంది. అయితే ఒకటిమాత్రం నిజం. కిరాయి మనుషులు చాలా మంది నగరంలో ఉన్నారు. నేను కొంతమంది ఆఫీసర్స్‌కోసం ట్రై చేస్తున్నాను. అయితే ఒక్కడూ సీట్లో లేడు. అయినా కంగారు పడాల్సిన పని లేదు. తప్పకుండా మనం నాన్నను ఇక్కడి నుండి తీసుకువెళ్తున్నాం"

సాంబశివరావు మాట్లాడలేదు.

"ఈ సమయంలో నీ దగ్గర లేకపోయాననే దిగులుగా ఉంది. ఏమైతే అయిందని అమాంతం కారు వేసుకొని బయలుదేరి రావాలనిపించింది. బలవంతంగా నిగ్రహించుకున్నా ముందు ఎలా చేస్తే బాగుంటుందా అని ఆలోచిస్తున్నా కొంతమంది మిత్రులకోసం ప్రయత్నంచేస్తున్నా బహుశా ఏ వ్యాన్‌లాంటిది దొరికినా తీసుకొని బయలుదేరి వచ్చేస్తా. నువ్వయితే తయారుగా ఉండు"

"అలాగే" అన్నాడు రావ్.

"అది సరే... సిస్టర్ ఎలా ఉంది? పాప కంగారు పడటంలేదుగా"

"అదేంలేదు... అందరూ బాగానే ఉన్నారు"

"ధైర్యం చెప్పాలి... మనం చేయగలిగింది లేదు"

"అవును" గొణిగాడు.

"మళ్లా ఫోన్ చేస్తా" అంటూ గంగాధర్ ఫోన్ పెట్టేశాడు.

ఏంచేయాలా అని ఆలోచిస్తుండగా ఎందుకో ఆ సమయంలో ఓ కవిమిత్రుడు మెదిలాడు. అతను ఇప్పుడు ఎలా దొరుకుతాడు? ఫోన్‌కూడా లేదు. అతను దొరికితే బాగుండును. ఏదైనా మార్గం చూపిస్తాడు. అనుకున్నాడు.

ఆ సర్కిల్‌లో అందరికీ భిన్నంగా గంగాధర్‌కి సాహిత్య అభిరుచి ఉంది. తను స్వయంగా పుస్తకాలు సేకరిస్తుంటాడు. మంచి కవిత్వం అన్నా ఫిలాసఫీ అన్నా ఇష్టపడతాడు. అంతేకాదు, తనను కదిలించిన రచనను చదివి మాత్రమే ఊరుకోడు. ఆయా రచయితలకు గానీ, రచయిత్రులకుగానీ ఆ రచనమీద తన అభిప్రాయాలు రాస్తాడు. ఆ విధంగా కూడా ఆయనకు కొందరు స్నేహితులు ఏర్పడ్డారు.

నెలరోజులక్రితమే నగరంలో ఒక్కసారిగా అల్లర్లు జరిగి కొన్ని ప్రాంతాల్లో కర్ఫ్యూ పెట్టిన ప్పుడు తను ఈ విషయం మీద ఓ కవితో వాగ్వివాదానికి దిగాడు.

"మీకు మంచి సబ్జెక్టు ఇంక వరుసగా కవిత్వం రాసి పారేయ్యండి" అన్నాడు గంగాధర్.

"అదేమిటి అలా అన్నారు" అన్నాడతను.

"మరి ఓపికలేనివారికి కావలసింది ఇవేగా... మతకలహాలూ, యుద్ధాలూ పండగలూ... ఇవన్నీ లేందే మీకు మాత్రం విషయం ఎక్కడనుండి దొరుకుతుంది"

"మీరు చాలా అన్యాయంగా మాట్లాడుతున్నారు. కవులందరినీ ఒకే గాటన కట్టేసి" అన్నాడతను.

"అది సరేగానీ ఈ కర్ఫ్యూ మీద గొప్ప ఉత్కంఠ కలిగించే రచన ఒకటి చెయ్యకూడదూ!"

"ఎలా?"

"ఎలా ఏముంది? ఈ సమయంలో ఎవరైనా మరణించారనుకో... ఏమౌతుంది?"

"నిజమే" అన్నాడతను.

"ఉదాహరణకు పాత బస్తీలో ఓ కుటుంబంలో ఓ వ్యక్తి చచ్చిపోయాడు. సరిగ్గా అదే సమయంలో ముప్పై ఆరు గంటలపాటు కర్ఫ్యూ ప్రకటించారు.

ఆ శవాన్ని స్మశానానికి తీసుకుపోవాలి. భయటకు అడుగుపెడితే కాల్చేస్తారో... ఎవరన్నా వచ్చి దాడులు చేస్తారో తెలియదు. అలాంటి సమయంలో మూడు రోజులపాటు శవాన్ని ఉంచుకోలేరు. బయటకు తీసుకుపోలేరు. అప్పుడేం చేయాలి? ఈ సంఘటన తీసుకొని ఓ కథ రాయకూడదూ"

అతను గంగాధర్‌కేసి చూస్తూ అన్నాడు.

"ఊహించుకోవటానికే శరీరం గగుర్పొడుస్తుంది గంగాధర్‌గారు. అయినా మీకు ఇలాంటి ఊహలు ఎందుకు వస్తున్నాయి?"

"అదేంటయ్యా బాబూ అలా అంటావ్ ఇలా జరగటానికి అవకాశం ఉందా? లేదా? ఓ నిండుగర్భిణీ ఉంటుంది. ఆమెకు నొప్పులు వచ్చాయి. ఓ వ్యక్తికి ఇరవైనాలుగు గంటల కడుపు నొప్పి వచ్చింది. వెంటనే ఆపరేషన్ జరగాలి. లేదా పేషెంట్‌కి వెంటనే రక్తం కావాలి. అప్పుడు ఏంచేయాలి?"

ఏంచేయాలో అతను చెప్పలేకపోయాడు.

ఇప్పుడు అతను ఏమైనా చెప్పగలడేమో అని తను అనుకుంటున్నాడు. తనకు ఆ ఊహ ఎందుకు వచ్చిందో తెలియదు. కానీ ఇప్పుడు అది వాస్తవం అయింది. తాము ఇప్పుడు ఏదో ఒకటి చేయాలి. కొద్దిగొప్పో డబ్బుంది, ఏదైనా పనులు చేయించుకోగల తమ పరిస్థితే ఇలా ఉంటే...

తను కార్లో రోడ్డుమీద వెళ్తుంటే ఎందరెందరో ఆ రోడ్లుపక్కనే అవే ఇళ్లు... అక్కడే నిద్రా, భోజనం, కామం అన్నీనూ. వారందరూ ఏమైపోవాలి? ఆ పిల్లలు ఆకలికి భరించలేక, పాలులేక, కనీసం తాగే నీళ్ళయినా లేక అల్లాడిపోతుంటే అదంతా మరణం కాక మరేమిట?

ఈ పరిణామాలన్నీ ఈ దేశంలోనే జరుగుతున్నాయా? ప్రపంచ వ్యాప్తంగా ఇంతేనా? ఏది ఏమైనా ఒకటి మాత్రం నిజం అనిపిస్తుంది. ప్రపంచంలో భౌతికపరమైన వస్తువులు కొన్ని కరిగిపోతున్నట్లే మనిషికీ మనిషికీ నడుమ ఉండాల్సిన కొన్ని సున్నితమైన భావనలు విఘాతానికి గురవుతున్నాయి.

మానవ విలువలు అవహాస్యానికి గురవుతున్నాయి. మానవ విలువల గురించి మాట్లాడటం, ఆరాటపడటం కూడా ఛాదస్తం కింద జమకట్టే పరిస్థితులు వస్తున్నాయి. ఎందుకో ఒక్కసారిగా కాలం వెనక్కి జరిగితే బాగుండుననిపిస్తుంది. ఏమైనా తనంత నిరాశావాదికాదు. గతంకంటే ఎప్పుడూ భవిష్యత్తు గొప్పది అనే ఆలోచనలతోనే ఇప్పటివరకూ ఉన్నాడు.

ఇప్పుడా ఆలోచన మీదే నిలబడాలంటే ఏదో సంశయం కలుగుతోంది. తను అప్పుడప్పుడూ పుస్తకాలు అద్దెకు తెచ్చి చదువుతుంటాడు. ఆరోజు వెళ్లినప్పుడు ఓ సంభాషణ.

"ఇదిగోనండి ఇలాంటి పుస్తకాలురాసి చదవమంటే ఎవరు చదువుతారు?" అంటున్నారు.





ఆ పుస్తకం తను చదివాడు. అందులో ఘర్షణల గురించి లేదు. అది సస్పెన్స్ థ్రిల్లర్ కాదు. అయినా తనను ఆసాంతం చదివింపచేసింది. అందులో తనకు తెలిసిన జీవితమూ, తెలుసుకోవాల్సిన తత్వశాస్త్రమూ ఉందనిపించింది. పూర్తిగా చదివేంతవరకూ తను విడిచిపెట్టలేదు.

అలాంటి పుస్తకాన్ని ఎవరూ చదవరా?

ఎందుకని చదవరు?

మనుమల్లోకూడా మార్పువస్తుందా? మానవ విలువల గురించి తెలుసుకోవాలనే జిజ్ఞాస అంతకంతకూ మృగ్యం అయిపోతుందా? అలా అయితే ఈ ప్రపంచం ఎంతగానైనా అభివృద్ధి సాధించవచ్చుగానీ ఎక్కడ వేశావు గొంగళి అంటే అక్కడే ఉంటుంది.

ఆ కవి తనతో తరుచుగా అంటాడు.

"ఇలాంటివి ఈ పత్రికలకు అవసరంలేదు. ప్రచురణకర్తలకు అవసరం లేదు. నిజంగా బాధపడి, తపించి చేసే రచనలకు పోస్ట్ ఖర్చులు దండగ అని చెలంగారు ఏరోజో చెప్పారు. నా వరకూ నాకు కవిత్వం మాత్రమే రాయాలనిపిస్తుందంటే అందుకు ఒకటే కారణం. దీనికి పెద్దగా స్పేస్ అవసరంలేదు. అందుకే వాళ్లు ప్రచురిస్తున్నారు. మాకు మాత్రం ఓ సంతోషం. కవిత్వం మాత్రం బతుకుతుందని"

"అలాంటప్పుడు ఓ పని చేయవచ్చుగా"

"ఏంటది" అన్నాడతను.

"మీరే ఓ పుస్తకం ప్రచురించుకొని ఇంటింటికీ తిరిగి అమ్ముకోవచ్చుగా. కనీసం వందమందిని కలిస్తే ఓ అయిదారుగురైనా తీసుకోరా?"

ఆ కవి నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నారు?" అన్నాడు గంగాధర్.

"ఏంలేదు"

"ఇంటింటికీ తిరిగి సాహిత్యం అమ్ముకోవటం నామోషీగా ఫీలయ్యారా?"

"లేదు... లేదు అదేం సిగ్గుపడాల్సిన విషయంకాదు. ముందు పుస్తకం ప్రచురించుకోవటానికి డబ్బులు కావాలి. ప్రచురించినా తన పుస్తకం తీసుకోండి అని అడగటానికి మొహమాటం. ఒకటి అమ్మవచ్చు. రెండు పుస్తకాలు అమ్మవచ్చు. ఆ తర్వాత పరిస్థితి ఏమిటి? ఈ మనుమలకి సాహిత్యంమించి ఏదో కావాలి"

"అంతే కదా"

"అంతకంటే ఏముంది. నామోషీ సమస్యే లేదు. అయినా మా రచనలు ప్రచురించండి అంటూ ఎడిటర్ల చుట్టూ తిరగటాన్ని మించి నామోషీ ఏంకాదుకదా" అన్నాడతను.

"అలా చేయాలంటారా?" అన్నాడు గంగాధర్.

"అయ్యో... మీకు తెలియదనుకుంటా. ఈ రంగంలో ఇంతకు ముందు లేని తమాషాలు చాలా జరుగుతున్నాయి. ఏ కొద్దిమందో ఇంకా పాత పద్ధతులకు కట్టుబడి ఉన్నారు. అయితే ఈ పరిస్థితి ఎంతకాలమో చెప్పలేం. అందుకే మీరన్నట్లుగా ఇకముందు అప్పో సప్పో చేసి ఎవరి పుస్తకం వారు ప్రచురించుకొని ఇంటింటికీ తిరిగినా ఆశ్చర్యంలేదు"

"చాలా సిగ్గుపడాల్సిన స్థితి కదూ"

"అవును... ఈ రంగమేకాదు. ఏ రంగమైనా అంతే. ఇప్పుడున్నవన్నీ సిగ్గుపడాల్సిన పరిస్థితులే"

గంగాధర్‌కెందుకో ఆ సంభాషణ తలుచుకున్నప్పుడల్లా నవ్వు వస్తుంది. ఈ నడుమే కొడవటిగంటి కుటుంబరావుగారి పుస్తకం చదువుతుంటే ఆయన ఓ చోట రాసినది చదివితే చాలా ఆశ్చర్యం కలిగింది.

"ఈ పత్రికలకు కథలు రాసేకన్నా... ఓ సంకలనం వేసుకొని వెయ్యి కాపీలైనా అమ్ముకోవటం గౌరవంగా ఉంటుంది" అంటారాయన.

అందుకే తనవరకుతాను ఏ మంచి పుస్తకం దొరికినా సేకరిస్తున్నాడు. తన పిల్లలు ఆ పుస్తకాలు చదవాలి, ఏమీ చదవకుండా కేవలం క్లాసు పుస్తకాలు అందించే జ్ఞానంతో మాత్రమే ఉంటే రేపు ముందు వారి కుటుంబాల్లోనే భయంకరమైన పరిణామాలు ఏర్పడతాయి. ఆ తర్వాత అవి సమాజం మీద గాఢంగా ప్రభావం చూపించుతాయి.



ఇంతలోతుగా ఆలోచించే తను 'రావ్' తండ్రి విషయంలో ఏమన్నాడు? సెంటిమెంటల్‌గా ఆలోచిస్తున్నాడనికదూ... ఆయనతో ఆ మాటలు అన్నప్పుడు తన మానసిక స్థితి ఏమిటి?

ఆందోళన... భయం...

అవును... అవే... తనను సైతం ఓ నిముషం ఉక్కిరిబిక్కిరి చేసినవి అవే.

ఏ అర్థరాత్రో గుంపులుగుంపులుగా వచ్చి విధ్వంసం సృష్టిస్తారంట. ఇది ఎంతవరకు నిజం? ఇది కేవలం బెదిరింపా? కాకపోవచ్చు. ఇంతకుముందూ ఇలాంటి పుకార్లు వచ్చాయి. అవి నిజం కాదులే అనుకున్నారు. ఇప్పుడు అన్నీ నిజం అయ్యాయి. అంతే కాదు. ఎప్పుడూ ఊహించనివి కూడా జరిగిపోయాయి.

బహుశా ఆ భయంతోనే తను అలా మాట్లాడి ఉంటాడు. లేకపోతే, 'రావ్' ది సెంటిమెంట్ మాత్రమే ఎలా అవుతుంది. ఆ సమస్యను అంతకుమించి చూడాల్సి ఉంది. నిజంగా తను రచయిత కాదు, కవి కాదు, పాఠకుడు మాత్రమే. అందులోనూ మంచి పాఠకుడు అవునో కాదో కూడా తనకు తెలియదు. నిజానికి జరుగుతున్న చరిత్రనంతా చిత్రీకరించాలివస్తే ఎంత హృదయవిదారకమైన పరిస్థితి ఇది.

ఏది ఏమైనా ఇది తనకు కూడా ఓ సవాలే భూషయ్యగారి శవాన్ని ఇక్కడనుండి తీసుకువెళ్ళాలి, ముందు ఈ నగరపు పొలిమేరలనుండి బయటపడాలి. ముందు అందుకు ఇంట్లో అంగీకరిస్తారా?

"ఏమోయ్" అంటూ పిలిచాడు.

ఆమె వచ్చింది.

"ఏంచేస్తున్నారు?"

"ఏముంది చెయ్యటానికి టి.వి. చూస్తున్నాం"

"ఇప్పుడా?"

అవును మరి... ఇప్పుడేగా తీరిక... వీడియో కేసెట్ పెట్టారు పిల్లలు"

"ఏం సినిమా?"

"ఏమో... ఏదో ఇంగ్లీష్ సినిమా నాకు అర్థంకావటంలేదు"

గంగాధర్ లేచి వెళ్ళాడు.

ఓ బీభత్సరస ప్రధానమైన సినిమాని అత్యంత ఉత్కంఠతో చూస్తున్నారు పిల్లలు. గంగాధర్‌కి ఆ క్షణం తనకు తెలియకుండానే కోపం వచ్చింది. తననుతాను నిగ్రహించుకున్నాడు.

"పాపా" ఎంత సౌమ్యంగా పిలవాలనుకున్నా ఆ కంఠంలో కొంత కఠినత్వం చోటుచేసుకుంది.

ఒక్కసారిగా టి.వి. ఆగిపోయింది.

"ఏంటి నాన్నగారూ" అంటూ వచ్చింది.

"ఏ సినిమా అమ్మా అది"

ఆ కంఠస్వరంలో కనిపిస్తున్న తీవ్రతను ఆ అమ్మాయి గ్రహించింది.

"నా ఫ్రెండ్ ఇచ్చింది"

"అంత బాగుందా?"

ఆ అమ్మాయి తలవంచుకుంది.

గంగాధర్‌కి జాలికలిగింది. మామూలుగా అయితే ఎలాంటి పుస్తకం చదివినా, ఎలాంటి సినిమా చూసినా కూడా ఎటువంటి అభ్యంతరం పెట్టడు. అలాంటిది ఇప్పుడు తన మానసిక స్థితివేరు.

"ఆ హింసాత్మక సినిమాల్లో అంత ఆనందం కనిపిస్తుందా?" నవ్వుతూ అన్నాడు.

"ఆనందం కాదు డాడీ... ఆ తర్వాతేం జరుగుతుందో అని సస్పెన్స్"

"చార్లీచాప్లిన్ క్యాసెట్లున్నాయి కదా... అవేం ఆనందం కలిగించటం లేదా?"

"బాగుంటాయి డాడీ... అయినా అవి రాత్రిపూట చూస్తే హాయిగా ఉంటుంది"

"ఈ సినిమాలు మాత్రం పగలే చూడాలంటావ్?"

"అలా అని కాదు డాడీ... చాలా బాగుంది చూడమంటూ తను గొడవచేసింది"

"అది సరేనమ్మా ఓ పక్కన ప్రపంచం తగలబడుతుంటే నీరో చక్రవర్తి ఫిడేలు వాయించుకున్నట్లు అలాంటి సినిమాలు చూస్తావా?"

తిరిగి ఆ అమ్మాయి తలవంచుకుంది.




"సరే రండి... చిన్నమ్మాయినికూడా పిలువ్. మీ అందరితోనూ మాట్లాడాలి"

అందరూ హాల్లోకి వచ్చారు.

మన సాంబశివరావు అంకుల్ నాన్నగారు చచ్చిపోయారు. ఇంకా మీకు చెప్పలేదుకదా"

"అయ్యో... ఎప్పుడు?" అన్నారు పిల్లలు.

"ఈరోజే అంకుల్ ఫోన్‌చేసి చెప్పారు"

"పాపం" అంటూ జాలిపడ్డారు.

"ఇప్పుడు వాళ్లింట్లో తాతగారి డెడ్‌బాడీ ఉంది. అది తీసుకొని ఇంటికి వెళ్ళాలి"

"ఏ ఇంటికి?"

"అంటే తాతగారి ఊరన్నమాట"

"ఎలా డాడీ?"

"ఎలా అయినా సరే తీసుకువెళ్లాలి"

"అంతదూరం ఎలా కుదురుతుంది. అయినా కర్ఫ్యూ ఉందిగా డాడీ"

"అవును... అయినా సరే తీసుకువెళ్లాలి. అంకుల్ కారు గేరేజ్‌లోనే ఉండిపోయింది. లేకపోతే ఈపాటికి తను ధైర్యం చేసి తీసుకువెళ్ళేవాడే"

"మరి ఇప్పుడెలా?"

"అదే ఆలోచిస్తున్నా"

"పోనీ ఆ కార్యక్రమం ఇక్కడే పూర్తిచేస్తే సరిపోతుంది కదా" అంది ఆయన భార్య.

"లేదు ముసలాయనకి కావలసిన వారందరూ ఆయన ఊర్లో ఉన్నారు. ముందు రావ్‌గారి అమ్మకి ఈ విషయం తెలియదు. అంతదూరంనుండి ఆమె ఇక్కడకు రాలేదు కదా? అందులోనూ ఈ వార్త వింటే ఆమె పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించలేం కదా. అందుకని ఎలా అయినా సరే వెళ్ళాలి"

"మరి ఇప్పుడేం చేయాలని?" అనుమానంగా అడిగిందామె.

"ఏంలేదు... మన కారు తీసుకుని అంకుల్ వారింటికి వెళ్దామనుకుంటున్నా"

"ఇప్పుడా?" అందామె నోరు తెరుస్తూ.

"అవును... ఇప్పుడే"

"మీకేమైనా మతి ఉండి మాట్లాడుతున్నారా? కర్ఫ్యూ ఉంది. బయటకి వెళ్తే ఊరుకుంటారా?"

"ఊరుకోక ఏంచేస్తారు? అంతగా అయితే నా కారు ఆపి అడుగుతారు- అంతేగా"

"అప్పుడేం చేస్తారు"

"చేసేదేముంది విషయం చెబుతా"

"మరి వాళ్ళు నమ్మాలిగా"

"నమ్మకపోతే ఫోన్ చేయమని చెబుతాను. లేదా నా వెంటరమ్మని చెబుతాను"

"నాకేదో భయంగా ఉందండి" అందామె.

"ఏం అవసరంలా... ఇందులో కంగారు పడాల్సిందేం లేదు. అసలు పోలీసులు నా కారుని ఆపటమే మంచిది. వాళ్లను తీసుకెళ్లి ముందు అంకుల్ ఇంటిలోని డెడ్‌బాడీని చూపించి సిటీ లిమిట్స్ దాకా పంపించమని చెప్పొచ్చు"

"కనిపిస్తే కాల్చేస్తామని చెబుతున్నారు కదండి" అందామె.

"ఊరికెనే అలా చెబుతారు" అన్నాడు గంగాధర్.

"మీరు అన్నీ అలానే చెబుతారు. అయినా పోలీసులు కాకపోతే రౌడీలు కారునాపి ఏమైనా చేయొచ్చుగా"

"అదేంకాదు... మీరేం కంగారు పడొద్దు"

"చాల్లే ఊరుకోండి. ఇప్పుడు వెళ్తానంటారేమిటి? అంతగా అయితే మేం అందరం వస్తాం. ఏమన్నా జరిగితే అందరికీ జరుగుతుంది"

గంగాధర్ తన భార్యకేసి సూటిగా చూశాడు.

ఆమె మాత్రం రాజీపడనిదానిలా కనిపించింది.

"ఏమిటంత మూర్ఖంగా మాట్లాడతావు?"

"నేనేం మాట్లాడటంలేదు. మీరే మూర్ఖంగా ఉన్నారు"

"పరిస్థితిని కూడా గమనించాలి కదా"

"అయితే మాత్రం ఓ పక్కనుండి మనుమల్ని వరసగా నరుక్కుంటూ వస్తున్నారు. ఇందాకే కదా ఎవరో ఫోన్‌చేసి అర్ధరాత్రి అంతా తగలబెడతాం అన్నారన్నారు. ఇలాంటప్పుడు

కారు బయటకు తీస్తానంటారేమిటి? ఎవరన్నా రాళ్లు విసిరినా అద్దాలు పగిలినా బాగుచే యించుకోవచ్చు అంతేగానీ''

''అంటే ఏంచేయమంటావ్?''

''అది సాంబశివరావుగారు నిర్ణయించు కుంటారు. అయినా ఏదో స్నేహితుడు వాళ్ల నాన్నగారు చచ్చిపోయారు. నిజమే... మనకీ బాధ ఉంది. అంతా బాగుంటే మనం వెళ్ళి చూసివస్తాం. మన కారిచ్చి పంపిస్తాం. అంతే గాని తనకుమాలిన ధర్మం పనికిరాదని పెద్ద లు ఊరికినే చెప్పారా?'' అందామె కోపంగా.

గంగాధర్‌కి నవ్వు వచ్చింది.

''అలా నవ్వకండి. నాకు చిరాకుగా ఉంటుంది. నేనిలా అంటున్నాను అని కా కుండా ఆలోచించండి. వాళ్ళ నాన్నగారు చచ్చి పోయారు కాబట్టి అందరూ ఆయన్తోపాటు పోలే రుకదా''

''అదేమిటి?''

''మీరు చెప్పేది అలానే ఉంది. వాళ్లమ్మగా రు లేని మాట నిజమే. ఇప్పుడు ఆయన ఆ ఊర్లోనే పోయిఉంటే మూడు రోజులపాటు శవా న్ని ఆపుతారా? ఓ వేళ ఆపుతారనే అను కుందాం. ప్రాణాలకు తెగించి ఇలా చేయక పోతే ఆమాత్రం అర్థంచేసుకోలేదా?'' అంది.

గంగాధర్ ఆమెకేసే చూస్తుండిపోయాడు. తను అలా మౌనంగా కూర్చుంటే ఆ వాదం ఎంతబలంగా తనమీద ప్రభావం చూ పిస్తుందంటే తను కదలలేదు. కారు తీసుకొని బయటకు వెళ్ళటానికి ధైర్యం చాలదు.

బహుశా రావ్ తండ్రిని కోల్పోయిన షాక్‌లో మిగతా విషయాలగురించి ఆలోచించడు. పూర్తిగా తనమీద ఆధారపడిన స్థితిలో అతన్ని ఒంటరిగా వదిలివేయటం కూడా సమంజ సంకాదు. అలా అని చెప్పి ఇంట్లోవారిని ఏడి పించి తను బయటకు వెళ్లటమూ ఇష్టంలేదు. ముందు ఆలోచించుకోవాలి.

''సరేగాని నాక్కొంచెం కాఫీ ఇస్తావా?'' అన్నాడు.

''ఎందుకివ్వనూ... నేను చెప్పదలుచుకుంది చెప్పాను. ఆ తర్వాత మీ ఇష్టం. నామాటను మీరు లెక్కచేయరని నాకు తెలును'' అంటూ ఆమె లోపలకి వెళ్లిపోయింది.

''అమ్మాయి... నా గదికి వెళ్దాం రా'' అంటూ తీసుకువెళ్ళాడు తనతోపాటు పెద్దకూతురిని.

''మీ అమ్మ మాటలు విన్నావుగా- నీ అభి ప్రాయం చెప్పు''

''అమ్మ భయపడుతుంది డాడీ''

''నీకు భయంగా లేదా?''

''ఎందుకు లేదు డాడీ. మీరు బయటకు వెళ్లిందగ్గర్నుండి ఏం జరుగుతుందా అనే టెన్షనేగా?''

''మరి మీకు ఏంజరుగుతుందా అనే ఉత్కంఠ మాత్రమేగా కావల్సింది'' అన్నాడు.

''అది సినిమా కదా!'' అంది.

''పోనీ ఇది జీవితం ఉత్కంఠ అనేది సిని మాలోనే కాదు జీవితంలోనూ ఉందని మనం చూస్తున్నాం. దానికి మరో కోణం సాహసం. అది కూడా జీవితానికి అవసరమేకదా''

''అది కాదు డాడీ...''

''ముందు నాకు జవాబు చెప్పమ్మా''

''అవసరమే'' అంది.

''అందుకే నేను అంకుల్ దగ్గరకి వెళ్లాలి. మీ అమ్మకి ఇంకా మీలా రాంబోలాంటి సినిమా లు చూసి మెచ్చుకునే స్థాయి రాలా. తనింకా పాతకాలం మనిషే. నాకేమవుతుందో అని భయపడుతుంది. ఏమీ కాదని మీరు ధైర్యం చెప్పాలి. అర్థమైందా?''

''అమ్మ వినదుగా డాడీ''

''ఎందుకు వినదు. తప్పకుండా వింటుంది. ముందు నువ్వు చెప్పు. నేను వెళ్లటం నీకు ఇష్టమేకదా''

ఆ అమ్మాయి కొద్దిగా సంశయించి చె ప్పింది-

''అంతగా అవసరం అనుకుంటే తప్ప దుగా''

''అవసరమేనమ్మా. రావ్ అంకుల్ గురించి మీకు తెలియదు. ఆయనలో చాలా మంచి లక్షణాలున్నాయి. స్నేహంకోసం ప్రాణం ఇస్తా డు. నిజంగా వాళ్ల నాన్నగారిని గమనించాక





అంకుల్ ఎందుకంత మంచి అలవాట్లు చేసుకోగలిగారో అర్థమైంది. ఆయన కష్టంలోవుంటే మనం భయపడుతూ కూర్చుంటే జీవితాంతం సిగ్గుపడాల్సి ఉంటుంది. అలాంటిదే మనకు జరిగివుంటే తనుమాత్రం సంశయించేవాడుకాదు''

''ఆయన ఎందుకు చనిపోయారు డాడీ''

''ఏమోనమ్మా... పెద్దాయనకదా. వయసు కూడా వచ్చిందనుకో. అయినా రాత్రిదాకా బాగానే ఉన్నాడంట. అన్నీ బాగుంటే ఉదయం తన ఊరికి వెళ్లాల్సిన వ్యక్తి ఆయన''

''మరిప్పుడేం చేద్దాం డాడీ'' అంది.

''ఏముందమ్మా... వెళ్లటం వెళ్లటమే. అయితే మీరు ఏడ్పులూ, పెడబొబ్బలూ పెడుతూ కూర్చుంటే నేను ఆ ఆలోచనల్తో వర్రీ అవుతాను. నాకేంకాదు. కర్ఫ్యూ అన్నాక మనం భయపడాలి. వాళ్లూ అంత స్ట్రిక్టుగా ఉండలేరు. అయినా ఏదన్నా జరిగితే అనొచ్చు. ఆ జరిగేది ఇంటిలో కూర్చుంటే మాత్రం జరగదనేమిటి? ఇలాంటప్పుడు ఎంత ధైర్యం అవసరమో అంత వేదాంతంకూడా అవసరం''

ఆ అమ్మాయి నవ్వింది.

''అందుకని నువ్వో పనిచెయ్యి. ముందు మీ అమ్మకి ధైర్యం చెప్పు. నేను వీలయితే·కారుయిచ్చి వెనక్కి రావటానికి ప్రయత్నం చేస్తా. అంతగా అయితే నాకు తెలిసిన పోలీస్ ఆఫీసర్స్ కనిపిస్తే దిగులేలేదు. నేను అంకుల్ ఇంటికి వెళ్లగానే నీకు ఫోన్‌చేసి చెబుతా. నువ్వే మాట్లాడు. ఓవేళ మేం వెళ్లాల్సివస్తే అక్కడినుండి చెబుతా. అయినా ఇందులో భయపడాల్సిందేంలేదు. రెండు మూడు రోజుల్లో పరిస్థితులన్నీ మామూలుకావచ్చు'' అన్నాడు.

''అలాగే డాడీ''

''ఇంకో విషయం. మీకు అంతగా భయం అనుకుంటే కంట్రోల్‌రూంకి ఫోన్‌చేయండి. ఎవరన్నా ఫోన్లుచేసి పుకార్ల గురించి చెప్పినా, ఇంకేమైనా బెదిరించినా మీరేం పట్టించుకోవద్దు. అర్థమైందా?''

''అలాగే''

''నేను తయారవుతుంటాను. ముందు మీ అమ్మకి నచ్చచెప్పు''

ఆ అమ్మాయి ఉత్సాహంగా లేచి వెళ్లింది.

★ ★ ★

సాంబశివరావు మెట్లు దిగి హాల్లోకి వచ్చాడు.

అందరూ దిగాలుగా కూర్చుని ఉన్నారు. ఎవరూ మాట్లాడుకోవటంలేదు. అక్కడ నిశ్శబ్దం కూడా దిగులుగానే ఉన్నట్లు అనిపించింది.

భూషయ్యగారు మాత్రం ప్రశాంతంగా నిద్రపోతున్నట్లుగా ఉంది. ఆ నిద్రలో ఏవేవో లోకాల్ని దర్శిస్తున్నట్లుగా కనిపిస్తున్నాడు.

''అయ్యగారూ'' అన్నాడు పనిమనిషి.

ఆలోచిస్తున్నదల్లా ఉలిక్కిపడింది.

''ఏమిటి వాళ్లను కూడా అలానే కూర్చోపెట్టావు?'' అన్నాడు.

ఆమె అయోమయంగా చూసింది.

''ముందు వాళ్లకోసం ఏమైనా వండు. తెల్లారి లేస్తే పనులు చేస్తారు''

''అదేంటయ్యగారూ... పెద్దాయన్ని ఇక్కడ పెట్టుకొని ముద్దెట్టా లోపలకి పోద్ది''

''దాందేముంది. మీరందరూ తనకోసం భోజనం మానుకున్నారని తెలిస్తే ఆయన చాలా బాధపడతాడు. ముందు మీరందరూ భోజనాలు చేయండి''

''ఓపూట తినకపోతే పానాలు పోవులే బాబూ... దేవుడిలాంటి మడిసి ఎల్లిపోయాక'' అన్నారు.

వారి మాటల్లో ఎలాంటి కృత్రిమత్వం లేదు. తమ యజమానిని సంతోషానికి గురిచేయాలనే తలంపూ లేదు. హృదయంనుండి దూసుకువచ్చాయా మాటలు.

''సులోచనా... ముందా పని చూడు. అర్జెంటుగా బయలుదేరాల్సి ఉంటుందీ. మరలా ఇదంతా కుదరకపోవచ్చు''

''అలాగే''

సాంబశివరావు మెల్లగా నడుచుకుంటూ ఓ

చేటికి వెళ్లి ఆగిపోయాడు. అది తాను అమితంగా ప్రేమించిన తన తండ్రీ... తమను విడిచివెళ్లిన తమ చిన్నారి భూపేష్‌ల ఫొటో...

ఇప్పటివరకూ ఆ ఫొటోలో ఓ వ్యక్తి తమ కళ్లముందున్నాడనే తృప్తి ఉండేది. ఇప్పుడా ఇద్దరూ లేరు.

వారింక స్మృతులుగానే మిగిలిపోతారు. కొన్ని లోట్లు పూడ్చుకోవటం సాధ్యంకాదు. ఇదీ అంతే.

తనకింక తండ్రీ లేడు. తనకెప్పటినుండి కొడుకూ లేడు!

"ఇలారా"

పనిమనిషి పరుగు పరుగున వచ్చింది.

"ఈ పటం నా గదికి తీసుకురా" అని చెప్పి వెళ్లిపోయాడు.

ఆమె గోడనున్న పటం జాగ్రత్తగా కిందకు దించింది. గబగబా లోనికి వెళ్లి తడిగుడ్డ తీసుకువచ్చి అద్దంమీదున్న మట్టిని తుడిచింది. తళతళ మెరుస్తూంది...

తాతా-మనవడి కళ్లలో ఎంత ఉత్సాహమో...

ఆ ఫొటోలో భూషయ్యగారు ప్రత్యేకంగా కనిపిస్తున్నారు.

అవునుమరి...

ఆయన తన మనవడితోపాటు అద్భుతంగా అమరిన లాల్చీ వేసుకున్నారు.

లాల్చీలో గంభీరంగా కనిపిస్తున్న భూషయ్యగారూ...

ఆయన్తోపాటు భూపేష్...

సజీవచిత్రం అది.

లేని మనుమల్ని ఎప్పుడూ కళ్లముందు నిలిపే అపురూప చిత్రం అది.

అప్పటివరకూ అణుచుకుంటున్న ఉద్వేగ తరంగాల్ని భరించటం ఇంకేమాత్రం ఆయనకు సాధ్యంకాలేదు.

ఆ పటాన్ని తన హృదయానికి హత్తుకొని...

నిశ్శబ్దంగా రోదించాలనుకున్నాడు...

తనవల్ల కాలేదు.

నోటినుండి చిన్న మూలుగుగా ఆరంభమైన ఆవేదన... పెనుదుఃఖంగా మార్పుచెందింది.

ఇంక తనను తాను నిరోధించుకోవటం అసాధ్యంకాగా

దిండులో తలదూర్చి రోదిస్తున్నాడు.

ఆ దిండు అలా తడుస్తూనే ఉంది.



సాంబయ్య తన ఊరునుండి పక్క ఊరుకి చదువుకోవటానికి వెళ్లిన రోజులన్నీ జీవితంలో మరపురాని జ్ఞాపకాలే.

తనతోపాటు తమ ఊరి పిల్లలు మరికొందరు నడిచివచ్చేవారు. దారిపొడుగునా కబుర్లే. కొంతమంది మాత్రం అప్పుడప్పుడూ బడి మానేసి సినిమాలకు వెళ్తుండేవారు. తనుమాత్రం ఎప్పుడూ అలా చేసేవాడు కాదు. ముందు తన అమ్మనూ, నాన్ననూ మోసంచేయటం అనే భావన అసలు నచ్చేది కాదు. అంతగా సినిమాలు చూడాలని ఉంటే ముందుగా అమ్మతో చెప్పి ఆ తర్వాత డబ్బులు తీసుకొని వెళ్లేవాడు.

సాంబయ్యకు జీవితంలో ఓ కోరిక ఉండేది. అది తన నాన్ననుండి డబ్బులు తీసుకోవటం. అది తను అడగడు. నాన్న స్వయంగా ఇవ్వడు. ఏం జరగాలన్నా అంతా అమ్మ చేతిమీదుగా జరగాల్సిందే. ఆవిడే ఫీజులకీ, పుస్తకాలకీ ఇస్తుంది. ఎప్పుడన్నా బల్లమీద కూర్చుని తన చేతుల్తో పూర్ణయ్యగారి దగ్గరనుంచి తెచ్చిన డబ్బులు లెక్కపెట్టి ముందు తులసమ్మ చేతిలోనే పెట్టేవాడు.

అసలు డబ్బులు దాచుకోవటానికి ఆయన చొక్కానే తొడుక్కోడు. అలా అని మొలకి చుట్టుకోవటమూ ఉండదు. ఏ చుట్టో, బీడీనో తాగే అలవాటుంటే డబ్బులు అవసరం





అయ్యేవి. ఆయనకు ఆ అలవాటూ లేదు. అప్పటికే ప్రవేశించిన హొటల్ సంస్కృతికీ ఆయన లోబడలేదు.

అసలు ఆ ఊరిలో అప్పుడు వెలసిన హొటల్ పేర్లు కూడా సాంబయ్యకి చాలా అనుమానాలు కలిగించాయి. ఒకదానిమీద 'బ్రాహ్మణ కాఫీ హొటల్' అని ఉండేది. ఇంకోదానిమీద 'కమ్మవారి కాఫీహొటల్' అని ఉండేది. ఇచ్చట పదార్థములు శుచిగా, శుభ్రంగా చేయబడును అని రెండింటిమీదా రాసుండేది.

తనయితే ఎప్పుడూ ఏ హొటల్స్‌కి వెళ్లలేదు. ఎప్పుడన్నా రోడ్డుపక్కన అమ్మే బజ్జీలు కొనుక్కుతిన్నాడేమో. అయితే ఆయా హొటళ్లకి ఆ కులాలవారు మాత్రమే వెళ్లాలా లేక ఇతర కులాలవారు వెళ్లవచ్చా అనే అనుమానం పీడించేది. బడికి వెళ్లే దారినిండా ఇవే చర్చలు.

"ఎందుకురా అలా పెట్టారు? ఆ హొటల్‌కి మనం వెళ్లొచ్చా?" అని అడిగాడు సాంబయ్య తన మిత్రుల్ని.

"ఎందుకు వెళ్లకూడదు. డబ్బులుండాలే గాని ఎక్కడికైనా వెళ్లొచ్చు" అని చెప్పారు.

అంతేకాదు, వారందరూ కొత్త ఊర్లో ఇంకో విశేషం చూపించారు. అక్కడో బావి వుంది. దానికి ఇనుప గొలుసూ... దానికి కట్టిన బక్కెట్ ఉంది. దాహం అయినవారు ఆ బావిలో నీళ్లు తోడుకుని తాగవచ్చు. అందరూ తాగాక ఓ మూలన రానున్న మాటలు చూపించాడు

'కాపు, తెలగ, బలిజె కులస్థులకోసం' అని రాసుంది.

"ఇప్పుడెట్లా... ఎవరైనా ఏమైనా అంటారేమో" అన్నాడు సాంబయ్య భయంగా.

"ఎవరూ ఏమీ అనరు. అలా రాస్తారంతే"

"అలా ఎందుకు రాయటం? ఎవరైనా మంచినీళ్లు తాగొచ్చుగా"

"తాగొచ్చు. 'బ్రాహ్మణ హొటల్' అని రాస్తే అక్కడ పదార్థాలు శుభ్రంగా ఉంటాయని అర్థం. అంతేగానీ ఇంకెవరూ రాకూడదని కాదు"

"అంటే వాళ్ళే శుభ్రంగా ఉంటారనా?"

"అదికాదులేరా... బ్రాహ్మలు ఇంకోచోట అసలు భోంచేయరు. అక్కడ వంటలు చేసేది బ్రాహ్మలు. అందుకే అలా రాస్తారు"

ఈరకమైన చర్చలు చాలా జరుగుతుండేవి.

ఓసారి ఓ స్నేహితుడు చెప్పాడు-

"మీ నాన్న మాలాల్లతో కూడా కూచుని భోంచేస్తాడంటగా"

"ఎక్కడ?" అన్నాడు సాంబయ్య.

"ఏమో... ఎవరో అనుకుంటుంటే నేను విన్నా" అన్నాడు.

అప్పుడే సాంబయ్యకు అనుమానం వచ్చింది. తనకి అంతవరకూ కొన్ని కులాలు కూడా తెలియదు. అందులోనూ తమ ఇంటిదగ్గర పనిచేసేవాళ్లని 'బుడ్డాడు' అంటారని తెలుసు. తను భీముడ్ని 'భీముడూ' అని పిలుస్తాడు తప్పించి "బుడ్డాడు" అని ఎప్పుడూ అనలేదు. అసలు- భీముడిది ఏ కులమో కూడా తెలియదు. తమ ఊర్లో అన్ని కులాలవారూ పనిచేస్తారు. అందులో కొందరు ప్రత్యేకంగా వ్యాపారాలు చేస్తుంటారు. తమకు తెలిసిన కొందరు కొంతకాలంపాటు కుండల వ్యాపారం చేసేవారు. ఆ బేరం బాగున్నప్పుడు జల్సాగానే కనిపించేవారు. ఆ తర్వాతికాలంలో తిరిగి ఎవరో ఒకరిదగ్గర పనులకి చేరిపోతుండేవారు.

తమ ఇంట్లో పనిచేసేదెవరైనా వాళ్లూ తమ నాన్నా ఒకేసారి అన్నం తింటారు. అందులో ఇంతవరకూ తనకు ఎలాంటి తప్పు కనిపించలేదు. అయితే ఆ తర్వాతికాలంలో సాంబయ్య పరిశీలనలో ఎన్నెన్నో విషయాలు అర్థమవుతూ వచ్చాయి.

ఆ గ్రామంలో డబ్బున్నవారు చాలామంది ఉన్నారు. అందరి తీరూ ఒకేరకంగా ఉండేది కాదు. అయితే అందరిలోనూ ఏదో పోలికమాత్రం కనిపించేది. వారందరూ తమకు డబ్బుందనే విషయాన్ని ఎప్పుడూ గుర్తుపెట్టుకునే వారిలా కనిపించేవారు. ఎంత పెద్దవయసు ఉన్నవారినైనా 'ఒరేయ్' అంటూ పిలుస్తా



రు. వారి మాటల్లో అభినయం, అతిశయం ఉంటుంది.

వారు మనుషులతో హృదయం విప్పి మాట్లాడుతున్నట్లు కనిపించేది కాదు. వారి చూపులు కూడా తమాషాగా ఉండేవి. అందులో ఆడవాళ్లు కూడా ఏం తీసిపోరు. పట్టిపట్టి చూసే చూపుల్లో తమ బట్టలూ... తమ హోదా వగైరాలను నిశితంగా అంచనా వేసుకుంటున్నట్లుగా కనిపించేది.

మామూలు జనం అంటే ఎటూ లెక్కలేదు. అయితే తమ కులంవారిపట్ల కూడా వారు అభిమానం చూపించేవారు కాదు. కాకపోతే మిగతావారిమీద కొంత నయం. అంతకు మించి బాగా డబ్బున్నవారు ఏంపనిచేసినా మిగతావారు భయంభయంగా చెవులు కొరుక్కునేవారు. చివరిమాట మాత్రం

"ఆళ్లకి డబ్బుంది. ఏంచేసినా చెల్లుద్ది" అనుకునేవారు.

అలాంటి లక్షణాలు సాంబయ్యకు నచ్చేవికాదు. తనకు నచ్చని లక్షణాలు తన అమ్మలోనూ, నాన్నలోనూ ఉన్నాయా అంటూ వెదికి చూసుకునేవాడు.



తన నాన్నలో తనకు నచ్చని లక్షణాలు కొన్ని ఉన్నాయి.

ముఖ్యంగా ఆయన తనతో గాఢంగా మెలగాలని సాంబయ్య ఆశించాడు. అదెందువల్లనో సాధ్యంకాలేకపోయింది. అసలు తన బిడ్డ గురించి ఇతరులముందు చెప్పటానికే ఆయన సిగ్గుపడినట్లు కనిపించేవాడు.

"ఆడిదేవుంది. కుర్రనన్నాసి" అంటుండేవాడు.

ఒక్కోసారి ఆ మాటకి కోపం వచ్చేది. ఏమిటీయన తనని గుర్తించటంలేదని. భూషయ్యగా



రికి గుర్తింపు అనేది ఓ సమస్య కానేకాదు. తనలోని లక్షణాలని ఇతరులు గుర్తించాలని ఆయనెప్పుడూ తాపత్రయపడలేదు. అలాగే ఇతరులకు చెందిన విషయంలోనూ అంతే.

అంతకుమించి ఆయనలో ఇంకో ప్రత్యేక అంశం. ఇతరులకూ, తమవారికీ నడుమ ఎలాంటి బేధం చూడకపోవటం. ఆ బేధం ఏదో ఉండనేఉంది. సాంబయ్యే తన కొడుకు. తులసమ్మ తన భార్య. అంతే. అంతకుమించి వారికి గొప్ప ప్రాముఖ్యం ఇవ్వాలని ఆయనకు తెలియదు. మరీ విషయంపట్ల తులసమ్మ ఏం భావించేదోగాని సాంబయ్యకి మాత్రం కొంచె బాధగా ఉండేది.

తోటి పిల్లలయితే వాళ్లు నాన్నల్తో ఎంతో చనువుగా ఉంటారు. ఆడుకుంటారు. వారితో దెబ్బలు తింటారు. తిట్లు తింటారు. ఇంకా ఏమేమో చేస్తారు. అలాంటివేమీ తనకు ఉండవు.

మార్కులొచ్చినా సంతోషంలేదు. మార్కులు రాకపోయినా దిగులు లేదు. బడికి వెళ్ళినా, వెళ్ళకపోయినా కూడా తనే మాత్రం పట్టించుకోడు. అంతకుమించి సాంబయ్యకు ఆశ్చర్యం కలిగించిన సంఘటన ఒకటి ఎప్పటికీ గుర్తు.

సాంబయ్యకోసారి టైఫాయిడ్ వచ్చింది. దాదాపు నెలరోజులపాటు తనని నానా ఇబ్బందులకి గురిచేసింది. ఈ నెలరోజులూ తన్తోపాటు ఉండి తనను గుండెల్లో దాచుకుంది అమ్మ. అయితే తన జబ్బు విషయంలో ఆయన మాత్రం చాలా తాపీగా ఉన్నట్లు కనిపించాడు. సాంబయ్యకు చాలా కోపం కూడా వచ్చింది.

నాకింత జ్వరం కాస్తే నాన్నకు పట్టడంలేదని. అంటే ఏం చేయాలని కూడా ఆ తర్వాత అనుకున్నాడు. ఆ తర్వాత భూషయ్యగారు అర్థం అయ్యాడు. అసలు ఎలాంటి పరిస్థితులకూ ఆయన తొణకడు. ప్రేమా, బాధ... అందోళన అన్నింటినీ ఆయన కడుపులోనే దాచుకుంటాడు. తను జబ్బు పడ్డ రోజులన్నింటా ఆయన రోజువారీ కార్యక్రమంలో ఎలాంటి మార్పులేదు. ఏ రాత్రిపూటో అడుగుతుండేవాడు.

"ఆడికి ఎట్టా ఉంది?" అని.

"అట్టాగే ఉంది" అనేది తులసమ్మ.

"తగ్గిపోతదిలే" అనేవాడు.

ఆతర్వాత మంచం వాల్చుకుని చుక్కల్ని చూస్తూపడుకునేవాడు.

సాంబయ్య దృష్టిలో తండ్రీకొడుకుల సంబంధాలు ఇంత 'డ్రై'గా ఉండకూడదు. తనకు ఊహ తెలిసేటప్పటికే తన తాతలేడు. వాళ్ళిద్దరూ ఎలా ఉండేవారా అనే ఆలోచన పీకుతూ ఉండేది. ఏది ఏమైనా తన తండ్రిది ఓ ప్రత్యేకమైన పద్ధతి. అందుకే ఊర్లో చాలా మంది ఆయన గురించి రకరకాల మాటల్తో కాలక్షేపం చేస్తారు. ఆ విషయాలన్నీ ఆయనకు తెలుసా? తెలిసినా తన పద్ధతులు మార్చుకోడా అనేది ఆ తర్వాతికాలంలో ఓ సమస్యగా అనిపించలేదు సాంబయ్యకి.

తను చదువుకోవాలని ఆరాటపడిన అమ్మే ఎప్పుడూ గుర్తుకువచ్చేది. తనకు అర్థమైన విషయం ఒకటే. అమ్మకు తను నాన్నలా మారటం మాత్రం ఇష్టంలేదు. ఆమె నాన్నను ఎంతగా ప్రేమించినా ఆయన పద్ధతుల్ని ఆమోదించలేదనడానికి ఇంతకంటే వేరే నిదర్శనం అవసరం లేదు.

అందుకే కష్టపడి చదవటం తన బాధ్యత అనుకున్నాడు. అలాంటి క్రమంలో ఓ మొండి పట్టుదల కూడా సాంబయ్యలో ప్రవేశించింది.

తమ ఊర్లో కొందరు మోతుబరుల ప్రవర్తన ఏమాత్రం తనకి నచ్చలేదు. వారి ప్రవర్తనలో మానవసంబంధమైన లక్షణాలు కనిపించేవి కాదు. మనుషులై ఉండి వీళ్లంతా మనుషుల ప్రవర్తనకు దూరంగా ఎలా వెళ్లగలిగారా అనే సందేహం కలిగింది అనేకసార్లు.

ఊరు ఊరంతా కదిలిపోయిన సంఘటన ఒకటి జరిగింది.

ఓ మోతుబరిగారింట్లో పనిచేసే ఓ వ్యక్తిని గుంజకు తాళ్లతో కట్టి దారుణంగా కొట్టడం. ఆ దృశ్యం సాంబయ్య స్వయంగా చూశాడు.

ఎందుకలా కొడుతున్నారు? అంత లావు తాళ్లతో బాదుతుంటే ఎలా భరిస్తున్నాడు? అలా నోటినిండా రక్తం స్రవిస్తుంటే చూడటానికి భయం కలగటం లేదా? జాలి కలగటంలేదా? వాలిపోయిన తలను జుట్టు పట్టి





కొని పైకి లేపటం ఏమిటి? ముఖాన ఉయ్యటం ఏమిటి?

వాళ్ళందరూ చేతులు కట్టుకొని నిలబడటం ఏమిటి?

ఈ సంఘటన తర్వాత రకరకాల వ్యాఖ్యానాలు విన్నాడు. అయితే తన నోటినుండి భూషయ్య అంది ఒకటే...

"ఎందుకు అట్టాకొట్టుకోవటం? ఇష్టంలేకపోతే పంపిస్తే సరి"

మిగతావారందరూ ఎందుకలాంటి ఆలోచనకు రాలేకపోయారు?

ఎందుకు ఆ హింసను ఆమోదించారు?

అప్పటికి జవాబు దొరకలేదు. ఆ తర్వాత నగరాల్లోకి పాకాక అర్థమౌతూవచ్చింది. తన చిన్నతనంలో అరుదుగా కనిపించిన హింస వివిధ రూపాల్లోకి విస్తరించిందని, బహుశా అలాంటి సంఘటన అప్పట్లో అదే అయి ఉంటుంది. ఆ అన్యాయానికి వ్యతిరేకంగా ఎవరూ ముందుకురాలేదు. అది అలా ముగిసిపోయింది.

తన మిత్రులకి అది అన్యాయం అనిపించలేదు. వారు చెప్పిందాని ప్రకారం- కొంత మంది పనిమనుషులు దొంగతనం చేస్తారు. కొంతమందికి తలబిరుసు ఉంటుంది. ఇంకొంతమంది ఎదిరిస్తారు. మరికొంతమంది ఇంకేమేమో చేస్తారు. అలాంటివారిని దారికి తేవటానికి·ఒకటే మార్గం. వారిని శిక్షించటం. అప్పుడే మిగతావారందరూ అణిగిమణిగి పడుంటారు. మరి ఇలాంటి లక్షణాలన్నీ డబ్బున్నవారికి ఉండవచ్చా? వారినెవరు శిక్షిస్తారు?

సాంబయ్యకు స్పష్టమైన మరో అంశం ఏమిటంటే మొత్తంగా కొంతమంది ఊరి మొత్తాన్ని తమ గుప్పెట్లో ఉంచుకున్నారు. తమ భావాలకు తగిన రీతిలోనే ఊరంతా ఉండాలని వారు కోరుకుంటున్నారు. కొంతమంది బంధుత్వాల పేరుతో, మరికొందరు కులాల పేరుతో వారిని వ్యతిరేకించటంలేదు. ఏదిఏమైనా వీటన్నింటికీమించి వారిని అంత స్తబ్దతకు గురిచేస్తోంది మాత్రం డబ్బు.

తన జీవితంలో ఎప్పుడైనా అవకాశంవస్తే వారి అధికారాన్ని దెబ్బ తీయాలి. అదెలా సాధ్యం. వారి దగ్గర వందలాది ఎకరాల భూమి ఉంది? తన దగ్గర ఏముంది... ఆ భూమిలో పండే పంటతో భుక్తి గడవటం సాధ్యం అవవచ్చు. కానీ మోతుబరులను ఎదిరించటం సాధ్యమా?

ఎదిరించటం అంటే తన పరిభాషలో హింసకాదు వాళ్లను కూడా ఏ గుంజలకో కట్టేసి బాదటంకాదు. అత్యంత నిశ్శబ్దంగా జరగా వాలి. ఇలా జరుగుతుంది అని గ్రహించేలోపులే అంతా అయిపోవాలి.

సాంబయ్య ఆలోచనలు అలాసాగిపోతుండేవి.

అలా ఆలోచనలతోనే చదువు పూర్తిచేశాడు. ఇంకా చదవాలంటే నడిచి వెళ్ళటంకాదు. ఏకంగా ఈ ఊరినుండి వెళ్ళిపోవాలి. అప్పుడు తన గురించి చర్చ జరిగింది అమ్మా, నాన్నకి.

"ఇప్పుడేం చేద్దాం" అంది తులసమ్మ.

"దేని గురించి"

"అదే సాంబయ్య చదువు గురించి"

"పరిక్షయ్యాడో లేదో ముందు తెలవనీ"

"ఏమిటి తెలిసేది... తప్పకుండా పరీక్షవుతాడు"

"అయితే ఏంటంట?"

"ఆ తర్వాత చదవటానికి కుదర్దు"

"ఎట్టా మరి?"

"పొలం కౌలుకిచ్చి మనం కాపురం పెడదామా?" అంది తులసమ్మ. ఆవిడకి ఎలా చేయాలనే ఓ ఖచ్చితమైన నిర్ణయం ఏమీ లేదు. ఊరికే అలా అడిగిందంతే.

"ఇంకానయం. భూమంతా అమ్మమన్లా" అన్నాడు.

"మరేం చేద్దాం"

"అదిగాదే... కౌలుకిచ్చి అక్కడ నన్నేం సెయ్యమంటా ఆడుగాక సదువుతున్నాడని నేనీ· ఊరిడిసి ఎల్లాలన్నమాట"

"చదువు ఆపేయమంటావా?" అంది.

"ఏదొకటి చేసుకోండి"

"అదేంటి అట్టా అంటావు" అందామె.

పొలం కౌలుకు ఇమ్మందని కోపం వచ్చింది



ఆయనకి. ఆ విషయం తులసమ్మకి అర్థం అయింది.

"ఏంటి మాట్లాడవు మనిషికి కోపంకూడా తెలుసునే. అయినా నేను నువ్వేమంటావో అని అన్నా. నువ్వు కొలుకెందుకివ్వటం?

ఇంకో నాలుగెకరాలు తీసుకో. చదువు మానేసి ఆడూ పొలానికొస్తాడు" అంది. ఆ తర్వాత ఓ నిర్ణయానికి వచ్చారు.

సాంబయ్యని చదివించాలి. అతను ఎంతవరకి చదువుకుంటానంటే అంతవరకు చదివించాలి. అయితే సాంబయ్యతోపాటు వెళ్ళి కాపురం పెట్టడం అనే సమస్యలేదు. అది జరగని పని.

కనీసం తులసమ్మగారికి కూడా అది సాధ్యంకాదు. అందుకని సాంబయ్య అక్కడ ఓ గది తీసుకుని చదువుకోవాలి. ఇంకా హొటల్లో తినటం అంటే చాలా ఖర్చులు అవుతాయి కాబట్టి తనే స్వయంగా వండుకొంటూ చదువుకోవాలి.

సాంబయ్య కూడా అందుకు అంగీకరించాడు. శెలవుల్లో అన్నం ఎలా వండుకోవాలో, కూరలు ఎలా చేసుకోవాలో చేసి చూపించింది తులసమ్మ.

బెజవాడలో గది చూడటానికీ, తనను విడిచిపెట్టడానికీ భూషయ్య రావలసి వచ్చింది. వచ్చేటప్పుడు తనవెంట కొన్ని సామాన్లు గోతంలో మూట కట్టుకొని తెచ్చుకున్నాడు. ట్రంకుపెట్టెలో ఎప్పటినుండో దాచిన పెళ్లిరోజు పంచా, చొక్కా అందుకున్నాడు. వాటిని కట్టుకున్నాక తులసమ్మ అంది-

"ఎప్పుడన్నా కట్టుకుంటుంటే తెలుసుద్ది. జాగ్రత్తగా చుట్టుకో. పట్నం వెళ్తన్నావు నవ్వుతారు" అంది తులసమ్మ.

"ఇదిగో పైపంచె వేసుకో" అంటూ అందించింది.

"ఇదెందుకే"

"ఇంకానయం... పైపంచె లేకపోతే నవ్వుతారు"

"నేనేం నీ కొడుక్కి మనువు చూట్టానికి కాదే వెల్తంట"

"నా కొడుక్కి నువ్వేం మనువు చూడవసరంలా"

"మరి నువ్వు చూసుకుంటావా ఏంటి?"

"ఎందుకు, ఆడే సూసుకుంటాడు"

"మంచిదేగా"

"ఇదిగో ఈ డబ్బులు ఆడికివ్వు"

"నువ్వేయివ్వు"

"అవున్లే... అదే మంచిది. అలవాటులేని బేరం. ఎక్కడైనా పారేసినా దిక్కులేదు. అన్నీ చూసిరా"

"అలాగేలే" అన్నాడు భూషయ్య.

సాంబయ్యని పిలిచి చెప్పింది.

"వెంటనే గది చూసుకో. ఏదో తెలిసినవాళ్లు కదాని ఎక్కువ రోజులు ఉండకూడదు. ఎప్పుడన్నా వెళ్లి పలకరించిరా. నువ్వేం మా గురించి దిగులుపెట్టుకోమాక. మీ నాయన గురించి నీకు తెలుసుగా. ఆయనకి ఇయన్నీ పట్టవు- నువ్వు మాత్రం ఉత్తరం ముక్క రాసివదేస్తుండు"

సాంబయ్య తలూపాడు.

సాంబయ్యతోపాటు మరి ఇద్దరు వస్తున్నారు. వారికి బెజవాడలో బంధువులు ఉన్నారు. అందులో ఒకతను వారిదగ్గర ఉంటాడు. రెండో అబ్బాయి విషయం ఇంకా ఏం తేలలేదు. అక్కడకు వెళ్లాక పరిస్థితులు చూసి నిర్ణయం తీసుకొంటారు. వెళ్ళగానే అందరూ వారింటి దగ్గరే దిగేది.

భూషయ్యగారు నడిచివెళ్తుంటే దారి పొడుగునా జనం ఆపటమే...

"ఏం మావా... దొరబాబులా ఉన్నావుగా"

ఓ ముసలాయన కర్ర ఆడించుకొంటూ వస్తూ-

"ఎవరది... గుర్తుపట్టలా" అన్నాడు.

"నేనే... భూషయ్యని"

"వారి... నువ్వంటరా... చొక్కావేశావుగా. గుర్తుపట్టలా. ఎక్కడికి బయలుదేరావ్?"

"సాంబయ్యని బెజవాడలో చదువుకుంటానికి పంపిస్తన్నా"

"నరే పద" అన్నాడు.





ఇంకా ఎవరో ఆపి-

''భూషయ్యగారూ... ఇప్పుడు చూడండి. ఎంతబాగుందో. చక్కగా బట్టలేసుకుంటే ఎంత బాగుంది. అదేంటో మీ పద్ధతే వేరు'' అన్నాడు.

భూషయ్యగారు వెర్రి నవ్వొకటి నవ్వాడు.

''మీ కుర్రాడు హొటల్లో తింటాడా? వండుకుతింటాడా?''

''వండుకు తినటమే''

''మంచిది బాగా చదువుకోండిరా బాబూ'' అన్నాడు.

అదేంటో తన భాషలో కూడా భూషయ్యగారు ప్రత్యేకంగా ఉండటమెందుకో సాంబయ్యకు ఎంత ఆలోచించినా అర్థంకాలేదు. ఆయన్తోపాటివారే కొంతమంది చదువుకోకపోయినా అతినాజూకుగా మాట్లాడతారు. మరి కొందరిని చూస్తేనే చాలు ఈయనేదో గొప్పవ్యక్తి అని ముందుగానే అనిపిస్తుంది. ఇంక ఆ మాటలగురించి చెప్పే పనేలేదు.

అందరూ 'బండొస్తంది' అంటే, తనేమో 'బండి వస్తాయింది' అంటాడు. ఇలాంటివే మరికొన్ని పదాలు. ఎక్కువగా ''ఓయ్'' అంటుంటాడు. లేకపోతే ''ఏందీ'' అంటాడు. ఆమాట్లాడటంలో కూడా ఓ వింత పోకడ ఉంటుంది. అందరి ముఖాల్లోకి చూడడు. ఎటో చూస్తూ మాట్లాడతాడు. ఒక్కోసారి వాళ్ళు చెప్పేది వినడు. చెవుడున్న మనిషిలాగా ప్రవర్తిస్తాడు.

వీటన్నింటికీ కారణం ఏకాగ్రత లేకపోవటమే. అంటే ఆయనకి లౌకిక ప్రపంచపు వాసనలేవీ పనికిరావు. అవి ఎలాంటి ఏకాగ్రతను కలిగించలేవు. తన ప్రపంచం తనకు వేరే ఉంది.

కొంతమంది తమ ఊర్లనుండి పక్క ఊర్లకి బండ్లుకట్టించుకుని సినిమాలకు వెళ్తుంటారు. పెద్దవాళ్ళే. తనకు తెలిసినంతవరకూ ఆయనెప్పుడూ సినిమాలకు వెళ్లలా. ఎప్పుడన్నా ఎరువులకోసమో, మరో పనిమీదో పక్కఊర్లు వెళ్తుంటాడు. అయినాకూడా అక్కడ మంచి నీళ్లయినా తాగుతాడా అనేది సందేహంగానే ఉంటుంది. ఆయన జీవితంలో బహుశా 'నమ్మిన బంటు' సినిమాని మాత్రం చూసి ఉంటాడేమో. అంతకుమించి ఏదీ లేకపోవచ్చు.

తమ ఊర్లో ఓ గుడి ఉంది. ఏటా అక్కడ పూజలు చేస్తారు. అప్పుడు కోలాహలంగా ఉంటుంది. అప్పుడే హరికథలూ, బుర్రకథలూ లాంటివి ఏర్పాటు చేస్తారు. వాటికి వెళ్తాడు. అయితే ముళ్లమీద కూర్చున్నట్లుగా ఉంటాడు. మళ్లీ తలలో ఏదో తొలిచినవాడిలా పరిగెత్తుకుంటూ వచ్చి... గొడ్ల చావిడిమీద పడతాడు. అలాంటి మనిషి బెజవాడలో ఉండాల్సిన రెండురోజులూ ఇబ్బంది పడిపోయాడు. ముందు మాట్లాడటానికి మనిషి దొరకలా.

సాంబయ్యకు నాన్నను తలచుకొని చాలా దిగులు కలిగింది.

''ఇట్లా అయితే నాన్నకు చాలా కష్టం. ఎప్పుడైనా ఆ ఊరువదిలి వెళ్లాల్సివస్తే నాన్న ఏంచేస్తాడు? ఎప్పుడూ చుట్టుపక్కలవారితో మాత్రమే మాట్లాడటానికి అలవాటు పడితే ఎలా? రేపు ఏదైనా జరిగి అమ్మ చచ్చిపోయిందనుకో... అప్పుడు నాన్న ఏమైపోతాడు?'' అనుకున్నాడు.

ఆ తర్వాత అలాంటి ఊహ వచ్చినందుకు చాలా బాధ కలిగింది. అమ్మ చచ్చిపోతే నాన్న ఏమైపోవటం అలా ఉంచి తనుమాత్రం ఎలా బతకగలడు. తనకు మాత్రం ఎవరున్నారు అనిపించింది.

తను నాన్నను గమనించినప్పుడు ఏ లక్షణాలైతే తనకు నచ్చటంలేదో, అలాంటి వాటన్నింటికి తను దూరంగా ఉండాలి అని నిర్ణయించుకున్నాడు.అవి అందరితో పరిచయాలు పెంచుకొని మాట్లాడటం. రెండోది ఆధునిక సమాజంలో వస్తున్న మార్పులు గమనించటం, మూడు సమాజం కంటే ముందు నడవకపోయినా కనీసం దాని వెనక భాగంలో ఉండకపోవటం, ఆదే సమయంలో తన తండ్రి జీవితం అందిస్తున్న అమూల్యమైన పాఠాలు సదా గుర్తుంచుకోవటం. అన్నింటికంటే ముందు ఆంగ్లభాషను నేర్చుకోవటం.

అప్పటివరకూ తెలుగు భాష తప్పితే

ఇంగ్లీష్‌రాదు. బెజవాడలో సాంబయ్యే ఓ యజ్ఞంచేశాడని చెప్పవచ్చు. దాంతో అతను ఎంత హాయిగా, స్వేచ్ఛగా, ధారాళంగా మాట్లాడగలిగాడంటే టీచర్స్‌సైతంఆశ్చర్యపోయారు- అతని ఆంగ్లభాషా పరిజ్ఞానానికి.

సాంబశివరావు 'రావ్'గా మారిపోయింది బెజవాడలోనే. అక్కడ ఎవరూ సాంబయ్యా అంటూ పిలిచేవారు కాదు. అంతకుమించి స్వయంగా వండుకోవటం తన బట్టలు తానే ఉతుక్కోవటం,అంట్లు తోముకొని ఆ తర్వాత కాలేజీకి వెళ్లటం ఇవన్నీ జీవితంలో ఓ గొప్ప క్రమశిక్షణను నేర్పాయి.

తను చదువుకుంటున్నరోజుల్లో పరిచయం అయిన అమ్మాయి సులోచన. తను కూడా ఆ కాలేజిలోనే చదువుకొంది. ఓసారి ఇంగ్లీష్ డిబేట్‌లో ఆమె కూడా పాల్గొంది. అందరిముందూ అంత స్వేచ్ఛగా, ఏ తప్పులు లేకుండా మాట్లాడిన సాంబయ్యను చూశాక ఆమెకెందుకో తెలీని సంతోషం కలిగింది. ఆ పోటీలో ఆవిడకి కన్సొలేషన్ బహుమతి లభించింది. ముందుగా తనే పలకరించింది.

"కంగ్రాట్స్..." అంటూ.

"కృతజ్ఞతలు మీకూనూ" అన్నాడు సాంబయ్య.

"మిమ్మల్ని రావ్ అంటారేమిటి? ఇంతకూ మీ పేరేమిటో తెలుసుకోవచ్చా?"

"నా పేరు సాంబశివరావు. మా ఇంటిదగ్గరేమో సాంబయ్య అంటారు. ఇక్కడేమో 'రావ్'ని అయిపోయాను"

"నా పేరు సులోచన" అంది.

"బాగుంది" అన్నాడు.

"ఇంతకూ మిమ్మల్ని ఎలా పిలవాలంటారు"

"మీ ఇష్టం"

"రావ్‌గారూ అంటాను. కొంచెం ఈజీగా వుంటుంది"

"అలానే..." అన్నాడు నవ్వుతూ.

"మీది కృష్ణా జిల్లానా?" అరిధా అమ్మాయి.

"కాదు... గుంటూరు"

"ఊహించాననుకోండి" అంది.

"మనుమల్ని చూసి ఏ జిల్లానో ఎలా చెబుతారండి బాబూ" అన్నాడు.

"మనుమల్ని కాదుగానీ, భాష చూసి కొంత వరకు అంచనా వేయవచ్చు. కొంత మనిషిని కూడా చూసి చెప్పవచ్చుననుకోండి" అంటూ నవ్వింది.

ఆ పరిచయం అలా ఎదుగుతూ వచ్చింది.

ఓరోజు ఆ అమ్మాయి తన జీవితం గురించి చెప్పుకొచ్చింది.

"మా నాన్నగారు లేరు. మా చిన్నతనంలో చచ్చిపోయారు. అయితే మాకంటూ నాలుగెకరాల భూమి వుంది. మా ఊర్లో ఛాదస్తం లేదననుగానీ కొంతవరకు ఫర్వాలేదు. మా అమ్మ చదువుకోవడానికి నన్ను పంపించింది. మాకు కూడా తెలిసినవారి ఇంట్లోనే ఓ గది తీసుకుని వుంటున్నాను. వంట కూడా నేనే చేసుకుంటున్నాను"

"మరి మీ ఊర్లో అమ్మగారు ఒక్కరే వుంటారా?"

"లేదండి... నాకో తమ్ముడున్నాడు. వాడికీ, నాకూ అయిదు సంవత్సరాలకు పైగా గాప్ వుంది. వాడు అక్కడే చదువుకుంటున్నాడు. అమ్మతోపాటు వున్నాడు. ప్రస్తుతానికి ఇబ్బంది లేదు. వాళ్లిద్దరూ అక్కడే వుంటారు"

"మరి మీ పొలం విషయం ఎవరు చూస్తారు?"

"అమ్మ చూసుకుంటుంది. అవసరమైతే వాడున్నాడు. పనిమనిషి ఉన్నాడనుకోండి. కౌలుకివ్వాలనుకుంటున్నాం. ఏదో నడుస్తూంది"

"పాడిలాంటిది ఉందా?"

"ఎందుకుండదూ.... అన్నీ మామూలే. మా అమ్మ డబ్బు విషయంలో చాలా జాగ్రత్తగా ఉంటుంది. ముందు నన్ను చదివించటానికి ఒప్పుకోలా. తనకి భయం. నాన్నతో బాగా చనువుగా ఉండేదాన్ని. ఆయన ఉంటే నా జీవితం వేరేరకంగా వుండేది"

"వేరే రకంగా అంటే ఎలా?" అన్నాడు ఆశ్చర్యంగా.

అతనికి ఆ కుటుంబం గురించి తెలుసుకుంటున్నకొద్దీ చాలా ఉత్సాహంగా వుంది.





ముఖ్యంగా సులోచన అమ్మగారు అంత దక్ష తతో పనులు చేసుకుపోవటం. తను ఆడపిల్ల యివుంటే ఇలా చదువుకుంటానికి పంపించి ఉండేవారా అనేది సందేహమే.

ముందు తన అమ్మ అందుకు అంగీకరిస్తుందా? ఏమో చెప్పటం కష్టమే.''మా నాన్నగారుంటే నేను ఏ డాక్టర్నో అయ్యేదాన్ని. అందులో ఎలాంటి సందేహం లేదు''

''ఇప్పుడు మాత్రం ఏమిటి?''

''ఏముందో మీకామాత్రం తెలియదా రావుగారూ...'' అంది సులోచన.

''లేదు...'' అన్నాడు తడబడుతూ.

''నేను మెడిసిన్ చదివాననుకోండి. ముందు నా పెళ్లి ఓ సమస్య అవుతుంది. దానికయ్యే ఖర్చు సంగతి అలా వుంచండి. మెడిసిన్ చదివిన అమ్మాయిని చేసుకోవాలంటే తిరిగి మెడిసిన్ చదివిన అబ్బాయి కావాలి. 'మెడిసిన్' చదివిన అబ్బాయిలు ఊరికే రారుకదా. అందుకు అమ్మ అంగీకరించలేదు''

''మెడిసిన్ చదివిన అమ్మాయి మెడిసిన్ చదివిన అబ్బాయిని మాత్రమే ఎందుకు చేసుకోవాలి?'' అన్నాడు.

''ఎందుకు చేసుకోవాలని కాదు. డాక్టర్ చదివిన అమ్మాయిని ఓ గ్రాడ్యుయేట్ చేసుకుంటాడా? మేల్ 'ఇగో' పనిచెయ్యదూ'' అంది.

''ఎవరన్నా చేసుకుంటే...''

''అదంతా పెద్ద వ్యవహారం అవుతుంది. ఈ సొసైటీ ఇంకా స్త్రీల విషయంలో చాలా వెనక చూపుతోనే ఉంది. నిజంగానే ఎవరైనా అలా చేసినా ఆ తర్వాత సమాజం చూసే చూపుతో ఇన్‌ఫీరియర్‌గా ఫీలవుతాడు. సరే ఈ దరిద్రం అంతా ఎందుకని నేను మానేశాను''

''గ్రాడ్యుయేషన్‌కి మాత్రం ఈ సమస్య ఎదురుకాదా?''

''గ్రాడ్యుయేట్లకి అంత కొరత వచ్చిందంటారా? అంతగా అయితే ఏ ఉద్యోగమో చేసుకుంటూ హాయిగా గడిపేస్తాను'' అంది.

''అలాంటిదే 'మెడిసిన్'కి చేయవచ్చుగా. శుభ్రంగా డాక్టర్ అయివుండేవారు''

''జస్ట్ నా ఆలోచనల గురించి చెప్పానంతే. మా నాన్నగారు ఉండివుంటే అవసరమైతే ఫైట్ చేసేదాన్ని. ఇప్పుడు వీటన్నింటికీ అమ్మ ఆమోదిస్తుందా చెప్పండి'' అంది.

''మీ అభిప్రాయాలు తెలుసుకుంటానికే ఇంత డీప్‌గా అడిగాను. ఏమీ అనుకోరుగా'' అన్నాడు సాంబశివరావు.

''భలేవారే'' అంటూ నవ్వింది.

''మీ గురించి చెప్పండి''

''నా గురించి చెప్పుకోవటానికి ఏంలేదు. మా అమ్మానాన్నలకి నేను ఒక్కణ్ణే సంతానం. అదొక్కటి మాత్రం విశేషం''

''అలానా...''

''మిగతాదంతా మామూలే. మధ్యతరగతి కుటుంబం. నేనూ ఇక్కడోగది తీసుకుని, స్వయంగా వంటచేస్తూ చదువుకొంటున్నాను. అయితే ఓ ఆడపిల్లతో నేను ఇంత హాయిగా మాట్లాడగలనని తెలుసుకొంటే ముందు మా అమ్మ స్టన్ అయిపోతుంది. మా ఊర్లో అయితే... ఇంక చెప్పేపనేలేదు''

''ఎందుకని...?''

''ఇక్కడికి రాకముందు నా పరిస్థితి వేరు. ఈ నాలుగు సంవత్సరాలలోనూ కృష్ణ నీళ్లు బాగా పట్టాయి. నేను మా ఊరిసాంబయ్యను కూడా కాదుగా''

''భలే మాట్లాడుతారే'' అంటూ నవ్వింది.

''నేను మాట్లాడటం అని కాదుగానీ ఈ కాలేజీకి రాకపోతే నేను కూడా కొన్ని స్థిరమైన అభిప్రాయాల్తో ఉండిపోయేవాణ్ణేమో అనిపిస్తుంది''

''అంటే...''

''స్త్రీ - పురుషులు మాట్లాడుకోవటమే నేరం అని. అదేంటో మా ఊర్లో ఇప్పటికీ, బహుశా ఇంకో పది సంవత్సరాలదాకా కూడా అలాంటి అభిప్రాయంతోనే వున్నా ఆశ్చర్యంలేదు. అలా ఎవరన్నా కంటబడ్డారంటే ఏదో పాపం చేసినంతగా బాధపడిపోతారు'' అన్నాడు సాంబశివరావు.

"నిజమే... కొన్ని భావాలు అంత త్వరగా పోవు" అంది సులోచన.



ఇది జరిగిన కొన్నిరోజులకు సాంబయ్య తన ఊరికి వెళ్లాడు. అక్కడో సంఘటన జరిగింది.

తులసమ్మగారి దగ్గరకొచ్చి ఒకావిడ తన ఆవేశమంతా వెళ్లగక్కుకుంటోంది.

"అది అట్టా చేసింది తులసమ్మగారూ... ఏకంగా ఎవడ్నో పెళ్లి చేసుకున్నానంటూ వచ్చింది. ఇంకా ఏమైనా ఉందా? అందులోనూ వాడిది వేరేకులం. దీనికి పోయేకాలం రాబట్టి ఈ బుద్ధులు పుట్టుకొచ్చాయి. అసలు ప్రేమేంటి? దోమేంటి? నేనయితే చెప్పా. మా వంట్లో ఇంకా చీమూ, నెత్తురూ ఉంది. మేవందరం మీ కొంపకి రావాలనుకుంటే ఈ పెళ్లి మాత్రం చేయకండి అన్నా. అయినా నాకు తెలవక అడుగుతా తులసమ్మగారూ... ఇట్టా చేస్తే మా పిల్లలకి పెళ్లిళ్లవుతాయా? అందుకుకాదూ ఈ ఆడపిల్లలకి సదువొద్దూ నట్టుబండలొద్దు అని మొత్తుకునేది" అంటూ ఒకటే సొద.

ఇంతకూ జరిగిన విషయం ఏమిటంటే ఆమె బంధువుల్లో ఒకమ్మాయి వర్ణాంతర వివాహం చేసుకుంది. దాన్ని వీళ్లు ఆమోదించ టంలా.

"ఆ మెళ్లో తాడు లాగి అవతల పారేసి, వేరే పెళ్లి చెయ్యమని చెప్పా" అని కూడా అందావిడ.

తులసమ్మగారికి ఏంచెప్పాలో అర్థంకాలేదు. ఆవిడకి అది నచ్చలేదు. అయితే తాళికట్టినాక అది విసరమనటమూ నచ్చలా. రెండూ సంప్రదాయాలే. ఒకదాన్ని ఆమోదించి ఇంకోదాన్ని తిరస్కరించటం ఏమిటో ఆమె అడగలేకపోయింది. రెండో విషయం. అది తన కుటుంబ విషయం కాదు ఏదో ఒక అభిప్రాయం తెల్పి చెప్పటానికి. అంతకుమించి ఆవిడ ఎవరినీ మాట్లాడనిచ్చేట్లు లేదు. పొరపాటున 'పోనీలే' అంటే ఈ కొంపకి రాననేస్తుందేమో. ఆవిడ అలా కొంచెంసేపు గాలిదుమారం సృష్టించి వెళ్లిపోయింది.

"అమ్మా... ఇప్పుడావిడ వాళ్లింటికి వెళ్తుందా... లేక ఇంకెవరి ఇంటికైనా వెళ్తుందా?" అన్నాడు.

"అదేంటిరా" అంది తులసమ్మ.

"ఎవరడిగారని ఇవన్నీ చెబుతూంది"

"రేపు ఈ వార్త ఎటూ తెలుస్తుందిగా. అందుకే ముందుగా అందరికీ చెప్పి తృప్తిపడుతుంది"

"అయినా ఈమె గొడవేంటి? ఈమె ఆ కొంపకు వెళ్లకపోతే వాళ్లు బతకలేరా?" అన్నాడు.

"ఏదో ఆడాళ్ల గొడవలే. వదిలెయ్యి" అంది తులసమ్మ.

"ఆడవాళ్ల గొడవమాత్రమే ఎలా అవుతుంది. కట్టిన తాళి విసిరేయమంటుంది. కొంపతీసి ఈవిడ వెళ్లి ఆ పని చేస్తుందా?"

"అదేరా చోద్యంగా ఉంది. అయినా ఈ ఊరొచ్చినాక ఆవిడ ఎక్కడికీ కదలటం నేనెరుగను. ఇక్కడనుండి మీ కొంపలకు రాను రాను అంటూ బెదిరిస్తుంటుంది"

"రాకపోతే మంచిదేకదా. వెళ్లినదగ్గర్నుండి వాళ్లకి కూడా ఖర్చు"

తులసమ్మకి నవ్వు వచ్చింది. ఆ తర్వాత చాలా విషయాలు చెప్పింది.

"దుర్గమ్మ తల్లిరా బాబూ... అది నోరు తెరిచిందంటే మొగుడూ భయపడాలి, పిల్లలూ భయపడాలి, చుట్టుపక్కలవాళ్లూ భయపడాలంతే. అదేం చోద్యమో ఏదో సినిమాలో మాయల అద్దంలోలా ఎక్కడేంజరిగినా కనిపిస్తుందంట. అట్టాగే ఈ దుర్గమ్మ ఇల్లు కదలదు. ప్రపంచంలో ఏంజరిగినా ముందుగా తెలిసిపోద్ది. అక్కడ కుప్పలు నూర్చి పోస్తున్నారను





కో. ఎన్ని బస్తాలు బండిమీదకెక్కేది తెలిసిపో ద్ది. మొత్తం చేలో ఎన్ని కుప్పలు వేశారో చెప్పుది. షావుకారి చేలో ఎకరానికి ఎన్ని బస్తా లు రాలిందీ చెప్పుద్ది. అంతదాకా ఎందుకు. మన గేద ఎన్నిశేర్లు పాలిచ్చుద్దో నాకు తెలియ దు. దుర్గమ్మ చెప్పుద్ది''

సాంబయ్య నోరు తెరుచుకు వింటున్నాడు.

''ఈ ఊర్లో సంగతి వదిలెయ్యి. నువ్వు చూస్తన్నావుగా. మీ బాబాయి వాళ్ల సంగతులు మనకు తెలీవు. వాళ్లెక్కడో బళ్లారిలో ఉన్నారు. ఎప్పుడూ ఉత్తరం ముక్క రాయరు. అయినా వారి సంగతులు ఈవిడకి తెలిసిపోతాయి. ఫలానా వాళ్లమ్మాయి ఆ అబ్బాయి పిలిస్తే పలికిందంటగా అంటుంది. ఒకటా... రెండా... ఎవరి కొంపల్లో ఏంజరుగుతున్నాయో దుర్గమ్మ కి తెలిసిపోద్ది. మరేం చిత్రమో తన ఇంట్లో ఒక్క విషయం కూడా బయటకు పొక్కనీయ దు. అంతా గుట్టు. దీనికి మాత్రం దేశవాళ్ల సంగతులన్నీ కావాలి'' అంటూ మెటికలు విరిచింది.

సాంబశివరావు నవ్వుకున్నాడు.

''అయ్యో ఈ దుర్గమ్మ సంగతి నీకు తెలి యదు.ఇంట్లో మొగుడికీ,పిల్లలకీవండిపెట్టటా నికి తీరిక ఉండదు. తెల్లారి లేచిందగ్గర్నుండీ ఆకొంపకూ, ఈకొంపకీ అది కావాలి ఇది కావా లని పంపిస్తుంటుంది. ఎవరన్నా పిండివంట లు చేసుకుంటేచాలు వానన పసిగట్టి తయార యిపోద్ది. అల్లమీదా, ఈల్లమీదా అక్కడ కబు ర్లు ఇక్కడా ఇక్కడ కబుర్లు అక్కడా. దీని నోటికి జడిసి దాని నోట్లో నానటం ఎందుకని పట్టించు కోరు. నోరు తెరిస్తేచాలు ఎవరో ఒకర్ని ఏదో ఒకటి అనకుండా ఊరుకోదు. అయినా దీని సంగతులు ఎవడికి కావాలంట. పైన భగ వంతుడున్నాడు. అన్నీ చూస్తానేవుంటాడు. ఎవడు విరగబడితే వాళ్లకి తగిన బుద్ధి చెబుతా డు'' అంది.

మామూలుగానే రాత్రికి భూషయ్యతో ఈ విషయం చెప్పింది.

''ఇదిగో దుర్గమ్మ సంగతి విన్నావా? వాళ్లక్క య్య కూతురు ఎవర్నో మనువాడిందంట''

''మంచిదేగా'' అన్నాడు భూషయ్య.

''ఏంమంచిదో... దుర్గమ్మ చాలా యాస్టపడి పోతాంది. అల్లింటికి వెళ్లనే వెళ్లదంట''

''పోనీలే... అదీ మంచిదేగా''

''ఆ అబ్బాయిదీ వాళ్లదీ ఓ కులం కూడా కాదంట''

''అయితే మనువాడి వచ్చేసిందా?''

''అవును''

''అయితే ఇంకేం చేత్తారంట. ఇంక అల్ల బతుకు అల్లు బతుకుతారు. అంతేగా''

''మరింక పెళ్లి చేయాల్సిన పిల్లలు లేరూ'' అంది.

''ఉండనీ... ఉంటే ఏమవుద్ది. ఎవడికెట్టారా నుంటే అట్టా జరుగుద్ది. అయినా కులవేంటి... ఇంకోటేంటి... ఏవయసుకు అది జరిగిపోవాల. మంచో చెడో ఆ పిల్ల పెళ్లి చేసుకొచ్చింది. మనం వూ అంటే పెద్దరికం నిలుసుద్ది''

''మరి దుర్గమ్మ''

''ఏంటే తులసమ్మా... దురగమ్మ కాపురం సేత్తుందా...అల్లకేవన్నా తన సొమ్ము ఇచ్చేయబో తుందా. అయినా ఆ పిల్ల ఆ అబ్బాయిని సూసి సేసుకుంది. ఆ అబ్బాయి ఆ అమ్మా యిని సరే అనుకున్నాడు. ఇంక దురగమ్మ ఎవరే నడాన'' అన్నాడు.

''అబ్బో... నీకు చాలా విషయాలు తెలు సునే'' అంది తులసమ్మ.

''నాకెందుకు తెలుత్తాయే... మట్టిని నమ్ము కొని బతికేవోడ్నికదా... సదువా సంజా... నీక యితే అన్ని సంగతులు తెలిసిపోతాయి. పెద్ద అరిందావిగదా'' అన్నాడు.

''చాల్లే... ఇంక నువ్వు నామీద పడతావ్'' అంది చిరుకోపంగా.

''ఎవరిమీదా పడవసరంలా. అయినా ఎవ డి బతుకు ఆడు బతుకుతున్నాడు. అదట్టా, ఆడిట్టా అనేది మనకి అనవసరం. మనకే కాదే... ఎవడికీ అవసరంలా. మనకి సేతయితే పక్కోడికి సాయం సేయాల. లేకపోతే గమ్ము నుండిపోవాల. అంతేగాని ఎవురిగురించో మాటాడ్కుకోటానికి మనమొవరమే. మా అయ్యా సెప్పేవోడులే. నువ్వు ఓ ఏలు ఎదుటికి సూ





పిత్తే నీకేసి పది సేతులు సూపిత్తాయని. ఒకడ్ని ఆచ్చేపించటం ఎందుకు? ఇంకోళ్లతో మాటలు పడటం ఎందుకు. ఎవడిపని ఆడు సేనుకుంటూ బతికితే ఏ తిప్పలూ లేవు''

''నీక్కూడా ఓ అమ్మాయి ఉండి ఇట్టాసేస్తే నువ్వూరుకుంటావా?''

''మరి కన్లేకపోయావా అమ్మాయిల్నీ'' అన్నాడు.

''కంటే బాగానే ఉండేది. అల్లుణ్ణివెతుక్కోవటానికి నేనే బయలెల్లాల్సి వచ్చేది''

''అమ్మాయి పుట్టినా, అబ్బాయి పుట్టినా మనం ఆళ్లని కన్నాం తప్పించి ఆళ్ల రాతల్ని కనలేదే... అది మాత్రం గుర్తుంచుకో''

సాంబయ్యలో కొత్త కోణం తెరుచుకుందప్పుడే. తన నాన్నకు ఎలాంటి ఆలోచనలు లేవనే దాదాపుగా అనుకున్నాడు. కొన్ని విషయాల మీద ఆయన అభిప్రాయాలకోసం ఎదురుచూడటం కూడా అనవసరం అనుకున్నాడు. తన అంచనా ఎంత పొరపాటో ఇప్పుడు బాగా అర్థమౌతుంది.

ఈ ప్రపంచంలో వ్యర్థమైన పదార్థం అంటూ ఏదీ లేదు. మనుషులూ అంతే. అందరికీ ఆలోచనలుంటాయి. కొన్ని అభిప్రాయాలుంటాయి. అవి అందరి ముందూ వ్యక్తం చేయలేకపోవచ్చు. అలాంటి అభిరుచిగానీ, అవకాశంగానీ లేకపోవచ్చు. అంతమాత్రాన అభిప్రాయాలే లేవనుకుంటే అంతకుమించిన తప్పు మరోటి ఉండదు. అలాగే ఈ ప్రపంచంలో ఇంకో చిత్రం కూడా ఉంది.

ఎంతో తెలివి తేటలు ఉన్నవారిలా కనిపించే వారిలోనూ, నిజంగా తెలివితేటలు ఉన్నవారిలో కూడా ఒక్కోసారి ఎంతో అమాయకత్వం కనిపించవచ్చు. అలాగే అమాయకంగా కనిపించే వారు ఒక్కో సందర్భంలో ఎంతో గొప్పగా ప్రవర్తించవచ్చు. అందుకని మనుషులపట్ల శాశ్వతమైన అభిప్రాయాలు ఏర్పాటు చేసుకోవటం మంచిదికాదు.

పెళ్ళిళ్ళలాంటి విషయాల్లో గ్రామీణ జీవితంలో కొన్ని స్థిరమైన అభిప్రాయాలు పాతుకుపోయి ఉన్నాయి. ముఖ్యంగా అక్కడికి ఆధునిక భావాలవ్యాప్తి చాలా మెల్లగా జరుగుతూంది. అంతకుమించి అక్కడివారు ఓ స్థిర నివాసం ఏర్పరుచుకున్నవారు. వారు సంచరించే ప్రదేశంకూడా అత్యంత పరిమితంగా ఉండిపోతుంది. పైగా వారికి పైనుండి వచ్చే భావాలుకూడా సహజంగా కొత్త ఆలోచనను కలిగించవు.

అలాంటిది తన తండ్రి ఈ విషయం గురించి ఏమాత్రం సీరియస్‌గా పట్టించుకోక పోవటంకూడా తనకు ఆశ్చర్యం కలిగించింది. తను అనుకున్న వ్యక్తికాదు. ఆయనలో ఇంకా తనకు కనిపించని బహుశా తన జీవితకాలంలో చూడలేని ఎన్నెన్నో గొప్ప లక్షణాలు ఉండి ఉంటాయి.

ఆంగ్లంతో పరిచయం అయ్యాక ఎక్కువగా జీవిత చరిత్రలు చదవాల్సివచ్చింది. గొప్పగొప్ప నాయకుల్లో కొన్నిసార్లు కొన్ని గుణాల్ని వెదుక్కోవలసి వచ్చింది. ఓ రకంగా ఆలోచిస్తే దేనికయితే మారకపు విలువ ఉందో అదే ఉన్నతంగా కనపడుతుంది. రాజకీయాలు, కళలు, ఇంకా అనేకం. ఇవన్నీ ఫోకస్ చేయగల వాడు లభించగలిగితే ఓ విలువను సంతరించుకుంటాయి.

అసంఖ్యాకంగా ఉండే సాధారణ జనంలో ఉన్నటువంటి మహత్తర లక్షణాల్ని ఎవరు గుర్తిస్తారు? ఎవరు గుర్తించాలి?

ఈ ప్రశ్నకు ఆ క్షణం మాత్రం సాంబశివరావుకి సమాధానం దొరకలేదు. బహుశా అలాంటి జవాబు తర్వాత కాలంలో జీవితానుభవం మాత్రమే అందించగలదనే విషయం తను గాఢంగా నమ్మాడు. అందుకే సాంబశివరావు జీవిత విధానం ఏ రకంగా ఉన్నా అతనిలో అన్వేషణ చావలా.

ఓ రకంగా అతను ఇప్పుడు అస్థిత్వం కోసం పోరాటం చేస్తున్నాడు. ముందు కనీస జీవితం అవసరం. కనీసం జీవితం అంటే దానిపరిమితికి అంతం లేదుకదా అనే ప్రశ్న వస్తుంది. అందుకు చెందికూడా సాంబశివరావుకంటూ ఓ నిర్దుష్టమైన అంచనా ఉంది. ఆ స్థితికి చేరుకున్నాక ఇప్పుడు అనుభవించే లేదా ఇప్పుడున్న తరహా తను జీవితం కొనసాగించడు. మనిషికి ఎప్పుడూ ఒకటే తరహా జీవితం ఉండకూడదు. దానివలన వచ్చే ప్రమాదం ఓ




దశ తర్వాత ప్రవాహం ఆగిపోతుంది. ఎక్కడో నిలకడగా నిలిచిపోతుంది. మానవ జీవితం ఓ ప్రవాహం అనుకుంటే అది నిరంతరం ప్రవహించాల్సిందే. అలా ప్రవహించగలిగినప్పుడే అందులో ఉన్నవన్నీ కొట్టుకు పోతుంటాయి. ప్రవాహం ఆగిపోయినచోట కనపడేదేమిటి? రకరకాల మార్పులు. ముందు ఆ నీటికి స్వచ్ఛత ఉండదు. రకరకాల క్రిములు ప్రవేశిస్తాయి. మనకు గుర్తుతెలియని మొక్కలు మొలుచుకొస్తాయి. ఇంకా ఇంకా అవి భరించలేనంత దుర్వాసనను వెదజల్లుతాయి. ఆ తర్వాత ఆ ప్రభావం పరిసరాల మీదా, ప్రాణులమీదా పడుతుంటాయి. అందుకే మనిషికి మార్పులేని ప్రపంచం అంటూ ఉండకూడదు. అలా అని చెప్పి క్షణక్షణమూ మారేది కూడా అవసరంలేదు. దానికో గమ్యం అంటూ ఉండదు.

బహుశా గంగాధర్‌తో పరిచయం అంతగాఢతరం కావటానికి కారణం ఇది కూడా కావచ్చు. మనిషికి జిజ్ఞాస ఏరూపంలో ప్రారంభంకావాలి... ఏ రూపంలో వ్యక్తం కావాలి అనే సమస్యకూడా ఉంటుంది. అయితే ఓ పరమ ప్రయోజనం కోసం నిలబడేవారు తాము సాధించదలుచుకున్నది ఏమేరకు ప్రశంసలకూ, ప్రచారానికీ అనుగుణంగా ఉంటుంది... అనేది పట్టించుకోరు.

సాంబశివరావు తిరిగి వెళ్ళాక సులోచనతో ఈ విషయం గురించి చర్చించాడు. ఆమె కూడా అంతకు ముందు తను సేకరించిన ఓ వార్తను చూపించింది. అది చదివాక ఆశ్చర్యంతో పాటు రకరకాల భావాలు కలిగాయి.

అతను ఓ సామాన్యుడు వాళ్ల నాన్నతో కలసి అతను నడిచివస్తుంటే ఎదురుగా పెద్ద కొండ కనిపించింది. అది తమ దారికి అడ్డంగా ఉంది. తమకే కాదు ఎందరికో అడ్డంగా ఉంది. అందువల్ల మనుషులందరూ చుట్టూ తిరిగి పోవాలి. పోతున్నారు. కొండను వారేం చేయగలరు. బతిమాలలేరు - శాసించలేరు - ప్రార్థించలేరు. చేతనయితే దాన్ని బద్దలుచేయాలి. ఓ మార్గాన్ని నిర్మించుకోవాలి. అది ఎవరు చేయాలి. వ్యక్తులకు అది సాధ్యం అవుతుందా?

కాదు కొండలు ఊరికే పగలవు. దానికి శక్తి కావాలి. శ్రమకావాలి. అంతకంటే ముందు ప్రేలుడు పదార్థాలు కావాలి. ఇవన్నీ కావాలంటే ప్రభుత్వం వారు కదిలిరావాలి. ప్రభుత్వం కదలి రావాలంటే అనేకమంది కలసి రావాలి. మరాతీరిక ఎవరికి ఉంది? ఎవరికీ లేదు. అందరూ చుట్టూ తిరిగి ప్రయాణం చేస్తుంటారు. కొంతమంది కొండను తిడతారు. మరి కొందరు ప్రభుత్వాన్ని తిడతారు.

అతను మాత్రం అలా చేయలేదు. తను కొండను తొలవటానికే నిశ్చయించుకున్నాడు. చాలామంది నవ్వుకొని ఉంటారు. నిరాశ పరిచి ఉంటారు. అతను అలా తను కొండతో పోరాటం చేస్తున్నాడు.

నిముషాలు, గంటలు, రోజులు గడిచాయి. సంవత్సరాలు పాతబడిపోయాయి. దశాబ్దాలు వెనక్కి వెళ్ళాయి.

రెండు దశాబ్దాల సుదీర్ఘ పోరాటం అనంతరం కొండను తొలిచాడు. ఆ సుత్తిని భుజంమీద పెట్టుకొని సంతోషంతో పొంగిపోయాడో, భోరున ఏడ్చాడో ఆ క్షణం ఎవరికీ తెలియదు.

ఈ కాలమంతటిలోనూ జరిగిందేమిటి? అతని తండ్రి మరణించాడు. అతని శక్తులు హరించాయి. అతని యవ్వనం కరిగిపోయింది. ఇంక తను ఏ ఏ స్పందనలకు దూరం అయినాడో అతనే చెప్పుకోలేక పోవచ్చు.

ఇప్పుడక్కడ రోడ్డు ఉంది. అతను జయించాడు... కొండ మాత్రం పగిలిపోయింది. ఎవరతను? సామాన్యుడు కాదూ. ఆ వార్తను ఎంతమంది చదివి ఉంటారు? ఎంతమంది అతన్ని తలుచుకొని అభినందించి ఉంటారు? ఓ ప్రభుత్వ పతనం గురించో, ఓ సినిమా నటుడి అలవాట్ల గురించి చదివినంత ఆబగా అందరూ చదివి ఉండకపోవచ్చు.

అసలు అతనుకొండను బద్దలు చేయాలనుకున్నప్పుడు, చేస్తున్నప్పుడు ఇలాంటి వాటి గురించి ఆలోచించాడా?

రేపు ఆ రోడ్డుమీద నడిచేవారందరికీ అతని చరిత్ర తెలుస్తుందా? మరెందుకంతటి శ్రమను తలకెత్తుకున్నాడు.

మనిషికి ఇవన్నీ అర్థం చేసుకోవాలనే జిజ్ఞాస కావాలి. తీరిక కావాలి. అలా కావాలంటే ముందు తాము ఎలా బతుకుతున్నామో తెలుసుకోవాలి. ఇకముందు ఎలా బతకాలో తెలుసుకోవాలి.

''అద్భుతమైన వార్త కదూ'' అన్నడు సాంబశివరావు.

''అత్యల్పమైన వార్త కూడా'' అంది సులోచన.

''నేషనల్ హీరో...'' అంటూ మరీ మరీ అభినందించాడు.

''ఈ పని చేసింది ప్రభుత్వం కాదు. బాగా డబ్బుండి హాబీగా చేసిన లక్షాధికారి కాదు. బుల్డోజరులు కాదు. మందుగుండు కాదు. కేవలం ఓ సుత్తిని పట్టుకున్న సామాన్యుడు బ్రెవో... శిరసు వంచాలి'' అన్నాడు.

''మనం వంచటమేమిటి? పర్వతమే వంచింది'' అంది సులోచన.

వారిద్దరూ అలా చాలాసేపు అతనికేసి చూస్తుండిపోయారు.

''నాకూ కొన్ని కోరికలున్నాయి'' అన్నాడు సాంబశివరావ్.

''ఏమిటో చెప్పండి'' అంది.

''మా వూరికి ఏమైనా చేయాలని?''

''ఏంచేయాలనుకుంటున్నారు?''

''ఏదో ఒకటి చేయాలని ఉంది. ప్రత్యేకంగా ఇది చేయాలని ఉందని ఈరోజు అనుకోవటం లేదు. ఏదైనా చేయాలనే ఆశ తప్పితే అదేమిటో భవిష్యత్ నిర్ణయిస్తుంది. మన ఆలోచనలు ఎప్పుడూ ఒకేరకంగా ఉండవుకదా'' అన్నాడు.

''మంచిదేకదా'' అంది.

''దానికి ముందు నేనో మహాయుద్ధం చేయాలి. ఏదైనా చేసేముందు నేను స్థిరపడాలి. అదేం లేకుండా నేనేం చేసినా అది సమగ్రం కాకపోవచ్చు'' అన్నాడు. ఆ తర్వాత చెప్పాడు-

''మా ఊర్లో కొంతమంది ఉన్నారు. వారందరికీ డబ్బుందనే అహంకారం ఉంది. అంతకు మించి వారికి మొత్తంగా ప్రజలందరిమీదా ఏదో హక్కు ఉందనే ధోరణి ఉంది. నాకెందుకో వారి ప్రవర్తన తలుచుకున్నప్పుడల్లా ఆ మోనాపలిని బ్రద్ధలు చేయాలని ఉంటుంది''

''పెద్ద ఆలోచనే'' అంది సులోచన.

''అందుకేగా చెబుతుంది. ఆ ఊర్లో ఏంచేసినా వాళ్లే చేయిస్తారు. అంటే మా ఊరినంతా వాళ్లు బాగుచేశారనో, ఏదో చేయించారనో కాదు. గుడిలాంటిది కట్టించారు. అక్కడ సంబరాలు లాంటివి చేయిస్తారు. అంతకుమించి పెద్ద పెద్ద పనులేం చేయరు. అంతదాకా ఎందుకు? మాకు చుట్టుపక్కల చాలా గ్రామాలున్నాయి. ఇప్పుడున్న బడి స్థాయి పెంచితే చాలామంది పిల్లలు మైళ్లవరకూ నడిచే దూరం తప్పుతుంది. ఎవరికీ బడి విషయం గురించే పట్టదు'' అన్నాడు.

సులోచన సాంబశివరావునే చూస్తూ కూర్చుంది.

వారికి ప్రతి రోజూ కలసి కనీసం అయిదు నిముషాలైనా మాట్లాడుకోకపోతే ఏదో వెలితిగా ఉంటోంది.

చివరిసారిగా పరీక్షలు అయిపోయాక కలుసుకున్నారు.

''ఇప్పుడు చెప్పండి. రేపటినుండి మనం కలుసుకోంకదూ'' అంది సులోచన.

''అవును''

''తర్వాత మీ ప్రోగ్రాం ఏమిటి? ఇంకా చదువుతారా?''

''లేదు. నాకు చదవాలనిపించటంలేదు''

''ఎందుకని?''

''నాకెందుకో ఉద్యోగం చేయాలనిపించటంలేదు'' అన్నాడు.

''మరేంచెయ్యాలని''

''మొదట హైదరాబాదు వెళ్లాను. అక్కడ మెల్లగా ఏదైనా వ్యాపారంలాంటిది మొదలుపెడతాను'' అన్నాడు.

''డబ్బు అవసరం అవుతుందికదా''

''అవుతుంది. చూద్దాం. ఇప్పటి ఆలోచన





అది. ఆ తర్వాత ఏంజరుగుతుందో... ఇంటిద గ్గర్నుండి డబ్బు అందటం కష్టం. ఇప్పటివ రకూ నేను ఇంటి పరిస్థితి గురించి పెద్దగా పట్టించుకోలేదు. కాదూ, కూడదంటే నాన్న ఎక్కడోచోట తెచ్చి ఇస్తాడు. నాకే ఇష్టంలేదు. నా తిప్పలు నేను పడతాను. నాకాళ్లమీద నేను నిలబడతాను'' అన్నాడు సాంబశివరావు.

''ఆమాత్రం పట్టుదల ఉంటే విజయం సాధించవచ్చులే'' అంది సులోచన.

''పట్టుదల ఉన్నంత మాత్రాన సరిపో తుందా? అనేకం కలసిరావాలి. సరే నా ప్లాన్ అది. ఇంక మీ గురించి చెప్పండి. ఇంకా చదవాలనుకుంటున్నారా?''

''నాకయితే చదవాలనే ఉంది. మరి అమ్మ అందుకు అంగీకరిస్తుందనుకోను''

''మరేంచేయాలని?''

''ఇంక చేసేదేముంది? ఆ క్షణంకోసం ఎందురు చూడాల్సిందే'' అంది నవ్వుతూ.

ఆ క్షణం సులోచన కళ్లలో కొద్దిపాటి నిరు త్సాహమూ, సిగ్గూ కూడా తొంగిచూశాయనుకు న్నాడు సాంబశివరావు.

ఆ తర్వాత ఏం మాట్లాడాలో తనకి అర్థంకా లేదు. కొద్దిసేపటివరకూ ఎవరి ఆలోచనల్లో వారున్నారు. సాంబశివరావుకి ఏదైనా చెప్పా లనే ఆరాటంగా ఉంది. అందుకుతగ్గ భాషా... ధైర్యమూ కూడా ఆ సమయంలో కరవవుతు న్నాయి. సులోచన పరిస్థితి కూడా అదేవిధంగా ఉంది. సాంబశివరావ్ ఏదైనా చెబితే బాగుండుననిపించింది. కొద్దిసేపటి తర్వాత ఇద్దరూ ఒకేసారి తల ఎత్తటం, ఇరువురి కళ్లూ కలుసుకోవటం. జరిగిపోయాయి. ఇద్దరికీ నవ్వు వచ్చింది.

''ఎందుకు నవ్వుతున్నారు?'' అన్నాడు.

''మీరూ నవ్వారు కదా''

''అవును కదూ... కొన్నిసార్లు మాటలు రావు''

''ఏవిషయం?'' అంది సులోచన.

''మనం ఇంక కలుసుకోం అనుకుంటుంటే నాకు చాలా దిగులుగా ఉంది. ఈ నడుమకా లంలో మనం మంచి స్నేహితులం అయ్యాం'' అన్నాడు.

''నాకూ అలానే ఉంది''

''సులోచనా... మీరేం అనుకోకపోతే నామీద మీ అభిప్రాయం చెప్పండి'' అన్నాడు.

''మంచి ఫ్రెండ్''

''నా కుటుంబం గురించి మీకు చెప్పాను కదా. అలాగే మీ గురించి నాకు తెలుసు. సో...'' అంటూ ఆగిపోయాడు.

సులోచన అతని కళ్లలోకి చూసింది.

''ఇప్పుడు ఇలా ఆలోచించటం ఎంతవ రకు సమంజసం అనిపిస్తుంది. అయితే ఇప్పు డు ఆలోచించకపోతే ఆ తర్వాత జీవితాంతం బాధపడాలి''

''ఏవిషయం'' అంది సులోచన.

''మీకు తెలియందేముంది. మీ తర్వాతి కార్యక్రమం పెళ్లేగా?''

''అవును''

''మీరు పెళ్లి చేసుకుని నాకు దూరం అయి పోతారా?''

''ఏంచేయమంటారు'' అంది.

''నాకోసం ఆగకూడదూ... మీరంటే నాకు ఇష్టం కలుగుతుందే''

''ఇష్టమొక్కటేనా? ప్రేమకాదా?''

''ప్రేమ కూడానూ'' అన్నాడు.

అదేక్షణం దుర్గమ్మ గుర్తొచ్చింది.

ఆవిడ సిక్స్‌సెన్స్‌కి ఈ వార్త అందే వుంటుంది. మరి కొద్దిక్షణాల్లో ఊరంతా గుప్పు మంటుందేమో!

''అదిసరే... మా గుంటూరు జిల్లాలో మీకు బంధువులు లేరా?''

''ఎందుకు లేరు?'' అంది సులోచన.

''అందులో దుర్గమ్మ అనే పేరుగల వారెవ రూ లేరుగా''

''ఏమో... నాకు తెలియదు. ఎందుకలా అడిగారు?'' అంది.

''తర్వాత చెబుతాను. నాకు ఏం ఆలో చించుకోవాలో అర్థం కావటంలేదు. ఓవక్క హైదరాబాదు వెళ్లాలని ఉంది. ఇంకోవక్క

మీకు పెళ్లి అయిపోతుందేమో అనే భయంగా ఉంది. అయినా రెండు సంవత్సరాలు ఆగితే నేను పెళ్లి చేసుకుంటాను. అంటే మీ అమ్మగారు అంగీకరించరుకదా... అయినా అన్నీ అయిపోయినట్లుగా మాట్లాడుతున్నాను. ఇంతకూ నేనంటే మీకు ఇష్టమేనా?'' అన్నాడు సాంబశివరావ్.

"నాకు ఇష్టమే. ముందు మీరు కంగారు పడటం మానేయండి'' అంది సులోచన.

"ఇప్పుడు చెప్పండి. మీరు రెండు సంవత్స



రాల తర్వాత పెళ్లి చేసుకుంటానంటే మా అమ్మ అందుకు అంగీకరిస్తుందా అనేగా. నమస్యే లేదు. ఖచ్చితంగా ఒప్పుకోదు. అసలు ఆమె అనుకోవటం ఇప్పటికే నా పెళ్లి ఆలస్యం అయిపోయిందని. ఇంక మీరు సెటిల్ కాకుండా పెళ్లి చేసుకోవటం ఏమిటనే ఆలోచనలో ఉన్నారు. అంతేగా?''

తలూపాడు రావ్.

"నా అభిప్రాయం చెప్పమంటారా?"

"చెప్పండి"

"మనం పెళ్లిచేసుకుందాం"

"కానీ..."

"నన్ను చెప్పనివ్వండి. మనం పెళ్లిచేసుకు

న్నందువల్ల మీ ప్రణాళికలకి ఎలాంటి ఆటంకం కలగదు. రెండో విషయం పెళ్లి చేసుకున్నవెంటనే కాపురం పెట్టరుకదా. అందువలన మీరు దిగులు చెందాల్సిన పని లేదు. కొన్నిరోజులపాటు నేను అమ్మదగ్గ రుంటాను. లేదా మీ అమ్మగారిదగ్గరుంటాను. కాదంటావా హైదరాబాదే వస్తాను. ఇంక మనం సంసారం పెట్టొచ్చు అనుకున్నప్పుడే మీదగ్గర కి వస్తా. ఇలాంటిదానికైతే అమ్మ అంగీకరి స్తుంది''

''అసలిప్పుడు నాకింకో అనుమానం వస్తోంది'' అన్నాడు.

''ఏమిటండి బాబూ''

''ఉద్యోగం లేదు. సద్యోగం లేదు. నన్ను చూస్తే మీ అమ్మ పెళ్లికి అంగీకరిస్తుందా అని''

''దాని గురించి మీకెందుకు? ఆ విషయం నేను చూసుకుంటానుగా''

''అయితే పిల్లలు ఇప్పుడే అవసరంలేదు''

''ఇప్పుడు అది కూడా ఓ సమస్యేనా'' అంది సులోచన.

''అయితే ఇప్పుడేమిటి చెయ్యటం?''

''ఏంలేదు. మీరు నాతోపాటు మా ఊరు వస్తున్నారు''

''ఏంగొడవలు జరగవుకదా''

''మీకాభయం అవసరంలేదు. మా ఊరు మరీ వెనకబడిలేదని చెప్పానుకదా'' అంది.

''అంటే మీ ఊళ్లో దుర్గమ్మలు లేరా?''

''ఈ దుర్గమ్మ ఎవరండి బాబూ'' అంది.

సాంబశివరావు వివరంగా చెప్పాక ఇద్దరూ నవ్వుకున్నారు.

మరుసటిరోజు ఉదయం సులోచనతో కలసి వారి ఊరు వెళ్లాడు.

వెళ్తుంటే తన అమ్మ గుర్తొచ్చింది.

తర్వాత నాన్న గుర్తొచ్చాడు.

ఆ తర్వాత అనుకున్నాడు-

''జీవితం చాలా చిత్రమైంది''

★ ★ ★

సులోచన అమ్మగారికి పిల్లాడు నచ్చాడు. ఒకడే కొడుకు కావటం కూడా ఇంకా నచ్చింది. అయితే తన కూతురు తొందరపడిందేమో అనిపిస్తూంది. ఉద్యోగం లేదు. పైగా తనతోపా టు చదువుకున్నవాడు. పెద్దగా ఆస్తి లేనివాడు అనే సంశయం పీడిస్తూంది.

ఏదేమూలన తన కూతురు ఏకంగా ఇంటికి వెంటపెట్టుకుని ఆ అబ్బాయిని తీసుకొచ్చే సింది. జనం ఏమైనా అనుకుంటారేమో అనేది కూడా పీడించింది. సులోచన మాత్రం నిర్మొహమాటంగా తన అభిప్రాయం చెప్పే సింది.

''అమ్మా... నాగురించి నువ్వు అంతగా ఆలో చించాల్సిన పనిలేదు. చాలా జాగ్రత్తగా ఆలో చించుకున్నాకే నేనీ నిర్ణయం తీసుకున్నాను. ఇదేదో ఆవేశంలో చేస్తుంది కాదు. కొంతకా లంగా మా నడుమ మర్యాదపూర్వకమైన పరి చయం ఉంది. రెండోది ఆయనకి నువ్వు కోరుకున్నంత డబ్బు లేదేమోగాని, నన్ను ప్రే మించగలిగిన హృదయం ఉంది. ఆయనలో చాలా సాధించాలనే పట్టుదల ఉంది. అందుకే నువ్వు ఈ విషయంలో కొంచెం కూడా బాధపడ నవసరంలేదు''

సాంబశివరావు ఒక్కరోజుమాత్రం ఉన్నాడు.

''ముందు నేను మా ఊరు వెళ్లి అమ్మావా ళ్లకు చెబుతాను. ఎవరి విషయంలోనో తన అభిప్రాయం చెప్తాడు నాన్న. నా విషయంలో కాదనడు. ఆ తర్వాత ఉత్తరం రాస్తాను'' సులోచన అలానే అంది. తను వచ్చేశాక ముందు అమ్మతో మాట్లాడాడు.

''ఇంక ఈ సంవత్సరంతో నా చదువు అయిపోయింది. మనకు ఓపిక ఉంటే ఇంకా చదువుకోవచ్చు. అయితే నాకు చదువుకోవాల నిపించటంలేదు. ముందు హైదరాబాదు వెళ్తాను. నాకక్కడ చాలామంది స్నేహితులు న్నారు. వారిదగ్గరకు వెళ్లాక ఏంచేయాలో నిర్ణ యించుకుంటాను''

తులసమ్మకు ఈ విషయాలేం తెలియవు. మామూలుగానే ఆమెకు తన బిడ్డంటే అపార మైన నమ్మకం. ఇప్పుడయితే ఇంక చెప్పే పని లేదు. తను ఏంచెబితే అది వేదం.

''తర్వాత ఇంకో విషయం చెప్పాలి. నాకు సులోచన అనే ఓ స్నేహితురాలు ఉంది.





వాళ్లది క్రిష్ణాజిల్లా. ఆ అమ్మాయిని నేను పెళ్లిచేనుకోవాలనుకుంటున్నాను. మీరు సరేనంటే ఆ తర్వాత ఏర్పాట్లు చూడొచ్చు'' అన్నాడు.

తనంతట తాను పెళ్లివిషయం చెప్పటం ఆశ్చర్యం అనిపించినా... ''కృష్ణా జిల్లానా?'' అంది భయపడుతూ.

''అవును... ఏమైందయితే''

''ఆ జిల్లావాళ్లతో మనం వేగలేంరా'' అంది.

''ఏంచేస్తారంట వాళ్లు''

''ఎక్కడి డబ్బూ వాళ్ల సోకులకి చాలవు''

''ఎవరు చెబుతారమ్మా ఇలాంటి విషయాలు''

''అదేమిరా అలా అంటావ్ మనుమల గురించి తెలిసినట్టే, జిల్లాల గురించి కూడా తెలుస్తాయి''

''మంచిదేగా... బహుశా మన దుర్గమ్మగారు చెప్పిందేమో''

''దుర్గమ్మ కాదులేరా?'' అంది.

''గుంటూరు జిల్లావారు కూడా చాలామంది సోకుచేనుకుంటారు. మరి నువ్వు గమనించావో లేదో కొంచెం తలనొప్పి వస్తే చాలు. హాస్పిటల్లో కాపురం పెట్టేసేవాళ్లున్నారు. అలా అని అంతా అలా ఉండరుకదా. సులోచన వారి కుటుంబం చాలా పద్ధతిగా ఉంది?''

''నీకెట్లా తెలుసురా?''

''నేను వాళ్ల ఊరు వెళ్లాను''

''అంతా అయిపోయిందన్నమాట'' అంది తులసమ్మ.

''ఏమీకాలా. అన్నీ నీచేతులమీదుగానే అవుతాయి. అయినా నాన్నతో ఏమన్నావు. మా అబ్బాయికి ఎవరూ నంబంధాలు చూడనవసరంలా అని. ఇప్పుడు ఇలా అంటున్నావేంటి?''

''నేం అన్నానురా. మాటవరనకి చెప్పానంతే. మీ నాన్న అన్నట్టు నువ్వుకదా రేపట్నుండి ఆ అమ్మాయితో బతికేది'' అంది.

''అంటే మీరు మాతో రారా?''

''బాగుంది. ఆ విషయం మీ నాయన్నడుగు'' అంది.

తను అలా మాట్లాడిందేగానీ తన పిల్లవాడు అంత పొరపాటు పని చేయడని ఆమె గాఢమైన నమ్మకం.

ఈ నంభాషణ ఇంతదూరం నడిచిందిగాని భూషయ్యగారితో నిముషాలమీద తెలిసిపోయింది. ఆయన వచ్చుజెండా ఊపాడు.

సాంబశివరావు ఉత్తరం రాశాడు. సులోచన అమ్మగారు తమ ఊరినుండి ఇద్దరు పెద్ద మనుమల్ని పంపించింది. వాళ్లు కూడా ఒకటే అన్నారు.

''అయ్యా... ఇందులో ఎవరిపాత్రా ఏంలేదు. కట్నకానుకల గురించో, లాంఛనాల గురించో మాట్లాడేదేం లేదు. పిల్లలిద్దరూ ఇష్టపడ్డారు. ఇంకా ఆ శుభకార్యక్రమాన్ని మన మందరం జరిపించాలి. ఆ అమ్మాయికి తండ్రి లేడు. అందుకే మేం వచ్చాం. ఇంక జరగాల్సిందంతా మొక్కుబడి కార్యక్రమమే. అమ్మాయిని చూట్టానికి రండి''అని చెప్పి వెళ్లిపోయారు.

''నేను రాను. మీరు చూసిరండి'' అని ముందు భూషయ్యగారు గొడవచేశాడు. ఆఖరికి పూర్ణయ్యగారు పిలిచి-

''అదేమిటి భూషయ్యగారూ... వెళ్లనంటూ కూర్చుంటే ఎలా? వాళ్లు ఇంకో రకంగా అనుకుంటారు. ముందు ఓ చీరతో వెళ్లి ముహూర్తం ఖాయం చేనుకురండి''

భూషయ్యగారు తలూపి వచ్చాడు.

ఆయన కుటుంబంలోనివారే చీర కూడా కొనుక్కుని రావటం జరిగింది. సాంబశివరావుకి ఇప్పుడైనా తన నాన్న కొత్తచొక్కా తొడుక్కుంటే బాగుండుననిపించింది. అందుకు భూషయ్యగారు అంగీకరించలా.

తనకున్న పాత చొక్కాని తీసి, బలవంతంమీద దాన్ని పొడి ఇస్త్రీ చేయించుకొని బయలుదేరాడు. మొత్తంమీద కార్యక్రమం జరిగిపోయింది. సులోచన భూషయ్యకీ, తులసమ్మకీ నచ్చింది.

చిన్న లగ్నాలు పెట్టుకోవటం, పెళ్లి జరగటం అంతా ఓ కలలా జరిగిపోయింది. తమ పరీక్షా ఫలితాలు చూసుకుంటున్న రోజున వారిద్దరూ అదే అనుకున్నారు-



''ఇలా జరిగితే బాగుండును అనుకున్నానే గానీ ఖచ్చితంగా ఇలా జరుగుతుందని మాత్రం నేను ఊహించలేదు'' అంది సులోచన.

''నేనూ అంతే'' అన్నాడు.

కొద్దిరోజుల్లోనే హైదరాబాదు వెళ్లిపోయాడు సాంబశివరావ్. రెండునెలలపాటు వారిద్దరిన డుమా ఉత్తరాలు మాత్రమే నడిచాయి.

ఓరోజు రాత్రి ఊహించనివిధంగా వచ్చాడు.

ఇద్దరూ వెన్నెల్లో కూర్చున్నారు.

''ఇప్పుడు చెప్పండి'' అంది సులోచన.

''నేను మన జీవితానికి చెంది ఓ ఎక్స్‌పెరిమెంట్ చేయబోతున్నా''

''అదేంటో చెప్పండి'' అంది.

తనవెంటతెచ్చిన ఓ ప్రాజెక్టు రిపోర్ట్ చూపించాడు.

''స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీ... లక్షన్నరతో ప్రారంభం అవుతుంది. అది కూడా లోన్ తీసుకుంటాను అయితే...'' అంటూ ఆగిపోయాడు.

''చెప్పండి... ఇది మనకు చెందిన వ్యవహారం'' అంది సులోచన.

''లోన్ కావాలంటే ముందు హామీ ఉండాలి. అలాగే మనదగ్గరంటూ కొంచెం డబ్బు కూడా ఉండాలి. నేను ఇంతకుముందు చెప్పినట్లు నాన్నను అడిగే ఉద్దేశంలేదు. పూర్ణయ్యగారికి ఆయన డబ్బులు ఇవ్వాలనుకుంటాను. అందుకే వేరే మార్గం గురించి ఆలోచిస్తున్నా''

''ఇంక వేరే మార్గం ఏముంది?''

''కొంతమంది ఫ్రెండ్స్ ఉన్నారుకదా... వారికి ఈ ప్రాజెక్టు గురించి చెబుతాను. పార్ట్‌నర్స్‌గా చేరితే నేను వర్క్‌చేస్తాను'' అన్నాడు.

సులోచన తన భర్త కళ్లల్లోకి చూసింది.

అతనిలో ఎందుకో భూషయ్యగారు కన్పించాడు.

అంత నిర్మలంగా ఉందతని ముఖం.

''ఏమిటలా చూస్తున్నావు?''

''ఈ ప్రాజెక్ట్‌మీది. ఇందులో శ్రమ మీది. లాభనష్టాలు కూడా మీవే కావాలని ఎందుకు అనుకోరు?'' అంది సులోచన.

సాంబశివరావ్ నిర్ఘాంతపోయాడు.

''కానీ... మనదగ్గర కేపిటల్ లేకుండా ఎలా సాధ్యం''

''దానిగురించి మీరేం వర్రీకాకండి''

''అంటే...'' అన్నాడు.

''మా అమ్మను అడుగుదాం''

''నాకు ఇష్టంలేదు'' అన్నాడు.

''స్నేహితుల్ని అడగగా లేంది మా అమ్మను అడగకూడదా?''

''నా ఉద్దేశం అది కాదు''

''నేను అర్థంచేసుకోగలను. మా అమ్మ నా పెళ్లి చేయటంకోసం కొంత డబ్బు ఉంచింది. ఇప్పుడది మనం వినియోగించుకుంటాం''

''సులోచనా...''

''ఇంక మీరేం మాట్లాడవద్దు. నాకు మీ ప్రాజెక్ట్ రిపోర్ట్ గురించి తెలియదు. అందులోని మంచి, చెడ్డలూ, మార్కెటింగ్ గురించి తెలియదు. నాకు తెలిసిందల్లా ఒకటే. ఇది మీది. మీరో ప్రయత్నం చేస్తున్నారు. దట్సాల్. ఇందులో మీరు విజయం సాధించారా... చెప్పే పనిలేదు. లేదనుకోండి. ఏం బాధలేదు. మనమిద్దరం చదువుకున్నాం. చెట్టుకింద కూర్చుని నలుగురికి ట్యూషన్స్ చెప్పుకున్నా మనం బతగ్గలం. అందుకే ఈ ప్రయోగం మనం చేద్దాం''

సాంబశివరావ్ సులోచనకేసి చూస్తుండిపోయాడు. అతనికి తన అత్తగారినుండి ఏమైనా తీసుకొని చేయాలనే ఆలోచనమాత్రం రాలేదు. ఏ స్నేహితులతోనయినా మాట్లాడాలనే వచ్చాడు.

''స్నేహితులు స్నేహితులంటారు. వాళ్లు మాత్రం శాశ్వతమా. లాభాలు వచ్చాయనుకోండి. అప్పుడు ఓరకంగా ఉంటుంది. అది ఫెయిల్ అయిందనుకోండి. నేరమంతా మీనెత్తిమీదకు తోసే నిందలు వేస్తారు. సక్సెస్‌కి మాత్రం తమ పెట్టుబడి, మేనేజ్‌మెంట్ కారణం అంటారు. మీ ఇష్టం. ఆలోచించుకోండి''

''మీ అమ్మగారు ఏమంటారో?''





''ఏమీ అనరు. అన్నా మనం కేర్ చెయ్యం. ఇది మన జీవితం. అయినా అమ్మకు నచ్చచెప్పగలననే నమ్మకం నాకుంది'' అంది.

సులోచన ఈ విషయం ఆవిడతో అంది.

''నా నోరు కట్టేస్తున్నావు. మీకు ఆధారం ఇదేకదా. ఏమైనా అయితే మీ పరిస్థితి ఏమిటి?'' అంది.

''అమ్మా... నాన్న చనిపోతే మన ఏంచేశాం?''

''ఆయన ఆ పొలం అంటూ వదిలిపోబట్టి గుట్టుగా బతికాం''

''మాక్కూడా అలాంటి ఆస్తి ఉందమ్మా. మేమిద్దరం చదువుకున్నాం. మా ఇరువురిలోనూ ఆత్మవిశ్వాం ఉంది''

''అయినా అతనూ కుర్రవాడు. అనుభవం లేదుకదా?'' అంది.

''చూడమ్మా... నాతల్లిగా నీకు ఏయే ఆలోచనలుంటాయో నాకు తెలుసు.''

''అంటే ఏమంటావ్?''

''ఈ విషయంలో నాది ఒకటే మాట. మేం సొంతం ఫెయిల్ అయ్యామనుకునే ప్రారంభం అవుతాం. నువ్వు అంగీకరిస్తే మాతో సహకరించు''

ఆమె మాట్లాడలేదు.

''అంతేకాదు. నువ్వు నాకు ఎంత ఇవ్వదలుచుకున్నావో అంతకంటే పైసా కూడా ఎక్కువ మాకు అవసరంలా. మా ప్రయోగంతో తమ్ముడ్ని బాధపెట్టడం ఇష్టంలేదు మాకు''

''సులోచనా'' అందామె బాధగా.



సాంబశివరావ్ ప్రయోగశాల భాగ్యనగరమే...

తను వెళ్లిన నెల రోజులకే ఓ లెటర్ రాశాడు.

''సులోచనా...

నా ప్రయత్నాలు ఆరంభం అయ్యాయి. నేను లోన్‌కోసం తిరుగుతున్నాను. అనేక మందిని కలుసుకుంటున్నాను. ఇంకా నా ప్రాజెక్టుకి తుదిరూపం ఇవ్వటానికి మెరుగులు దిద్దుకుంటున్నాను. సాయంకాలం గదికి వచ్చేసరికి ఎక్కడలేని నీరసం... ముందు హాయిగా ఎవరైనా పలకరిస్తే బాగుండుననిపిస్తుంది.

ఉదయంనుండి నేను కోల్పోయిన శక్తినంతటినీ ఎవరైనా అందించాలనిపిస్తుంది. ఈ సమయంలో మానాన్న గుర్తొస్తున్నాడు. ఆయనకు అంత ఓపిక ఎలా వస్తుందో నాకు తెలియదు. ఉదయం లేచిందగ్గర్నుండి పడుకోబోయేదాకా, పడుకున్నాక కూడా ఆయన ఏదో ఒక పని చేస్తూనేఉంటాడు. అదెలా సాధ్యమా అనుకునేవాడిని. ఇప్పుడు అర్థమవుతుంది.

నాన్న శ్రమవెనుక అమ్మ ఉంది!

ఇప్పుడు నాకూ అంతే. నాకు రిలీఫ్ కావాలి. నీ ప్రోత్సాహం కావాలి. నీ సహచర్యం, ప్రేమా కావాలి. నువ్వు పక్కనుంటే నేను ఏమైనా సాధించగలననే విశ్వాసం ప్రతి క్షణమూ కలుగుతుంటుంది. అందుకే రెండు గదుల ఇల్లు చూస్తున్నా. త్వరలో వచ్చి తీసుకువెళ్తా''

సులోచనను హైదరాబాదు తీసుకువెళ్లే ముందు ఇంటికి వెళ్లాడు.

''ఆడు కొత్తకాపురం పెడుతున్నాడుగా... వెళ్లకూడదూ'' అంది తులసమ్మ.

''మామయ్యగారూ... మీరూ ఇద్దరూ రావాలి'' అంది సులోచన.

''ఇప్పుడు కాదులే'' అన్నాడు భూషయ్య.

''మీరైనా రండి అత్తయ్యా'' అంది.

''ఇప్పుడు కాదులే. నేను లేకపోతే ఆయన ఇబ్బంది పడతాడు'' అంటూ తులసమ్మ కూడా వెళ్లలేదు.

అయితే భూషయ్య కొడుకు సాంబయ్య నగరంలో ఏదో చేసెయ్యబోతున్నాడని ఊరంతా మారుమోగిపోయింది. అందుకు కా

రణం ఎవరో వేరే చెప్పాల్సిన అవసరం లేదు.

సాంబశివరావుకి జీవితంలో మరిచిపోలేని అనుభవం.

తను ఊహించుకున్నంత గొప్పగా లేదు తన ప్రాజెక్టు. లోతులకు దిగుతుంటే అర్థమవుతూ వచ్చాయి లొసుగులు. నగరాల్లోని మనుషుల నవ్వుల వెనక, మర్యాదపూర్వకమైన ప్రవర్తనల వెనక ఉన్న అరాచకమూ, స్వార్థమూ అనుభవంలోకి వస్తున్నాయి.

"నేను ఓడిపోతున్నాను సులోచనా" అంటూ కృంగిపోయేవాడు.

"ఏంకాదు. రేపు మనది"

"లేదు... లేదు... అదంతా భ్రమ"

"కాదు. మీరు ఆకాశం అంత ఎత్తు ఎదుగుతారు"

"లేదు సులోచనా... నేను అగాధాల్లోకి జారిపోతున్నా. నన్ను చూసి అందరూ నవ్వుతున్నారు.

"నవ్వుకోనియ్యండి... మనమేం అనుకున్నాం. అపజయంతోనే మన ప్రారంభం... ఇందులో సిగ్గుపడాల్సింది లేదు"

"కానీ... ఇదంతా ఓ రూపం తీసుకునేదెప్పుడు? మనం ముందుకు వెళ్లేదెప్పుడు?"

"చూద్దాం... మనం శ్రమిస్తున్నాం. మంచి మార్గం దొరక్కపోదు"

అయినా సాంబశివరావులో అంతులేని నిరాశ, నిస్పృహ... అవన్నీ సులోచనదగ్గరే. ఉదయం లేస్తే అతని ప్రపంచం వేరు.

చాలాకాలంపాటు ఆమె ఈ రెండు రకాల ధోరణులని అర్థంచేసుకోలేకపోయింది...

ఓరోజు చెప్పింది...

"త్వరలో మన నడుమకు ఓ పాపాయి రాబోతూంది"

"ఈ సంక్షోభంలోనా?" అన్నాడు.

"వాళ్లకేం తెలుసు. సంక్షోభమో... ప్రశాంతమో"

"రానివ్వు... మనం చేయగలిగిందేముంది" అన్నాడు.

"చేయాల్సిందంతా చేసి అలా అంటారేమిటి?" అంటూ నవ్వింది సులోచన.

రోజులు గడిచిపోయాయి.

సులోచన పుట్టింటికి వెళ్లింది. అయితే తన కూతురు చాలా అభిమానవంతురాలనే విషయం వాళ్లమ్మకి తెలుసు. అందుకే వారి గురించి తెలుసుకోవాలనుకున్నా ఆ కోరికను బలవంతంగా నిగ్రహించుకొంది.

మొదటి కాన్పులో అమ్మాయి పుట్టింది...

తులసమ్మ ఆనందంగా బిడ్డను అందుకొని భూషయ్య చేతికి అందించింది. కొద్దిసేపు పరీక్షగా చూసి అందించాడు.

"ఎవరి పోలికా" అంది తులసమ్మ.

"అప్పుడే ఎట్టా తెలుసుద్ది" అన్నాడు.

ఓరకంగా సులోచనతోనే భూషయ్యగారు ఎక్కువ మాట్లాడతాడు. అలా చేయగలిగింది. ఏదో ఒక పని కల్పించుకొని ఆయనతో మాట్లాడేది. ఎలా అయినా ప్రయత్నంచేసి మావయ్యగారిని తలెత్తి మాట్లాడేలా చేయాలనేది ఆమె ఆరాటంగా ఉండేది.

పాప పేరు విషయం గురించి సాంబశివరావు మాట్లాడాడు.

"మనం 'స్వప్న' అని పెట్టుకుందాం. నా ప్రాజెక్టు ఓ స్వప్నం. నా భవిష్యత్ గురించి నా అంచనాలన్నీ స్వప్నాలుగా ఉంటున్నవేళ మన నడుమకు వాస్తవం వచ్చింది. అందుకే అమ్మాయికి 'స్వప్న' అని ఖాయం చేద్దాం"

"మీ స్వప్నంతో నేను ఏకీభవిస్తున్నా" అంది సులోచన.

తిరిగి హైదరాబాదు వెళ్లిపోయారు.

కొంతకాలంపాటు అజ్ఞాత జీవితం అనుభవించినట్లే. మరలా ప్రపంచానికి అందులోనూ తమ అమ్మా, నాన్నలకి తెలిసింది మరో జననానికి ముందు. ఈ నడుమ కొన్ని సంవత్సరాలు గడిచాయి.

రోజువారీ జీవితంకోసం సులోచన ఉద్యోగంలో చేరిందిఎలా జీవించారోవారికే తెలును ఎక్కణాన అయినా ఇంటికి వెళ్లి నాన్నను అడిగిఏమైనా తెచ్చుకుంటే అనిపించేది.

అందుకు తగిన శక్తి కూడా లభించేదికాదు. తను ఏదో చేయబోతున్నానంటూ ఎవరి





ముందూ ప్రగల్భాలు పలకలేదు. అయినా సులోచనతో అననీ, లేదా తన మనసుకు చెప్పుకునీ తన ఊరి మోతుబరులమీద తన కున్న నిరసన, వారిని, వారి అహంకారాన్నీ దెబ్బకొట్టాలనే ఆలోచన మాత్రం పెరుగుతూవ చ్చింది. అది ఇప్పుడు తలెత్తి ప్రశ్నించటం ఆరంభించింది.

వారందరూ తనకేసి చూస్తున్నారనే అని పించేది. అంతేకాదు 'భూషయ్య కొడుకుని' హేళన చేస్తున్నట్లుగా బాధపడేవాడు.

"ముందు పొట్ట చేత్తేపట్టుకొని ఈ ఊరు రాకపోతేసరి" అనెవరో అంటున్నట్లుగా అని పించేది.

"ఈడి సంగతి ఆ భూషయ్యకెప్పుడో తెలుసు. అందుకే 'గొడ్డకాడ పనిసెయ్యరా' అని గోలెట్టేవాడు"

"ఆపనే సేత్తే సరిపోయేది. ఈడక్కడ సంపా యించేదో చచ్చాడోగానీ... భూషయ్య దగ్గరున్నా ఈపాటికది నాలుగెకరాలయిఉండేది"

ఇవన్నీ సాంబశివరావుకు ఆలోచనలే.

జీవితం ఎప్పుడూ ఒకేరకంగా ఉండదు.

సాంబశివరావు జీవితంలో ఓ పెనుమార్పు వచ్చింది.

సాంబశివరావు తన ప్రాజెక్టు రూపొందించే విషయంలో ఎలాంటి పొరపాటు పడలేదు. అయితే 'బ్యూరోక్రసీ' గురించి అతనికి తెలియదు.

దేశం పారిశ్రామికంగా ముందుకు పోవాలి. పరిశ్రమలు స్థాపించేవారికోసం మేం సహాయాలు చేస్తాం. ముందుకు రండి అని ఉపన్యసించేవారిని చూసి అతను అనేక భ్రమలకు లోనయ్యాడు. తన ప్రాజెక్టుని చూసినవెంటనే పనులన్నీ పూర్తయి అనుకున్న సమయానికి ఉత్పత్తి ప్రారంభం కాగలదనుకున్నాడు.

అందుకు భిన్నంగా జరిగింది. చిన్న పరిశ్రమలను ఎలాంటి పెట్టుబడిలేకుండా, కేవలం బ్యాంకుల్నో మరొకరినో నమ్మి మొదలు పెట్టకూడదు. అవసరమైతే స్వయంగా నిర్వహించ గలిగే స్థితి ఉంటేనే ప్రారంభించాలి. ఇదే అతని అనుభవం.

అంతేకాదు పరపతి సౌకర్యాలూ, పర్మిట్లూ, ప్రోత్సాహకాలు అన్నీ పెద్దపెద్ద పారిశ్రామిక వేత్తలకే లభిస్తాయి. వారు క్షణాల్లో పనులు చేయించుకోగలుగుతారు. అధికార్లు వారి కను సన్నలలో మెలుగుతారు. రాజకీయ్యనాయకులు వారి జేబుల్లో ఉంటారు. పనంతా కాయితాలమీద నడుస్తుంటుంది.

ఫోన్లూ... టెలిప్రింటర్లూ... స్టార్ హొటళ్ళూ... మద్యం... ఇవన్నీ పోటాపోటీలుగా ఉంటాయి. చూస్తుండగానే భవనాలు పైకి లేస్తాయి.

అంతకుముందు తనలాంటివారు ఎందరెందరో నలిగిపోతారు.

సాంబశివరావు తను ఎన్నుకున్న 'ప్రాజెక్టు'కి సరైన సమయంలో 'లోన్' లభించకపోవటం... తన దగ్గర 'వర్కింగ్ కేపిటల్' లేకపోవటం అనే ఇబ్బందిని మాత్రమే కాదు ఎదుర్కొంది. అతను తయారుచేసుకున్న దినాల్లో తన ప్రొడక్టుకు మంచి గిరాకీ ఉంది.

ఆ తర్వాత రాజకీయరంగంలో మార్పులు వచ్చాయి. దాంతో ఆ మంచి అవకాశాలకు తీవ్రంగా దెబ్బతగిలింది.

కొన్ని సంవత్సరాలు అలా గడిచాయి.

తిరిగి ఇప్పుడు ప్రభుత్వం మారింది. అంతే సాంబశివరావులో కొత్త ఆలోచనలు ఊపిరి పోసుకున్నాయి. అయితే ఈ సంవత్సరాలన్నింటా సాంబశివరావ్ ఊరికే కూర్చోలేదు. భారత పారిశ్రామికరంగం గురించి బాగా అధ్యయనం చేశాడు. అతను తనకని కాకపోయినా కొన్ని 'ప్రాజెక్ట్'లరూపకల్పన చేశాడు. ఓ సందర్భంలో వాటిని పరిశీలించిన ఓ కొత్త పరిచయస్థుడు ఆశ్చర్యపోయాడు.

"ఈ ప్రాజెక్టుమీద నేను పెట్టుబడి పెట్టాలనుకుంటున్నాను"

"నిరభ్యంతరంగా పెట్టండి"

"మనం పెర్స్నల్ మాట్లాడుకుందాం" అన్నాడతను.

"ఇందులో మాట్లాడుకోవటానికేంలేదు. మీకు నేను రూపొందించుకున్నదంతా ఇస్తాను. నాకు నయాపైసా అవసరంలేదు. ఇది సక్సెస్ కావటమే నాకు కావాలి" అన్నాడు సాంబశివ

రావ్.

ఆ వ్యక్తి చాలా ఆశ్చర్యపోయాడు.

డబ్బు చాలామంది దగ్గర ఉంటుంది. అయితే అది ఏవిధంగా పెట్టుబడి పెట్టాలి అనేది మాత్రం అందరికీ చేతకాదు. అలాంటి వారి మూలాన, ముఖ్యంగా డబ్బుదాచుకోవాలనే తత్వంవల్ల ఈ దేశంలో డబ్బు 'డెడ్' అవుతూంది. అతను మొత్తం మీద 'రావ్' బాగానే డిమాండ్ చేస్తాడనుకున్నాడు.

రావ్ దృష్టివేరు. ముందతనికి నమ్మకం కావాలి. తనమీద తనకూ, సులోచనకూ నమ్మకం ఉన్నంత మాత్రాన చాలదు. అది ప్రూఫ్ కావాలి. అందుకే ముందు ఆ ప్రాజెక్ట్ విజయవంతం అయితే చాలు. తన 'ఇగో'ను తృప్తిపరుచుకుంటాడు.

చూస్తుండగానే పనులు జరిగిపోయాయి. అద్భుతమైన విజయం అది. సాంబశివరావు పొందిన ఆనందం అంతాఇంతాకాదు.

తను విజయం సాధించాడు.

సరిగ్గా అప్పుడే సులోచన తిరిగి చెప్పింది.

"మన నడుమకు ఇంకో పాపాయి రాబోతూంది"

"మోస్ట్ వెల్‌కమ్" అన్నాడు సంతోషంగా.

మారిన పరిస్థితుల్లో బ్యాంకులు ముందుకొచ్చాయి. తన మిత్రుడు సహాయం అంటూ చేయకపోయినా తన వెనక నిలబడ్డాడు. అంతా మాంత్రికుడి మహిమలా అనిపించింది. అప్పటినుండి సాంబశివరావ్ వెనక్కి చూసుకోలేదు. ఇంకా రకరకాలుగా చొచ్చుకుపోవటం తప్పించి-

అప్పుడు వచ్చాడు 'భూపేష్'.

"ఈసారి మాత్రం మా నాన్న పేరు పెట్టుకు తీరాలి" అన్నాడు సాంబశివరావు.

"పెట్టండి. అయితే ఆధునికంగా ఉండేట్లు చూడండి. రేపు మీ అబ్బాయి పెద్దయితే మిమ్మల్ని తిట్టకూడదు" అంది సులోచన.

"అయినా నాకు తెలియక అడుగుతాను. మీరు మీ అమ్మను అంత గాఢంగా ప్రేమిస్తారు కదా. మరి ఆమె పేరు పెట్టుకోకుండా మీ నాన్న పేరే ఎందుకు పెట్టుకుంటున్నారు" అంది.

"నేను మా నాన్న పేరుగా పెట్టుకోవటంలా. అలా పెట్టుకోవాల్సివస్తే మీ నాన్నగారున్నారు. అలానే మా అమ్మా, మీ అమ్మా కూడా ఉన్నారు. మరెందుకంటావ్. ఈరోజు నేను ఏ కబుర్లయినా చెప్పవచ్చు. నేను పరిస్థితులు అనుకూలించనప్పుడు ఎంతగా కృంగిపోయానో నాకు తెలుసు. నీకు తెలుసు. కానీ మా నాన్నమాత్రం అలా కాదు"

సులోచన వింటుండిపోయింది.

"జీవితంలో ఆయనా అనేక ఆటుపోట్లు ఎదుర్కొన్నాడు. కొన్ని సంవత్సరాలు వానలు కురిసేవి కాదు. మరికొన్ని సంవత్సరాలు ఏ తెగులో వచ్చేది. మరి కొద్ది రోజుల్లో పంట చేతికి వస్తుందనగానే రోజులతరబడి వర్షాలుకురిసేవి. పంటంతా నీళ్లలో నానిపోయేది. మొక్క మొలిచేది. మరాయనకి బాధ ఉండేదో... ఉండదో తెలిసేది కాదు. కొంచెం సేపు తన చేనుకేసి అలా చూసుకునేవాడు. తర్వాత మా భీముడ్ని పిలిచేవాడు..."ఒరేయ్ నీళ్ళు బయటకు వదులుదాం" అంటూ వంగేవాడు. మెల్లగా నీరుపోవటానికి దారిచేసేవాడు. పిల్లలు జ్వరం వస్తే తల్లులు ఎలా ఆరాటపడతారో, ఎంత జాగ్రత్తగా ఉంటారో అంత జాగ్రత్తగా ఉండేవాడు. ఒక్కోసారి వంటరిగా పడుకుని తనలోతను మాట్లాడుకునేవాడు.

అంతకుమించి అమ్మముందు మరొకరి ముందుగానీ ఇలా అయిపోయిందే అని లేదు. కనీసం 'దరిద్రపువాన' అని కూడా తిట్టేవాడు కాదు. అలాంటి మనిషిని అర్థంచేసుకోవటం నావల్లకాక కొంతకాలం కోపం తెచ్చుకున్నా ఒక్కోసారి నవ్వుకున్నా నేను డిప్రెషన్‌లో ఉన్నప్పుడు నాకు ఊపిరి పోసింది నాన్న. నేను రాత్రంతా ఎంతగా క్రుంగిపోయినా ఉదయం లేచేసరికి నాన్న గుర్తొచ్చేవాడు. ఆయన ఎంత ఉత్సాహంగా పనిచేసేవాడో అంత ఉత్సాహంతో పనిచేయటానికి నేను ప్రయత్నం చేసేవాడ్ని.

నాన్న పేరు పెట్టుకున్నంతలోనే కాదు వీడు ఆయనలా కాకపోయినా, ఆయనలోని కొన్ని లక్షణాలైనా పొందగలిగితే నేను సంతోషిస్తా" అన్నాడు.

"అవును... మావగారు నిజంగానే భిన్న




మైన వ్యక్తి" అంది సులోచన.

ఇద్దరు పిల్లల్తో చాలు అనుకొని ఆపరేషన్ చేయించుకున్నారు. అయితే తులసమ్మగారికి మాత్రం అది ఇష్టంలేదు.

"అప్పుడే ఏమైపోయిందిరా... ఇంకోళ్లవరకు ఆగండి" అందామె.

సాంబశివరావు నవ్వుతూనే తిరస్కరించాడు.

భూషయ్యగారు మామూలుగానే ఈ విషయం గురించి తన ధోరణిలో తానున్నాడు. మనవడ్ని ఎత్తుకున్నాక ఈసారి వెంటనే ఇచ్చేయకుండా కొంచెంసేపు ఆడుకున్నాడు. వాడు మీసాలు పట్టి లాగుతుంటే తులసమ్మకేసి చూసి నవ్వేవాడు.

సాంబశివరావ్ తరచుగా ప్రయాణాలు చేస్తుండేవాడు. అలాంటి సమయంలో సులోచన పిల్లల్తో వచ్చి అత్తగారి దగ్గరుండేది.

తప్పటడుగులువేస్తూ... "తాత... తాత" అంటూ పిలిచే తన మనవడ్ని చూసి భూషయ్యగారికి సంతోషం కలిగేది.

"చిన్న భూషయ్యగారు" అంటుండేవారు చుట్టువక్కలవారంతా.

సాంబశివరావు తన పిల్లల విషయంలో మాత్రం చాలా భిన్నంగా ఉండేవాడు. వారిని ఒక్కమాటకూడా అనడు. ఎంత అల్లరిచేసినా నరే నవ్వుతూనేఉంటాడు. వాళ్లని గుండెలమీదకెక్కించుకొని కథలు చెబుతుంటాడు. పాటలు పాడతాడు. వాళ్లు ఏంకావాలని కోరితే అది తెచ్చిపెడతాడు.

తను తన నాన్ననుండి ఏమైతే పొందాలని ఎదురు చూశాడో అవన్నీ తన పిల్లలకు అందచేశాడు. స్వప్న ఓసారి అడిగింది.

"డాడీ... తాతగారు మిమ్మల్ని ఎప్పుడన్నా కొట్టారా?"

"ఏమోనమ్మా... చిన్నప్పుడు కొట్టేవారేమో నాకు తెలియదు. నాకు ఊహవచ్చాక మాత్రం ఎప్పుడూ కొట్టినట్లు గుర్తులేదు"

"మరి నాయనమ్మ"

"నాయనమ్మకూడా అంతే"

"మరి తాతయ్య బట్టలు ఎందుకు వేసుకోడు"

"బట్టలు వేసుకోడా?"

"పంచెకట్టుకుంటాడులే. చొక్కా ఎందుకు వేసుకోడు"

"తాతయ్యని అడగకపోయావా?"

"మీరే చెప్పండి డాడీ"

"మీ తాతయ్య దగ్గర చొక్కా కుట్టించుకోవటానికి డబ్బులు లేవేమో"

"ఏంకాదు... మీదగ్గర డబ్బులున్నాయిగా. మీరు కుట్టించొచ్చుగా"

"నేను కుట్టించినా ఆయన తొడుక్కోడమ్మా"

"మా ఫ్రెండ్స్‌కి తాతగారి గురించి చెప్పాను. వాళ్లేమన్నారో తెలుసా?"

"ఏమన్నారు?"

"గాంధీతాతగారా మీ తాతగారు అన్నారు"

సాంబశివరావుకి నవ్వు వచ్చింది.

"ఈసారి తాతగారి ఊరు వెళ్లినప్పుడు నువ్వు అడుగు. తాతగారూ మీరెందుకు చొక్కా వేసుకోరూ అని. దానికి ఆయనేం చెబుతాడో చూడు"

"నాకు తాతగారంటే ఇష్టంలేదు"

"ఎందుకనమ్మా"

"తాతయ్యకి తమ్ముడంటేనే ఇష్టం" అంది బుంగమూతి పెట్టి.

"పోనీలేమ్మా. నాకు నువ్వంటేనే ఇష్టంకదా"

"నాన్నగారూ..." అంది సంతోషంగా

"చెప్పమ్మా..."

"మీ నాన్నగారు మిమ్మల్ని బడిదగ్గర దింపేవారా?"

"లేదమ్మా... నేనే నడిచి వెళ్లేవాడిని"

"మీకు రిక్షాలు కూడా లేవా?"

"లేవమ్మా..."

"మీ బడిలోకి టిఫిన్ తీసుకెళ్లేవారా?"

"అవునమ్మా"

"ఏమీ కొనుక్కునేవారు కాదా?"

"ఊహూఁ"





"ఎందుకని?"

"మీ తాతగారు నాకు డబ్బులు ఇచ్చేవారు కాదు"

"ఒక్కసారన్నా..."

"ఇంతవరకూ ఒక్కసారి కూడా ఇవ్వలా"

"నాకూ ఇవ్వలా" అంది స్వప్న.

తిరిగి సాంబశివరావుకి నవ్వు వచ్చింది.

"తాతయ్య మంచికాదు" అంది మళ్ళీ.

"ఇందాక చెప్పావుకదమ్మా"

"మళ్లీ చెబుతున్నా. ఒక్కసారన్నా డబ్బులు ఇవ్వకపోతే ఎలా?" అంది.

"అవును ఎలా? మీ తాతయ్యని ఈసారి అడుగు" అన్నాడు.

"అడుగుతా" అంది.

ఆ తర్వాత మరిచిపోయింది. ఈ సంభాషణ గురించి సులోచనకు చెప్పి అన్నాడు-

"మన స్వప్న నాన్నగారు చొక్కా తొడుక్కునే దాకా ఊరుకునేట్టులేదు"

"నాతో ఏమందో తెలుసా?"

"ఏమందేమిటి?"

"తను చొక్కా తొడుక్కుంటే అందులో డబ్బులు పెట్టుకోవాలంట. డబ్బులు పెట్టుకుంటే ఇవ్వాల్సివస్తుందంట. అందుకని ఆయన చొక్కా తొడుక్కోరు అంటోంది

అమ్మో... మొత్తంమీద సీరియస్‌గానే ఆలోచించిందే. 'అయితే ఓమాటనకుండా నన్నుమాత్రం రక్షించింది" అన్నాడు.

సులోచన నవ్వుతూ చూసింది.

"ఆయన చొక్కాలో డబ్బులు దాచుకుంటే నేను దొంగతనం చేస్తానని భయపడి తొడుక్కోవటం లేదనలా. అంతవరకూ నయమేకదా" అంటూ నవ్వాడు.

"ఇప్పుడు కోపం తాతగారిమీదకదా" అంది సులోచన.

ఓసారి 'రావ్' సర్కిల్‌లో ఈ 'చొక్కాల' విషయంలో రసవత్తరమైన చర్చ జరిగింది. అయితే విశేషం ఏమిటంటే 'రావ్' మౌనంగా ఉన్నాడు.

"అసలు నాకు తెలియకడుగుతాను. గాంధీగారిది పెద్ద టాక్టీస్ కాకపోతే ఈ దేశంలో అందరికీ బట్టలుండేదాకా చొక్కా తొడగనటం ఏమిటి?" అంటూ ప్రారంభించాడు.

"దేనికోసమంట ఆయన అలా చేసింది. మన నాయకులకుమల్లే దేశాన్ని పరిపాలించాలనుకోలేదుగా ఆయన" అన్నారొకరు.

"ఏమో... ఎవడు చూడొచ్చాడు. ఆ గాడ్సేగాడు కాల్చిపారేశాడయ్యే. బతికుంటే బట్టలే కట్టుకునేవాడో. లేకపోతే దేశాన్నే పాలించేవాడో మనం చెప్పలేంగా"

"అదేంకాదులే... అసలు కాంగ్రెస్‌ని రద్దుచేయమని అప్పుడే చెప్పాడు"

"ఎన్నన్నా చెప్పనీ. ఆయన్ని రంగంలోకి దింపేశారు. అందులో సమస్యలేదు. అయినా చొక్కా లేకపోవటం ఏమిటండి అనాగరికంగా" అన్నాడతను.

"అనాగరికమా?"

"కాక మరేంటి? ఒకప్పుడు జనానికి చొక్కాలు లేవు. ఆకూ, అలమూ చుట్టుకున్నారనుకో. మరి నాగరికత పెరిగిపోయింది. ఈరోజు బట్టలంటే ఏమిటి? సంస్కృతి... అంతేగా. మరాయన చేసిందేంటి?"

"అలా మాట్లాడతావేంటి? గాంధీగారు పేదవాళ్లని చూసి అలాంటి నిర్ణయానికొచ్చారు. అది అర్థంచేసుకోవాలి" అన్నాడో గాంధీగారి భక్తుడు.

"ఏంటండి... ఈయనట్టా అంటాడు. గాంధీగారికి దేశంలో అందరూ రెండుపూట్లా భోంచేయరని తెలియదా... మరెందుకని ఆయన భోంచేయటం"

"కానీండి... కానీండి జాతిపితమీద విమర్శలు చేసేంత వాళ్లమయ్యాం. నువ్విలా మాట్లాడుతున్నావంటే ఆయన చలవే" అన్నాడు కొంచెం కోపంగా.

"ముసలమ్మా - కోడిసామెత మాకు చెప్పొద్దు"

ఆ చర్చ పక్కకు మళ్లుతుందని గమనించగానే

"ఊరుకోండయ్యా... ఎవరు బట్టలు వేసుకుంటే ఏమిటి? వేసుకోకపోతే మనకేంటి"



అన్నారు.

కొద్దిసేపటి తర్వాత గాంధిగారి భక్తుడు అన్నాడు-

"బట్టలే సంస్కృతి కాదు. మరి బట్టల్లే కుండా రోడ్లమీద పరిగెత్తటంలా. అదేంసంస్కృతి"

అందరూ ఘొల్లున నవ్వారు.

"అది సంస్కృతి కాదనేగా మొత్తు కుంటుంది" అన్నాడు మొదటాయన.

"ఎవరిష్టం వారిది" అన్నారు ముగిద్దామని.

"అది సరేలెండి. బట్టలు కుట్టించుకునే అవకాశం ఉన్నవారు కుట్టించుకోవాలి. లేనివా ళ్ల గురించి ఏంచెబుతాం"

చివరిగా ముగింపు ఉపన్యాసం ఎవరో ఇచ్చారు.

"అయ్యా... ఇలాంటి విషయాల మీద చర్చ లు వద్దు. అందులోనూ కొంతమంది ఓ వైపూ, ఇంకొంతమంది మరో వైపూ ఉండే చర్చలు ఇంకావద్దు. ఇది ఎవడు తేల్చేదీకాదు. బట్టల గురించి మాట్లాడితే ఇంకా అనేక విషయాల గురించి మాట్లాడాలి. ఫ్యాషన్ల గురించి మాట్లా డాలి. అందరూ ఒకే రకంగా కూడా పట్టించుకో రుకదా. అందుకే మనం ఇంకోటాపిక్‌కి వెళ్దాం" అన్నాడు.

అందరి మాటలూ చిరునవ్వుతో వింటుండి పోయాడు రావ్.

వారందరి మాటల్లోనూ ఎంతో కొంత వాస్తవం ఉంది. బట్టలు సంస్కృతికి చిహ్నాలే ఎందుకంటే అవెప్పుడూ ఒకే రూపంలో లేవు మనుషుల అలవాట్లకూ అభిరుచులకూ తగిన రీతిలో క్షణక్షణం మారుతున్నాయి. అంతేకాదు వ్యక్తుల్ని అంచనా వేయటంలో గౌరవించ టంలో కూడా ప్రధాన పాత్ర వహిస్తున్నాయి.

అంతమాత్రాన బట్టలుంటే చాలా...! మ నిషి హృదయం మాటేమిటి? మనిషికి సౌభ్రా తృత్వం మించిన సంస్కృతి ఏముంటుంది? అది మృగ్యం అవుతున్నప్పుడు సంస్కృతి గురించి మాట్లాడుకోవచ్చా? అనిపించింది. వీళ్లందరూ మాట్లాడింది తన తండ్రి గురించి కాదుకదా!

ఆయన వీళ్లెవరికీ తెలియదు. ఎలా మాట్లా డతారు?

ఏదిఏమైనా వీళ్లంటున్నారని కాదుగానీ నాన్న కోసం అద్భుతమైన బట్టలు కొనాలి.

ఆ దుస్తులు ధరింప చేయటానికి ఆయన్ని అంగీకరింప చేయాలి అనుకున్నాడు.

అలా మొదలైన ఆ కోర్కె పని మీద బాంబే వెళ్లినప్పుడు సాధ్యపడింది.

అక్కడో అద్భుతమైన లాల్చీ కనిపించింది. దాని పనితనం ఎంతగానో నచ్చింది.

కనీసం బేరం కూడా అడగకుండా సాంబశి వరావ్ ప్యాక్ చేయించాడు. అప్పుడు గుర్తొ చ్చింది అమ్మ.

ఇంతకాలం నాన్న గురించి తను ఆలోచిస్తు న్నాడు. ఆయనేం చొక్కాలు వేసుకోవటంలేదు కాబట్టి తను దృష్టి అటు ఉంది.

అమ్మ మాత్రం ఏం గొప్ప దుస్తులు ధరించిందని. ఆయన్తో పాటు పెళ్లినాడు కొను క్కున్న పట్టుచీర తప్పించి ఖరీదైనవి ఎక్కడు న్నాయి? అసలు ఎక్కడికైనా వెళ్తేకదా కొనుక్కో వటానికి. ఇన్ని సంవత్సరాలుగా తనకి అలాంటి ఊహరానందుకు సిగ్గుపడ్డాడు.

అయితే ఈ విషయంలో సులోచన జాగ్రత్త గానే ఉంది. అత్తగారికోసం ఆమె అప్పుడప్పు డూ చీరలు తీసుకుంటూనే ఉంది.

సాంబశివరావ్ పెద్ద అంచున్న పట్టుచీర కోసం వెతికి తృప్తి చెందాక తీసుకున్నాడు.

ఇంకా భూపేష్‌కీ, స్వప్నకూ, సులోచనకూ కూడా తీసుకున్నాడు.

సులోచన అన్నింటినీ చూసి బాగున్నా యంటూ మెచ్చుకుంది.

"అంతా బాగుంది. కానీ మీరు తెచ్చుకోలే దే"అంది.

ఆ విషయం అతనికి తట్టలేదు.

"ఏమిటి మాట్లాడరు" అంది.

"తీసుకుందాంలే ఉన్నాయిగా"

"మొత్తం మీద భూషయ్యగారి అబ్బాయని పించారు" అంది నవ్వుతూ.

అతను కూడా నవ్వుతూ- "అవునుకదా. నేను భూషయ్యగారి సాంబయ్యని" అన్నాడు.




''మీరు తెచ్చారు బానే ఉంది. ఆయన చేత తొడిగించే బాధ్యత కూడా మీదే''

''చూద్దాం''

''ఇంతకూ ఎప్పుడు వెళ్దాం'' అంది.

''త్వరలోనే'' అన్నాడు రావ్.

ఈసారి మా తమ్ముడి పుట్టిన రోజు ఇక్కడ జరుపుకుంటున్నాం'' అంటూ అందరికీ చెప్పి వచ్చింది స్వప్న.

మొత్తంగా ఓ వారం రోజులపాటు తనకుటుంబంతో అక్కడే ఉండిపోయాడు సాంబశివరావు. భూపేష్ పుట్టిన రోజునాడు అందరూ కూర్చుని పట్టుబట్టారు. భూషయ్యా మాత్రం వెంటనే అంగీకరించలా. అయినా రాత్రి అమ్మతో చెప్పాడు సాంబశివరావు.

''రేపు నాన్నగారు ఎక్కడికీ వెళ్లటానికిలేదు. రేపంతా ఇంటిలోనే ఉండిపోవాలి'' అని.

''ఇదిగో రేపు మీ మనవడి పుట్టిన రోజు అల్లంతా ఏదో చేస్తారంట. నువ్వు ఎక్కడికీ వెళ్లమాక''

''నేనెక్కడి కెల్తానే''

''ఇంకెక్కడికెల్తావ్. ఆ చేను దగ్గరికే రేపొక్క సారికంట ఇంటి దగ్గరుండి పొమ్మని మీ అబ్బాయి చెప్పాడు'' అంది.

ఉదయాన్నే లేచి మాములుగా పాలికట్టతో తయారు కాబోయి చాలా ఆశ్చర్యపడ్డాడు. తన కూతురు ఆశ్చర్యంగా చూస్తుండగా చావిట్లో సాంబయ్యా పని చేస్తున్నాడు ఆ పేడకళ్లు తీయటానికి. ఆ ప్రాంతం శుభ్రం చేయటానికి సాంబయ్యా కళ్ళల్లో ఎలాంటి విరసనాలేదు. కనీసం ఇబ్బంది పడుతున్నట్లుగా లేదు. స్వప్న పరిగెత్తుకుంటూ వెళ్లి నాయనమ్మని లాక్కొచ్చింది.

''మా డాడీ చూడు ఏం చేస్తున్నారో'' అంటూ.

తులసమ్మ పరుగు పరుగున వచ్చింది. చావిట్లో తన బిడ్డనూ స్తంభించిపోయి చూస్తున్నా పెనిమిటిని చూసి ఆమె కూడా అలానే నిలబడిపోయింది. సంతోషమో, ఉద్వేగమో తెలీదుగానీ ఆమె కళ్ల వెంట నీళ్లు...

స్వప్న తిరిగి పరిగెత్తుకుంటూ వెళ్లి సులోచనతో చెప్పింది.

''నాన్నగారు పనిచేస్తుంటే నాయనమ్మ ఏడుస్తోంది'' అంటూ.

ముందు ఏమిటో అర్థం కాక వచ్చి చూసి విస్తుబోయింది. ఆ తర్వాత ఇలారా అంటూ తీసుకు వెళ్లి చెప్పింది.

''దాన్ని ఏడవటం అనరు''

''మరేమంటారు?''

''చిన్నప్పుడు మీ నాన్నగారు పనిచేయమంటే చేసేవారుకాదు. ఎగ్గొట్టటానికి ఓదో ఒకటి చెప్పేవాళ్లు. లేకపోతే బలవంతంగా చేసేవారు. ఇప్పుడు ఆయన పని చేస్తున్నారు కదా. అందుకని మీ నాయనమ్మా, వాళ్లు సంతోషపడుతున్నారు''

''మరి కళ్లవెంట నీళ్ల వస్తున్నాయికదా''

''ఏడిస్తేనే కాదు. నవ్వినా కన్నీళ్లొస్తాయమ్మా'' అంది సులోచన. తేరుకున్న భూషయ్యాగారు సాంబయ్యా దగ్గరికెళ్ళి-

''అదిటియ్యి'' అన్నాడు.

సాంబశివరావు ఊడుస్తూనే చెప్పాడు-

''మీరు స్నానం చేసి కూర్చోండి. నేను వస్తా. అంతా అయిపోయిందిలే'' అన్నాడు.

భూషయ్యాగారికి ఇంకేమనాలో అర్థంకాక నిలబడితే పిలిచింది తులసమ్మ.

''ఏంటి అడుగుతున్నావ్?''

''ఏం లేదే. ఏంటి ఆడు పనిసేత్తన్నాడు''

''ఆ పని చేయమనేగా పోరేవాడివి. ఇప్పుడు చేస్తుంటే వద్దంటావే'' అంది.

భూషయ్యా తులసమ్మ కళ్లలోకి చూశాడు.

''ఏంటట్టా చూస్తన్నావ్... పద నీళ్లు పెడతన్నా. కొంచెం తలంటుకో కుంకుడు రసం ఉంది''

''ఎందుకే''

''నువ్వేం మాట్లాడకుండా పద'' అంది.

వేడి వేడి నీళ్లు కాయపెట్టాక పీట మీద భూషయ్యాని కూర్చోబెట్టి ఆయన కళ్లు మూసుకుంటే తల మీద కుంకుడు రసం పోసి అంటుతుంటే స్వప్న వింతగా చూస్తూ నిలబడింది.

"దూరంగా నిలబడాలి. కళ్లలో పడిందంటే ఈ రోజంతా గొడవ చేస్తావ్" అని దూరంగా పంపించింది.

ముందు కొంచెం నీళ్లు తలమీద పోసి "ఈ వేడి చాలా" అంది. భూషయ్య తలూపాడు నీళ్ళు పోస్తుంటే...

"కాలతన్నాయే" అంటూ అరిచాడు. మరి కొంచెం చన్నీళ్లు కలిపి తలమీద పోసింది.

"మీ తాత వీపు తోముతావా?" అంది తులసమ్మ మనవరాలితో.

స్వప్న అడ్డంగా తలూపింది. తను అలా నిలబడి చూస్తూనే ఉంది. తులసమ్మ కుంకుడుతొక్కతో వీపంతా రుద్దింది. తర్వాత-నీళ్ళు పోసి "ఇంక రుద్దుకో" అంటూ వచ్చింది. లోపలనుండి ఓ టవల్‌తెచ్చి "మీ తాతయ్యకివ్వమ్మా" అని స్వప్నకిచ్చి వెళ్తుంటే భూషయ్య అరిచాడు.

"కళ్ళలో పోశావుగా" అంటూ కళ్లునులుముకుంటూ.

"కళ్ళు నలపకు. ఉప్పుగల్లు తెస్తానుండు"అంటూ లోపలకి వెళ్ళి "ఏదీ నోరు తెరువ్" అంది.

తాతయ్యకు టవల్ అందించి తుడుచుకుంటుంటే చూస్తూ నిలబడింది. తులసమ్మ మళ్లావచ్చి చెప్పింది-

"కొంచెంసేపు తల ఆరనీ... ముందు కుర్చీలోకూర్చో"

భూషయ్యగారు మాట్లాడకుండా చెప్పిన పని చేశాడు. ఎడమకన్ను కొద్దిగా ఎర్రబడింది. అలా కూర్చుంటే తులసమ్మ బట్టలు తీసుకొచ్చి చూపించింది

"ఇదిగో ఈ చీర 'బాగుందా?"

"బాగానే ఉంది"

"కొంచెం దాని ముఖం చూడు..." అంది చిరుకోపంగా.

"బాగానే ఉందిలే"

"అది నన్నుకట్టుకొమ్మని తెచ్చాడు సాంబయ్య"

"నిన్నా?"

"నన్నే... ఇన్నేళ్ళయింది. ఎప్పుడన్నా ఓ చీర కొనిపెట్టావా?" అంది.

"నువ్వే కొనుక్కుంటావుగా" అన్నాడు.

"అవును మరి. నువ్వు తేకపోతే ఏం చేస్తాను. అది సరే దీని ధర తెలుసా?"

"నాకెట్టా తెలునుద్దే"

"ఎన్నొందలో పోసి తెచ్చాడు"

"వందలా" అన్నాడు.

"మరేంటనుకున్నావ్... కట్టుకోవాలంటే చేతులు రావటంలా" అంది. భూషయ్య ఏమనుకున్నాడోగాని బయటకు చెప్పలా.

"కానియ్... కట్టుకో. కొడుకు తెచ్చాడుగా" అన్నాడు.

"నాకే కాదు. నీకూ తెచ్చాడు. ముందులే..." అంది.

"ఏం తెచ్చాడు?" అన్నాడు ముఖం చిట్లిస్తూ.

అప్పుడు నడిచివచ్చాడు.

"తాతా" అంటూ.

"వాయబ్బో" అంది తులసమ్మ.

పంచె... దానిమీద లాల్చీ... రెడీమేడ్‌వి వేసుకున్నాడు.

"భూషయ్యగారు" అంది తులసమ్మ.

"మావయ్యగారు కూడా బట్టలు వేసుకుంటారు. మీరు కూడా స్నానం చెయ్యండి అత్తయ్యా" అంది సులోచన.

"తాతా... రా" అంటూ వేలుపట్టుకొని గుంజటం మొదలుపెట్టాడు. భూషయ్యకి ఈ రోజంతా కొత్తగా ఉంది.

"అప్పుడే ఎందుకు?" అంది తులసమ్మ.

అప్పుడే కాదు. మీరు స్నానం చేసి ఆ చీరకట్టుకోవాలి. ఇంకా పనుంది" అంది.

ఈసారి సిగ్గుపడటం తులసమ్మ వంతయింది.

"నాయనమ్మా... రా" అంటూ లాక్కుపోయింది స్వప్న.

"ఆగవే... వస్తాను" అని "ముందా బట్టలు కట్టుకొని మనవడితో ఆడుకో" అంది.

ఏమైనా అనాలనుకున్నాడు. గానీ ఎదురుగా కోడలు ఉండిపోయింది.





''బట్టలు ఇక్కడ పెట్టాను. కట్టుకొండి మావయ్యగారూ'' అనేసి వెళ్లిపోయింది.

''కట్టుకో... పిల్లలు బాధపడతారు'' అంది వెళ్తూ.

''తాతా... తాతా'' అంటూ ఏదో చెప్పటానికి ప్రయత్నించేస్తున్నాడు భూపేష్. ఒక్కసారిగా మనవడిమీద ప్రేమ. పొంగుకొచ్చింది. ఎత్తుకొని ముద్దుపెట్టుకున్నాడు, భూపేష్ ముఖం అదోరకంగా పెట్టాడు.

''ఏందిరా'' అన్నాడు.

''భూపేష్ అనుమానంగా చూస్తూ నవ్వాడు. అప్పుడర్థమైంది.

''ఓరినీ... మీసాలు గుచ్చుకున్నయ్యా'' అంటూ నవ్వాడు. తనని కిందకు దింపగానే లోపలకు పరిగెత్తాడు.

''వంటరిగా ఆ గదిలో భూషయ్యగారూ...

తనముందు కొత్త బట్టలు...

అందులోనూ లాల్చీ!

దానిచుట్టూ ఎవరో పువ్వులు కుట్టారు. ఆ లాల్చీని ఏ శ్రమించే చేతులో నేశాయి. ఎందరెందరు పని చేశారో... ఏ ఒక్కరో పని చేశారో గాని అది అద్భుతంగా ఉంది. కొద్దిసేపు అలా చూసిన తర్వాత మెల్లగా లేచాడు.

లాల్చీని చేత్తో స్పృశించాడు. భూషయ్యలో పులకరింత... సాంబయ్య... తన సాంబయ్య తెచ్చాడు. అంతేకాదు. వాడు ఏం చేదివాడో తనకు తెలియదు. ఇన్ని సంవత్సరాలూ ఎలా బతికాడో తెలియదు. ఎంత సంపాయించాడో, ఎన్ని అప్పులున్నాయో తను అడగలేదు. తన ఊర్లో వారు సాంబయ్య గురించి ఏమడిగినా తనది ఎప్పుడూ ఒకటే సమాధానం... అలాంటిది ఇన్ని సంవత్సరాల తర్వాత తన చేతినుండి పాలికట్టే అందుకున్నాడు.

తను చావిడి శుభ్రంచేశాడు. పశువుల తొట్టిలో నీళ్లుపోశాడు. తవుడు కలిపాడు. ఇంతకంటే ఏం కావాలి. వాడు తన బిడ్డ... ఇప్పుడు తను ఈ చొక్కా తొడుక్కోవాలి.

తను చొక్కా ఎందుకు తోడుక్కోడు? ఏమో తనకు తెలియదు. చిన్నతనం నుండి ఇంతేనా? కాదు. తనూ చొక్కాలు తొడుక్కున్నాడు. కొత్త వాటికోసం ఎదురు చూశాడు. తన నాయనతో కుట్టించుకోవటం కోసం పోట్లాడాడు. ఎప్పుడన్నా సాధించుకున్నప్పుడు పొంగిపోయాడు. ఆ బట్టలు స్పృశించీ, దర్శించీ అంతులేని ఆనందం పొందాడు.

మరి తర్వాతెందుకని విరక్తి పుట్టింది?

ఎందుకని తను చొక్కా తొడుక్కుంటే ఊపిరాడుతున్నట్లుగా అనిపించదు. ఎప్పుడూ చలిలోనూ, ఎండలోనూ అలా శరీరాన్ని వదిలేయాలనిపిస్తుంది. నిర్దిష్టంగా తనను చెప్పమంటే చెప్పలేడు. అయితే అందరిలానే తనూ మనిషే. తనకూ కోరికలుంటాయి. ఆశలుంటాయి. అభిరుచులుంటాయి. ఇవన్నీ నెరవేరకపోవచ్చు. వీటన్నింటికీ దూరంగా ఎందుకు జరిగిపోయినట్లు?

అందుకు తనమీద ప్రభావం చూపించిన అంశాలేమిటి? ఉన్నాయి. తప్పకుండా ఉన్నాయి. అయితే వాటిని తను గుర్తించి ఉండవచ్చు. గుర్తించలేకపోయి కూడా ఉండవచ్చు.

బహుశా మనిషిలోని సహజత్వం బట్టలతోనే ప్రారంభం అయి ఉంటుంది. బట్టలతోనే పతనం కూడా ఆరంభమైందా?

అంతే అయుంటుంది. మనిషి తన శారీరకమైన రక్షణకోసం దుస్తులు సృష్టించుకున్నాడు. ఆ తర్వాత వాటి రూపం మారిపోయింది.

మనిషి తనలోని నైజాలను దాచుకోవటానికి బట్టల్ని వినియోగిస్తున్నాడు. మనిషి శరీరానికేనా బట్టలు తోడుగుతూంది. హృదయానికీ, మనసుకూ తొడగటంలేదా? ఒక్కో రకం వ్యక్తి ఒక్కోరకంగా తమ బట్టలు రూపొందించుకున్నారు. కవులు ఒకలా కుట్టిస్తారు, దొరలు ఇంకోలా, ప్రభువులు మరోలా, రాజకీయనాయకులు ఓ తరహాలో, పనిచేసేవారు ఒకలా, భిక్షమెత్తుకునేవారు మరోవిధంగా.

మనిషి అవసరాలకోసం సృష్టించుకున్న ఈ బట్టలు ప్రపంచం లోతుతెలియని మహాసముద్రంగా ఎందుకు మారిపోయింది? మానవులు చేసే సుదీర్ఘ యుద్ధాలలోనూ, యుద్ధాల వెనకా, ముందూ ఈ బట్టలు లేవూ! కుటుంబాలు ఈ బట్టల విషయంలో కుప్పకూలి పోలా?!

ఇదంతా ఏమిటి? మనిషి తను సృష్టించు

కున్నవాటికే ఎందుకు బానిస అయ్యాడు? మరి ఈ కనీస అవసరం ఎందుకని అందరికీ అందుబాటులో లేదు?

భూషయ్యగారు ఇవన్నీ ఆలోచించలేదనేది వాస్తవం. అయితే ఆయన తన చుట్టుపక్కల సమాజాన్ని పరిశీలించలేదనుకోవటం మాత్రం పొరపాటు. ఆయన మహాత్ముడు కాదు, రాజకీయనాయకుడు అంతకంటే కాదు. తన నిరసనలకు, తన అయిష్టాలకూ ప్రచారం కావాలని కోరుకోడు.

అయినా కూడా మనిషికి సహజమైనదిగా మారిన ఓ అలవాటునుండి మారటం వెనకాల అతను ఎంతో గాయపడి ఉండాలి. చిత్రమైన విషయం ఆ సంగతి ఆయనకు అర్థంకాకపోవచ్చుకూడా.

ఏ వ్యక్తులో... సంఘటనలో ఆయనమీద తీవ్రంగా ప్రభావం చూపించి ఉంటాయి. ఫలితంగా ఆయన తనకంటూ ఓ ప్రపంచం సృష్టించుకుని ఉంటాడు. అంతకుమించి తను ఎవరేమనుకున్నా, ఎంత నిరసన వెలిబుచ్చినా, తన వెనక ఎంతగా హేళన చేసినా కూడా పట్టించుకోలేదు.

వాళ్ళందరినీ చూసి జాలిపడి ఉంటాడు. ఈ ప్రపంచంలో జరుగుతున్న వాటిని చూసి భరిస్తున్నవారూ, నిరసన వెలిబుచ్చినివారూ తనని మాత్రమే చూసి ఎందుకంతగా విమర్శిస్తారో అనుకుని ఉంటాడు.

ఆయన తన పనిని తాను సమర్థించుకోలేదు. ఎవరినీ లెక్కచేయలేదు. మౌనం వహించాడు. మౌనం అనేది ఓ గొప్ప పోరాట రూపం అనేది చాలా మంది అంగీకరించకపోవచ్చు. అయినా ఒకరి అభిమానంతో, విమర్శలతో, అంగీకారంతో ఆయనకు అవసరంలేదు.

ఇలా ఉండగలగటం ఒక్క భూషయ్యలాంటి సామాన్య వ్యక్తికి మాత్రమే సాధ్యం అవుతుందేమో.

ఇప్పుడు భూషయ్యగారి ఆలోచనల తీరు మరోరకంగా ఉంది. ఆయన ఒక్కసారిగా తన బాల్యంలోకి జారిపోయి ఉండాలి. తన కలల ప్రపంచంలో విహరిస్తూ ఉండి ఉండాలి.

ఇన్ని సంవత్సరాల తన శ్రమకు తన బిడ్డ అందిస్తున్న కానుక అది. అది చేతుల్లోకి తీసుకుంటే ఓ వెచ్చదనం... తాకితే ఓ మృదుత్వం... ఎవరి బలవంతమూ ఆ క్షణాన అవసరంలేదు.

తులసమ్మ భూషయ్యను చూసి ఆశ్చర్యపోయింది.

"ఏందయ్యో... అచ్చంగా జమీందారులా ఉన్నావుగా" అంది.

ఆమాటకు ఆకళ్ళలో సంతోషం కలగలేదుగానీ, తన లాల్చీకేసి చూసుకున్నాడు.

చక్కగా అమరింది.

ఏ చేతులు దాన్ని సృజించాయోగానీ అది భూషయ్యగారికోసమే ఆ రూపం ధరించిందా అనిపించింది.

"ఉండయ్యా దిష్టి తగిలేట్టుంది" అంటూ ముఖాన బొట్టుపెట్టింది. బుగ్గన చుక్కపెట్టాలనుకుందిగాని భూషయ్యగారు అంగీకరించలేదు.

పట్టుచీరలో తులసమ్మగారు కూడా మిలమిలా మెరిసిపోయింది. ఆ బట్టల్లో ఆవిడను చూసి చుట్టుపక్కలవారంతా ఒక్షణం అసూయపడ్డారన్నా ఆశ్చర్యంలేదు.

అందరూ తయారయ్యాక కొంతమందిని పిలిచారు. ముందుగా చేసుకున్న ఏర్పాట్లప్రకారం పెద్ద కేక్, కొవ్వొత్తులు వెలిగించారు. ఆ పద్ధతులేమీ తెలియకపోయినా మనవడి పక్కన నిలబడి సులోచన ఏం చేయమంటే అది చేశారు.

చుట్టుపక్కలవారందరికీ ప్యాకెట్లలో స్వీట్లు పంపించారు. అక్కడకు వచ్చిన వారిని ఫొటోలు తీశాడు. అందరూ వెళ్లాక సాయంకాలం భూపేష్‌నీ... భూషయ్యగారినీ కలిపి ఓ ఫొటో... అమ్మా నాన్నల్ని ఒకటి... తమ గేదల చావిడిదగ్గర భూషయ్యగారినీ... పిల్లలిద్దరితో భూషయ్యగారినీ ఫొటోలు తీశాడు. అవేకాదు దాదాపు రెండు రీళ్ళు హైదరాబాద్ తీసుకువెళ్ళాడు.

అన్నీ బాగారాలేదు. కొన్ని మాత్రం అద్భుతంగావచ్చాయి.

ముఖ్యంగా తాతా మనవడి ఫొటోమాత్రం అత్యద్భుతంగా వచ్చింది. ఆ ఫొటోని మాత్రం ఎన్‌లార్జ్ చేయించి ప్రత్యేకంగా ఫ్రేం కట్టించు





కున్నాడు సాంబశివరావ్.

ఆ ఊర్లో చాలామంది ఈ విషయంగురించి చెప్పుకున్నారు. ముఖ్యంగా సాంబశివరావు పంపిన ఫొటోలు ఊరంతా చూసినట్లుగా చూశారు. ఒక్కసారిగా భూషయ్యగారిపేరు మారు మోగిపోయింది. 'సాంబయ్య దశ తిరిగింది' అంటూ చెప్పుకోవటం మొదలుపెట్టారు.

భూషయ్యగారిమీద ఏదో చెప్పుకునే చోటులో రేపు ఏదైనా అవసరం వస్తుందేమో అనే ధోరణి పెరిగింది.

భూషయ్యగారిలో మెరుపులా కలిగిందా స్పందన. తర్వాత అంతా మామూలే. అయితే ఆయన తన లాల్చీని కూడా ప్రేమించటం మొదలుపెట్టాడు. వంటరిగా ఉన్నప్పుడు ట్రంకు పెట్టె తీసుకొని ఆ చొక్కాను చేతుల్లోకి తీసుకోవటం గమనించి తులసమ్మే ఆశ్చర్యపోయింది.

మనవడితో బాగా ఆడుకునేవాడు. తండ్రికోసమే అప్పుడప్పుడూ పిల్లల్ని పంపిస్తుండేవాడు. ఆయన ఎప్పుడూ అంతదూరం రాడని తనకు తెలుసు. అందుకే ఆయనకోసం తామే వెళ్లేవారు.

వేసవికాలంలో... అందరూ సంతోషంగా గడుపుతుండగా జరిగిందా సంఘటన. బాగా ఆడుకుంటున్నవాడల్లా భూపేష్ సాయంకాలానికి డీలా పడిపోయాడు. ఎండలమూలంగానా అనుకుంటుండగానే ఎనిమిది గంటలకల్లా శరీరం చల్లబడి పోయింది. కంగారుపడుతూ పక్కఊరికి పరిగెత్తేలోగానే అర్థం అయిపోయింది... 'భూపేష్' ఇంకలేడు!

ఎలా జరిగిందిది? ఏ కారణంతో పోయాడు? అనారోగ్యమా అంటే ఉదయందాకా ఆడుకుంటున్నాడు. ఇంతకుముందు తీవ్రంగా జబ్బుపడిన సందర్భమూలేదు. మరెందుకిలా జరిగింది?

ఇంకా కారణాలు చెప్పగలవారెవరూలేరు. మృత్యువుని మానవుడు ఇంకా అర్థంచేసుకోలేకపోతున్నాడు. అది ఎప్పుడు, ఏ క్షణం విరుచుకు పడుతుందో ఎవరికీ తెలియదు. సులోచన కొంతవరకు తట్టుకొంది.

సాంబశివరావు చిన్నపిల్లాడిలా ఏడుస్తున్నాడు. భూషయ్యగారు నిలువు గుడ్లేసుకొని చూస్తున్నాడు.

"తమ్ముడికేమైందమ్మా" అంటూ ఏడుస్తుంది స్వప్న.

అక్కడ జవాబు చెప్పేవారు లేరు.

తులసమ్మగారు తేరుకొని... "సాంబయ్యా ఊరుకోనాయనా" అంటూ ఓదార్చాల్సి వచ్చింది. అయినా ఆయన్ని ఆపటం ఎవరి తరమూ కాలేదు.

రాత్రంతా కంటినుండి ధారాపాతంగా కన్నీరు కారుతూనే ఉంది. తన గుండెలమీద ఆడుకున్నవాడు, తన నవ్వుల్తో మురిపించినవాడూ, ముద్దు మాటల్తో పలకరించినవాడు, అందమైనవాడు ఇంకలేడు.

ఉదయాన్నే భూషయ్య తులసమ్మని పిలిచాడు-

"ఆడ్ని ఏడవొద్దని చెప్పు. ఏడిస్తే పోయినోడు తిరిగిరాడుకదా" అన్నాడు.

"ఏడవొద్దని ఎలా చెప్పమంటావయ్యా" అంటూ బావురుమంది.

భూషయ్య కొంచెంసేపు నిలబడ్డాక చెప్పాడు.

"ఆడ్ని ఇక్కడే ఉండమను" అన్నాడు.

సాంబయ్య తన గదిలో కూర్చుని రోదిస్తుండగా మనవడితో బయలుదేరాడు.

"అమ్మా... తమ్ముణ్ణి తీసుకువెళ్తున్నారే" అంటూ బావురుమంది స్వప్న.

వెళ్లి అన్ని కార్యక్రమాలు పూర్తిచేసివచ్చాడు.

ఆ సమయంలో సాంబయ్యని చూస్తుంటే అంతులేని జాలి కలిగింది.

ఒకసారి దగ్గరకు తీసుకుని ఓదార్చాలనిపించింది. ఏమీ చెయ్యలేకపోయాడు. అసలు నోటంట మాటరావటంలేదు.

ఆ రోజంతా ఏ విషయమూ పట్టించుకోలా. పగలు ఎలా గడిచిందో, ఎవరికీ తెలియదు. తిరిగి చీకటి ప్రవేశించింది. చావిట్లో గేదలన్నీ దిక్కులేనివాటిలా వున్నాయి. అవన్నీ భూషయ్యగారి కోసం అవురావురుమంటూ ఎదురు చూస్తున్నాయి. ఆరోజు ఎందుకనో వాటి విషయం అసలు గుర్తుకురాలేదు.

ఆరుబయట మంచం వాల్చుకుని ఒక్కడే పడుకున్నాడు. వెన్నెలంతా ఏమైపోయిందో తెలియదు. అంతా చీకటి. ఎవరూ భోజనాలు చెయ్యలేదు. ఓ రాత్రివేళ తులసమ్మ బయ్యటకు వచ్చింది.

ఏనాడూ రోదించని భూషయ్యగారు ఉబికివస్తున్న దుఃఖం ఆపుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాడు. అది తనవల్ల కావటంలేదు. ఇంకా నిగ్రహించుకోవటం తులసమ్మకు సాధ్యం కాలేదు. తను వెళ్లి భర్తమీద చేతులు వేసింది.

తులసమ్మ రెండు చేతుల్లోనూ మొహం దాచుకొని చిన్నపిల్లాడిలా రోదించాడు. హృదయంలోని వేదన అంతా కరిగిపోయేదాకా అలా ఏడుస్తూనే వున్నాడు.

చాలాసేపటి తర్వాత అడిగింది.

"ఎందుకయ్యా ఏడిచావ్?"

నిశ్శబ్దం.

"నువ్వే ఇంతిదయిపోతావుంటే సాంబయ్య ఏడవకుండా ఎట్టా వుంటాడు!"

"అవునే ఆడు ఆడి పిల్లాడికోసం ఏడుత్తున్నాడు... నేను నా మనవడికోసం ఏడుత్తున్నా... అంతకంటే నా కొడుకుకోసం ఏడుత్తున్నా... ఆడి కొడుకు పోయాడని ఆడికి బాధగా వుంటే నా కొడుక్కి ఏమవుద్దోనని నేనేడవకూడదా"

తుసలమ్మ జవాబు చెప్పలేదు.

కొన్ని ప్రశ్నలకు జీవితం మాత్రమే జవాబు చెబుతుంది.



'భూపేష్' నిర్మాణం తర్వాత కొంతకాలం సులోచనమీద పడిన భారం అంతా ఇంతాకాదు. మనిషిగా సాంబశివరావ్ బాగా కృంగిపోయాడు. తిరిగి ఆయన్ని మామూలు మనిషిగా చేయటానికి ఆమె చేసిన ప్రయత్నాలు సామాన్యమైనవి కాదు.

"మీరు ఇలా బాధపడుతూ కూర్చోవటం నాకేం బాగుండలేదు. జరిగిందేదో జరిగిపోయింది. ఇంక అలానే ఆలోచిస్తూ కూర్చోలేంకదా" అంటూ ఆమె ఓదార్చే ప్రయత్నం చేసేది.

ఆమె ప్రయత్నంవల్లనే తిరిగి మామూలు మనిషి కాగలిగాడు సాంబశివరావ్. ఆ తర్వాత ఇంటికోసం ఓ స్థలం కొనటం, స్వయంగా ఇల్లు కట్టడం ఆరంభమైంది. క్రమంగా ఆ ప్రపంచంలో పడిపోయాడు. తను కోరుకున్నరీతిలో నిర్మాణం జరిగింది.

ఆ ఇంటిముందు "భూపేష్" అని ఉంటుంది. ఆ గది గోడలమీద, ముఖ్యంగా తన గదిలో 'భూపేష్'కు చెందిన జ్ఞాపకాలన్నీ వివిధరూపాల్లో వుంటాయి.

గృహప్రవేశానికి రావటానికి కూడా బలవంతం చేయాల్సివచ్చింది. ఇద్దరినీ కారులో తీసుకువచ్చి, వెంటనే కారులోనే పంపించివేశారు. కనీసం నగరాన్ని కూడా చూడలేదు. స్వప్న మాత్రం బాగా గొడవ చేసింది.

"తాతయ్యా... నువ్వు అప్పుడే వెళ్లిపోతున్నావు. ఇక్కడ చూడాల్సినవి చాలా ఉన్నాయి. 'జూ' ఉంది. మ్యూజియం వుంది. చార్మీనార్ ఉంది. ఇంకా చాలా చాలా ఉన్నాయి."

"మళ్లీ వస్తాంలేమ్మా" అన్నాడు.

సులోచన ఇద్దరికీ చెప్పింది.

"ఇంతకాలంపాటు మీరు శ్రమిస్తున్నారు. కొంతకాలంపాటు మీకు విశ్రాంతి కావాలి. అయినా ఉద్యోగాలు చేసేవారూ, ఇతర రంగాల్లోవారు రిటైర్ అవుతున్నారు. మీరు కూడా ఆ ఊరునుండి ఇక్కడకు వచ్చేస్తే బాగుంటుంది"

"ఇంకొంతకాలం వుందిలేమ్మా" అన్నారు.

తిరిగి గంగాధర్ పరిచయంతో జీవితంలో మరో మార్పు వచ్చింది. సాంబశివరావ్ ఈ నడుమ సులోచనను తమ ఊరికి పంపించాడు.

"మీ ఇద్దరినీ తీసుకురమ్మని ఆయన నన్ను





వంపించారు. ఈసారి మీరిద్దరూ రాందే నేను వెళ్లేదిలేదు'' అంటూ కూర్చుంది.

''అది కాదు...'' అంటూ ఏదో చెప్పబోయారు.

''ఇంకేం చెప్పినా వినదలుచుకోలేదు. మీరేం చెబితే అది అంగీకరించాం. గృహప్రవేశానికి కూడా వచ్చి క్షణంలో తిరిగివచ్చారు. మా ఫ్రెండ్స్ అందరూ ఏ కారణంవల్ల రాలేదా అనుకుంటున్నారు. ఇంకా పిల్లలుంటే అది వేరే విషయం. అయినా జీవితాంతం ఇలా ఈ ఊర్లోనే ఎలా వుంటారు? ఎప్పుడైనా బయటి ప్రపంచాన్ని చూడాలికదా'' అంది.

''చూద్దాం... ఇంకా కొంతకాలం...''

''ఏమిటత్తయ్యగారూ కొంతకాలం తర్వాత చూడటానికి ఏమీవుండదు. శరీరంలో ఓపిక ఉన్నప్పుడే ఏమైనా చేయాలి. అసలు మీకు తెలిసినవారంతా తీర్థయాత్రల కెళ్తాం. గుళ్లు చూస్తాం. గోపురాలు చూస్తాం అంటుంటారు. మీరేమో అసలు ఏమీ మాట్లాడరు''

''ఏముంది. మాకు బాగానే గడిచిపోతుంది కదా''

''గడిచిపోతుంది. గడవక ఏమవుతుంది. ఈసారి మాత్రం నేను మీరు లేనిదే వెళ్లదలుచుకోలేదు. మీకు తెలుసుగా. నేను లేకపోతే అక్కడ ఆయనా, న్వప్నా ఎంత ఇబ్బంది పడతారో''

తులసమ్మ భూషయ్యతో మాట్లాడింది.

''అట్టయితే నువ్వెళ్లి పదిరోజులుండిరా'' అన్నాడు.

''బాగానే వుంది సంబరం. మరి నీకు భోజనమో''

''ఓ గిద్దెడు బియ్యం వండుకోలేనంటావా?''

''ఇద్దరినీ రమ్మన్నాడంట''

''రమ్మంటే ఎట్టా కుదురుద్ది. గొడ్డూగోదా, కొంపా ఇడిసిపెట్టి ఇప్పటికిప్పుడు రమ్మంటే ఎట్టా?''

''ఏమో మరి. ఆడు రమ్మని కబురు చేశాడు. అయినా ఓసారి వెళ్లాలి. నువ్వు వెళ్లిరా'' అంది.

''మరి నువ్వో...''

''ముందు నువ్వెళ్లు. ఇద్దరికీ ఓసారే అంటే ఎట్టా కుదురుతుంది? అంతగా అయితే నువ్వొచ్చాక నేను ఎల్తా''

''అది కాదే...'' అంటూ చెప్పబోయాడు.

''నువ్వింకేమాట చెప్పబాకు. అయినా పిల్లాడు పోయిన బాధనుండి ఆడింకా కోలుకోలా. ఇన్నిరోజులూ ఆడు బలవంతం చెయ్యలేదు గదా. ఓసారెల్తే ఆడికి తృప్తిగా ఉంటది''

ఆ మాటకి కాదనలేకపోయాడు. సులోచన మాత్రం తులసమ్మగారిని కూడా రమ్మని గొడవ చేసింది.

''అదికాదులే అమ్మాయి. ఆయన వస్తన్నాడుగా. ముందాయన్ని కదిలించాం. అంతవరకు సంతోషం. నాదేవుంది. నేను వస్తా. నీకు తెలవదు. ఈ గేదలు ఆయనకీ, నాకూ అలవాటయిపోయి ఎవరికీ పాలు ఇవ్వటంలేదు. నాలుగురోజులు లేకపోతే ఇంకా పాలివ్వటం మానేస్తాయి''

''పోనివ్వండి అత్తయ్యగారూ... అయినా ఇంకా ఈ ఆరాటం అంతా ఎందుకు. వాటిని అమ్మేయండి. అంతగా అయితే పాలు కొనుక్కుందురుగాని''

''చేద్దాం. అన్నీ ఒక్కసారంటే కుదరదు గదా. అందులోనూ ఇక్కడా పెళ్ళిళ్లున్నాయి. ఇద్దరమూ లేకపోతే బాధపడతారు''

''మరి ఆయనేమంటారో'' అంది.

''ఆడేమీ అనడు. నేను చెప్పానని చెప్పు'' అంది.

సులోచన ఇంక మాట్లాడలేకపోయింది.

''ఆయన చెప్పమన్న మాట చెబుతున్నాను. సాధ్యమైనంత త్వరలో ఇవన్నీ వదిలించుకుంటే అందరం ఒకటేచోట ఉండొచ్చు''

''చూద్దాంలే'' అంది.

కోడలుతో బయలుదేరుతూ చాలా జాగ్రత్తలు చెప్పాడు.

''రాత్రిపూట మొద్దులాగ పడుకోబాక... అప్పుడప్పుడూ లేసి ఆటి మొకాన కాసింత గడ్డి పడేయించు'' అన్నాడు.

ఇప్పుడు భీముడు లేడు. ఇంకో కుర్రాడ్ని

పెట్టుకున్నారు.

"నేను చేస్తాలే. నువ్వు రాత్రిపూట లేచి ఎక్కడికీ పరిగెత్తబాక" అంది.

"నువ్వేం దిగులుపడబాక. నేను నాలుగ్నురోజుల్లో వచ్చేత్తాను"

"నువ్వుకూడా దిగులు పెట్టుకోమాక. నీ చావిడి ఎక్కడికీ పోదు. నీ చేను ఏమీ అయిపోదు. అక్కడ కూడా చొక్కాలేసుకోకుండా కూర్చోబాక. ఇంటికి ఎవరో ఒకరు వస్తంటారు" అంది.

జీవితంలో మొదటిసారిగా తనను విడిచిపెట్టి వెళ్తున్నాడు. తమ పెళ్లి అయినదగ్గర్నుండి ఇంతవరకూ ఎప్పుడూ దూరంగా లేర్రు.

తులసమ్మ కనబడేంతవరకూ వెనక్కి తిరిగి చూసుకుంటూ వెళ్లాడు.

"ఈ మనిషి ఆ అమ్మాయితో అసలెల్తాడా" అనుకుంది తులసమ్మ కన్నీళ్లు తుడుచుకుంటూ.

★ ★ ★

"డాడీ... మీరు రెడీయా" అంది గంగాధర్‌తో.

"రెడీనే... మీ అమ్మ ఏమంటోంది"

"నేను చెబుతానుకదా. మీరు అంకుల్‌వాళ్లింటికి వెళ్లగానే ఫోన్‌చేస్తారుగా"

"భలేదానివే. నీకు తెలుసుగా. నేను అంకుల్‌తో బయలుదేరాల్సివుంటుంది. వెళ్తే రెండు, మూడు రోజులు రావటం కుదరదు. లేకపోతే ఇంకో పనిచేస్తే"

"ఏమిటి డాడీ" అంది.

"నేను అవుట్ స్కర్ట్స్‌లో ఆగిపోతాను. అక్కడనుండి వెనక్కి తిరిగివస్తాను"

"మీఇష్టం"

"సరిగ్గా ఇలానే జరుగుతుందని చెప్పటానికిలేదు. నేను రెండు మూడు రోజులు ఉండవలసినా మీరేం కంగారుపడవద్దు ఏదియేమైన ఏవియషం నేను ఫోన్‌చేసి చెబుతానుకదా" అన్నాడు.

"అలాగే" అంది.

"మరి నేను వెళ్ళొస్తానేయ్. ఏం భయపడాల్సిన అవసరం లేదు" అన్నాడు తన శ్రీమతితో.

కారు తీసి స్టార్ట్‌చేసి మరోసారి చెప్పాడు.

"ఫోన్‌చేయండి డాడీ"

"అలాగే"

"ఏమిటో మీ నాన్న ఇంకోళ్లు చెప్పింది వినరు" అంటూ నిట్టూర్చింది.

ఆ అమ్మాయి మాట్లాడకుండా వెళ్లి ఫోన్‌దగ్గర కూర్చుంది. అలాంటి సమయంలో తన క్లాస్‌పుస్తకం చదవాలనిపించలేదు. వెంటనే తమ బుక్‌షెల్ఫ్ దగ్గరకి వెళ్లింది.

రకరకాల పుస్తకాలున్నాయి. అందులో ఒకదాన్ని ఎన్నుకునే ప్రయత్నం చేసింది. ఓచోట ఆగిపోయింది. ఆ పుస్తకం బయటకు లాగింది...

"మానవత్వానికి గాయం అవుతున్న రాస్తా" అని ఉంది. ఆ పుస్తకం తిరిగి అక్కడే పెట్టేసింది. వరసగా బుక్స్ పక్కకు జరుగుతున్నాయి. అవేవీ ఆమెను ఆకర్షించటంలేదు. అందులో మ్యూజిక్, పొయిట్రీ, ఫిలాసఫి ఇంకా ఓ రాక్‌లో క్రైమ్ సాహిత్యం ఉంది. ఆ అమ్మాయి చూపు ఆ రాక్‌మీద పడింది. ఓ పుస్తకాన్ని బయటకు లాగింది.

"ఏమిట్రా... ఇప్పుడు ఈ పుస్తకం చదువుతున్నావా?" నాన్న ప్రశ్నించినట్లు అనిపించింది.

ఆ అమ్మాయి కొంచెంసేపు ఆలోచించింది.

అవును. తనకెందుకని ఈ సమయంలో ఇలాంటి పుస్తకం చదవాలనిపించింది. ఏమో? అక్కడెవరో అరుస్తున్నారు. మానవాత్మకు గాయం కానున్నదని... అది వాస్తవంగా కళ్లముందుకొచ్చి నిలబడింది. రక్తం ధారలు ధారలుగా చరిత్రపుటల్ని తడిపేస్తూ ఉంది. అయినాకూడా తనకు అటు చూడాలనిపించటంలేదు. మరుక్షణం ఏంజరుగుతుందో అనే ఉత్కంఠ తనను ఊపెయ్యాలి.

అవును. ఇప్పుడేం జరుగుతుంది? నాన్న కారు ఎంతదూరం వెళ్లిఉంటుంది? ఎంత స్పీడులో వెళ్తుంది. దారిలో ఎవరైనా అడ్డంవచ్చారా? ఏ పోలీసుల తుపాకులైనా అటు తిరిగాయా?





తుపాకి తూటా పేలితే... కారు ముందు అద్దం పగిలి... గుండెదగ్గర ఎర్రటి చుక్క పెద్దదవుతుంటే... స్టీరింగ్‌మీదకు వాలిపో తూ...

నో... అలా జరగదు. జరగకూడదు

పోలీసులు అలా చేయరు. ముందు కారాపి సోదా చేస్తారు. అయినా ఈ పోలీసుల్ని నమ్మిందెవరు? వాళ్లుమాత్రం మనుషులు కాదా? వారికీ కొన్ని నమ్మకాలుంటాయి. మతాలుంటాయి. ఆవేశాలుంటాయి. ఇంకోమతం పోలీసు కారులోని వ్యక్తిని గమనించి తూటా పేలిస్తే ఏమౌతుంది?

ఏంకాదు. కర్ఫ్యూ అంతే.

పుస్తకం పేజీలు తీసింది. అబ్బే... లాభంలేదు. చదవాలనిపించటంలేదు. ఫోన్ రింగవుతుందేమోనని చెవులు రిక్కించింది.

అయినా ఎంత సమయం అయిందని...

సొంతం పదినిమిషాలు కావటంలేదు. అప్పుడే వెళ్లటం ఎలా సాధ్యంఅవుతుంది?

తిరిగి పుస్తకంలోకి తొంగిచూడబోయింది. మరలా లేచినిలబడింది. రాక్ దగ్గరకెళ్లి ఆ పుస్తకం అక్కడ పడేసింది. వెంటనే రాక్ అంతా శోధించింది. ఓ పుస్తకం ఆకర్షించింది. తీసుకువచ్చి కూర్చుంది.

మనం ఎటు పయనిస్తున్నాం...?

ఓ ప్రశ్న... తర్వాత ఓ ప్రవాహంలా సాగుతూంది.

ఈసారి ఆ అమ్మాయి దృష్టి మరల్చలేకపోయింది. ఆ పుస్తకంనుండి ఆమె దృష్టిని మార్చింది. ఫోన్ రింగయిన చప్పుడు.

చటుక్కున తీసింది...

''హలో...'' అంది.

''నేను మీ కవిని మాట్లాడుతున్నా'' అటు నుండి ఎవరిదో గొంతు.

''మీకెవరు కావాలి''

''గంగాధర్ లేరా?''

''ఆయన ఇప్పుడే రావ్ అంకుల్ దగ్గరకు వెళ్లారు''

''ఇప్పుడా? ఎందుకు?''

''మీకు తెలియదా? వాళ్ల ఫాదర్ చనిపోయారు?''

''అయ్యో... ఎప్పుడు?''

''ఉదయం అనుకుంటాను''

''సర్లెండి... నేను అక్కడికి ఫోన్ చేస్తాను'' అంటూ ఫోన్ పెట్టేశాడు.

'ఎవరీ కవి?' అనుకుంటుండగా తిరిగి ఫోన్ మోగింది.

''హలో'' అంది.

''నేను గంగాధర్‌ని''

''అంకుల్ ఇంటిదగ్గర నుండేనా డాడీ''

''అవునమ్మా''

''ఏ గొడవా లేకుండా చేరారా?''

''చేరాను... పోలీసు వ్యాన్ కూడా రాలేదు. రోడ్లన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. అయినా కొంతమంది పిల్లలు బయటికొచ్చి ఆడుకుంటున్నారు. వాళ్ళని చూస్తే నాకు జాలి కలిగింది''

''ఎందుకలా వారిని వదిలేయటం?''

''ఎంతసేపని అట్టిపెడతారు. ముందు వాళ్ళు ఓ చోట కూర్చోగలరా?''

''అది సరే డాడీ ఎవరో 'కవి' అంట ఇంతకు ముందే ఫోన్ చేశారు''

''ఏం చెప్పాడు?''

''మిమ్మల్ని అడిగారు. అక్కడికే వెళ్లారని చెప్పాను. మీకు ఫోన్ వస్తుందేమో''

''సరే... ఇంకేం విశేషాలు లేవుగా''

''ఆ విషయం మీరే చెప్పాలి'' అంది.

''నేను ఇప్పుడే వచ్చాను ఇంకా అంకుల్‌తో ఏ విషయం గురించి మాట్లాడలేదు. మాట్లాడాక నేను మరలా నీకు ఫోన్ చేసి చెబుతాను''

''అలాగే డాడీ''

''మరి ఉంటాను'' అన్నాడు.

అప్పుడు గుర్తొచ్చింది

''డాడీ'' పెద్దగా అరిచింది.

పెట్టి వేయబోతున్నవాడల్లా ఉలిక్కిపడ్డాడు.

''ఏమైందమ్మా''

''ఏంకాలేదు... మీరు వెళ్ళాల్సివస్తే ఓ పని చేయండి డాడీ... కారు ముందు 'ప్రెస్' అనే

చిన్న బోర్డుపెట్టండి అప్పుడు ఏమీకాదు" అంది.

"మంచి ఆలోచన" అంటూ అభినందించాడు.

"థాంక్యూ డాడీ" అంది సంతోషంగా.

"సరే... ఈ విషయం అమ్మకు చెప్పు, నేను ఉంటాను" అని.

"చూడమ్మా... నువ్వు చెప్పిన ఆలోచన సంఘవ్యతిరేక శక్తులకి కూడా రావచ్చు కదా" అన్నాడు.

నిర్ఘాంతపోయిందా అమ్మాయి.

"ఏది ఏమైనా నీ సజెషన్ మంచిదే" అని ఫోన్ పెట్టేసి 'రావ్'కేసి తిరిగాడు.

"మీ అమ్మాయేనా?" అన్నాడు రావ్.

"అవును... కవి ఫోన్ చేశాడంట. ఏ పత్రికా ఫీసులో ఉన్నాడో"

రావు నవ్వాడు.

"మా అమ్మాయి ఓ ఐడియా చెప్పింది మన కారుకి 'ప్రెస్' అని బోర్డు పెట్టుకోవచ్చుకదా అని"

"షార్ప్‌గానే ఉంది"

"అవును... ఇందాక ఓ అల్లరి సినిమా చూస్తోంది వీడియోలో"సాంబశివరావు తలూపాడు.

అప్పుడు ఫోన్ మోగింది.

"కవి చేసుంటాడు" అంటూనే-

"హలో... నేను గంగాధర్‌ని" అన్నాడు.

"నువ్వేనా చెప్పు..." అన్నాడు వెంటనే.

"అవును... ఉదయం వారికి తెలిసింది. ఇంతకూ నువ్వెక్కడినుండి చేస్తున్నావ్... అలాగా... సరే కొంచెంసేపటి తర్వాత బయలుదేరతాం. లైన్లో ఉండు..." అంటూ రావ్‌కి అందించాడు.

"నేను రావ్‌ని... అవును. కొంచెంసేపట్లో మా ఊరికి తీసుకువెళ్ళామనుకుంటున్నా- ఉంటాను" అంటూ ఫోన్ పెట్టేశాడు.

"ఇంతకూ ఆయన మరణానికి కారణం ఏమై ఉంటుంది?"

"మా ఇంట్లో ఇప్పటివరకూ నాకు తెలిసి రెండు మరణాలు. నా 'భూపేష్' ఎందుకలా నిష్క్రమించాడో నాకయితే తెలియదు. కానీ నాన్న మరణం వెనక ఉన్న కారణం మాత్రం కొంతవరకు అంచనా వేసుకోగలుగుతున్నాను"

"ఏమిటంటావ్?" కుతూహలంగా అడిగాడు.

"ఆయన హైదరాబాద్ రావటం"

"చిత్రంగాఉందే"

"చిత్రంగానే ఉండొచ్చు. కానీ ఇదేవాస్తవం. ఇప్పటివరకూ ఆయన మా ఊర్లో ఉన్నాడు. ఆయన ప్రపంచంవేరుగా ఉంటూ వచ్చింది.దానికి భిన్నమైన కొత్త ప్రపంచంలోకి వచ్చాడు. ఈ ప్రపంచం ఇంత ఇరుకుగా ఉండటాన్ని ఆయన భరించలేకపోయి ఉంటాడు"

"నిజమా" అన్నాడు గంగాధర్ ఆశ్చర్యంగా.

★ ★ ★

స్వప్న ఆలోచలనిండా తాతయ్యే నిలిచాడు. చిన్నతనంలో ఆయనంటే కొద్దిగా కోపం ఉన్న మాట నిజమే. అయితే అది ప్రేమతో కూడిన కోపం. ఈసారి ఇక్కడకు వచ్చాక తాతయ్యే తన నేస్తం అయ్యాడు. ఆయనకి తనే ఏకైక కాలక్షేపం. తాతయ్యని అడిగి తను ఎన్ని అనుమానాలు తీర్చుకుందో తనను అడిగి ఆయన అన్ని అనుమానాలు తీర్చుకున్నాడు.

"తాతయ్యా... నువ్వెప్పుడూ మానాన్నకి కొనుక్కోవటానికి డబ్బులు ఇవ్వలేదంట గదా" అంది.

"ఎవరు చెప్పారమ్మా"

"మా నాన్నగారే చెప్పారు. ఆయనకెప్పుడూ మీరు డబ్బులిస్తే బాగుండేదని ఉండేదంట. మీరేమో ఇవ్వరు. పోనీ తాతయ్యా నాన్నని పిలిచి ఇప్పుడైనా డబ్బులియ్యకూడదూ" అంది.

భూషయ్యగారికి నవ్వు వచ్చింది.

"నీకు చెప్పేదా... నిజంగా చెప్పేదా" అంటూ అడిగాడు.

రోజూ ఉదయం స్వప్న పేపర్ చదవటానికి ఆరాటపడటం, అలాగే ఇంటికి వచ్చేరకరకాల





పత్రికలు చదవటం గమనించి అడిగాడా యన...

''ఏంటమ్మా... అందులో ఏం ఉంటుంది?''

''అన్ని విషయాలూ ఉంటాయి. ప్రపంచంలో ఏమేం జరుగుతుంతో ఈ పేపర్లో రాస్తారు. ఇంకా ఆటల గురించి పాటల గురించి రాస్తారు. ఇంక మీ పొలాల గురించి కూడా రాస్తారు. నువ్వు పేపర్ చదవలేదా తాతయ్యా''

''లేదమ్మా''

''పోనీ రేడియో అయినా వినేవాడివా''

''ఎప్పుడన్నా యిన్నాను'' అన్నాడు.

''అయ్యో మీకు కాలక్షేపం ఎట్లా తాతయ్యా''

''పనుంటుందిగా'' అన్నాడు. స్వప్న తాతయ్యకేసి చిత్రంగా చూసింది.

''మనం జూ చూద్దాం'' అంటూ ఓరోజు తీసుకువెళ్ళింది.

మొత్తం జూ అంతా తిరిగారు. రైలు కూడా ఎక్కారు. తిరిగి వస్తున్నప్పుడు అడిగాడు.

''ఎందుకమ్మా ఆటన్నిటిని ఇక్కడ పెట్టారు''

''మనందరం చూస్తాంకదా అందుకు''

''అందుకా... పాపం అయన్నీ ఎట్టా ఎండిపోతన్నయో చూడు''

''వాటికి బాగా ఆహారం పెడతారు తాతయ్యా. ఇంకానేమో అచ్చంగా అడవిలానే చేస్తారు''

''అయినాకూడా అది అడివికాదుగా... ఆటికి అడివిలోనేవుంటే బాగుంటది''

''బాగనే ఉంటుందిగానీ... మరి ఇప్పుడేమో అడవులన్నీ నరికేస్తున్నారు. రెండోదేమో అక్కడ వీటిని బతకనీయటంలా. వేటాడేస్తున్నారు. అందుకే ఇక్కడ ఇలాంటివి పెట్టారు''

''అడవుల్లో కూడా బతకనియ్యటంలేదా?''

''లేదు... అందుకే కొన్నిరకాల జంతువులు సొంతం మాయం అయిపోతున్నాయని వాటిని వేటాడటం నిషేధించారు. మరికొన్నిటినేమో పట్టి తెచ్చి ఇక్కడ పెట్టారు''

''అట్టాగా'' అన్నాడు ఆలోచిస్తూ.

ఓరోజు అడిగింది-

''తాతయ్యా... నీకు బట్టలు లేవా?''

''ఎందుకమ్మా''

''మరెప్పుడూ ఈ ఒక్క లాల్చీనే వేసుకుంటావే. నాన్నగారినడిగి ఇంకా తెప్పించుకోవచ్చుగా''

''ఎందుకమ్మా... నాకు ఇదొక్కటి చాలు''

''అయినా ఒక్క చొక్కా ఎట్లా సరిపోతుంది...? అవునుకదా... నువ్వు ఇంటిదగ్గర చొక్కాలు వేసుకోవుగా''

భూషయ్యగారు నవ్వాడు.

''నీకే చొక్కా అంటే బాగా ఇష్టంకదూ''

తలూపాడు.

''నీకే చొక్కా చాలా బాగుంటుంది తాతయ్యా... ఆ ఫొటోలో తమ్ముడూ, నువ్వూ ఎంత బాగున్నారో'' అంది.

భూషయ్యగారు గోడకు తగిలించిన తమ ఇద్దరి ఫొటో చూశాడు. చాలాసేపు తన మనవడికేసి చూసుకున్నాడు.

''ఈపాటికి ఇంత ఎత్తయ్యేవాడుకదూ'' అనడిగాడు.

''అయ్యేవాడే''

''బతకని బిడ్డ బారెడని... భలే పిల్లాడు'' అన్నాడు గుర్తు చేసుకుంటూ.

''తాతయ్యా... మనం చార్మినార్ చూట్టానికి వెళ్దాం''

ఇద్దరూ వెళ్లాక చెప్పింది.

''ఇదివరకు చార్మినార్ ఎక్కటానికి అందరికీ పర్మిషన్ ఇచ్చేవారు. ఆమధ్య ఏమైందో తెలుసా? చార్మినార్ మీదనుండి దూకి నలుగురు చచ్చిపోయారు?''

''ఎందుకు?''

''ఉద్యోగం లేదని కొందరు. పెళ్లిళ్లు కాలేదని మరికొందరు. ఆకలికి భరించలేక మరికొందరు. తాతయ్యా... చార్మినార్ ఎక్కితే మొత్తం హైదరాబాదు అంతా కనిపిస్తుంది. ఇది కొన్ని వందల సంవత్సరాలక్రితం కట్టించారు. అయినా ఇప్పటికీ ఎలా ఉందో చూడు. అప్పు

డు ఎందుకు కట్టించారోగానీ ఇప్పుడు మాత్రం చచ్చిపోవటానికి ఉపయోగపడుతుంది. అందుకని మూసేశారు"

భూషయ్యగారి కళ్లు కుంచించుకుపోయాయి.

వారలా చూస్తుండగానే ఎవరో అరుస్తూ పరిగెత్తటం కనిపించింది.

"పద తాతయ్యా వెళ్లిపోదాం" అంది ఆందోళనగా.

"ఏంజరిగిందమ్మా" అన్నాడు.

స్వప్న ఆటోను పిలిచి అడిగితే రానన్నాడు.

ఇంకో ఆటోని పిలిచి ఎక్కువ డబ్బులు ఇస్తాననిచెప్పి... 'రా తాతయ్యా' అంది. ఆయన వచ్చి కూర్చున్నాడు.

"ఈ ప్రాంతంలో ఎప్పుడూ గొడవలు జరుగుతుంటాయి. అంతా బాగానే ఉంటుంది. ఎప్పుడు ఏ గొడవ జరుగుతుందో అర్థంకాదు. అప్పటికప్పుడు ఎవరో ఒకరు వచ్చి పొడిచేసి పారిపోతుంటారు"

"ఎందుకమ్మా"

"ఎందుకో కూడా తెలవదు. ఎక్కువగా హిందువులూ, ముస్లిములూ గొడవలు పడుతుంటారు"



''ఆళ్లెవరు?''

''ముస్లిమ్స్ అంటే మీరు సాయిబ్బులంటారే వారు''

''ఎందుకంట చంపుకోవటం''

ఆ ప్రశ్నకు జవాబు స్వప్నకి కూడా పూర్తిగా తెలియదు.

''ఎందుకో నాకూ తెలియదు తాతయ్యా... పండగలు జరుగుతుంటాయి. వినాయక చవితి పండగనాడో, ఇంక వాళ్ల పండగ రోజో గొడవలు జరుగుతుంటాయి. కొంతమంది చచ్చిపోతుంటారు. అప్పుడు కర్ఫ్యూ పెడతారు. అంటే ఏమిటో తెలుసా. రోడ్లమీద ఒక్క మనిషి కూడా కనిపించకూడదు. కనిపిస్తే కాల్చేస్తారు. అందరూ ఎవరింట్లో వారుంటారు''

''ఎట్టామరి''

''ఎట్లాఏముంది? అలా ఉండాలంతే. చాలా మంది ఇబ్బంది పడతారు. ఎప్పుడన్నా ఓ గంటమాత్రం వస్తువులు కొనుక్కోవటానికి అనుమతిస్తారు. అప్పుడేమో ధరలన్నీ పెంచేస్తారు. అప్పుడుకూడా గొడవలు జరుగుతుంటాయి. అట్లా కొన్నిరోజులపాటు జరిగాక మెల్లగా కర్ఫ్యూ తీసివేస్తారు''

భూషయ్యగారు ఆటోలో కూర్చుని చూస్తుంటే ఈ ప్రపంచమంతా పోటెత్తిన సముద్రంలా కనిపించింది.

ఇంటిదగ్గర పత్రికల్లో వార్తలపట్ల ఆయనకు అమితమైన ఆసక్తి కలిగింది.

''చదివి చెప్పమ్మా'' అనటంతో స్వప్నకు ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది. ఆ సమయంలో ఆ అమ్మాయికి తన తాతకు ఈ ప్రపంచంలో తనకు తెలిసిన విషయాలన్నీ చెప్పాలనిపించింది.

''తాతయ్యా... ఇక్కడ ఎవరిగురించీ ఎవరు పట్టించుకోరు. ఎవరి గొడవ వారిదే. కొంత మందయితే ఇంటిపక్కనే ఉంటారు. కొన్ని నెలలపాటు మొఖాలు కూడా చూసుకోరు. ఎవరింట్లో ఏం జరుగుతుందో కూడా తెలియదు. ఇదిగో ఈ ఫొటో చూడు. ఈ అమ్మాయిని కట్నం తేలేదని కాల్చి చంపారు. ఇంకానేమో ఇక్కడ ఉద్యోగాలు రాలేదని కొంతమంది. ఉద్యోగాలు కొంతమందికే ఇస్తున్నారని రకరకాల గొడవలు జరుగుతుంటాయి''

''అట్టాగా'' అన్నాడు.

''అవును తాతయ్యా... కొన్నిచోట్లకు వెళ్తే అక్కడంతా ఫ్యాక్టరీలు ఉంటాయి. సాయంకాలం అయితేచాలు ఒకటే వాసన. కొన్నిచోట్లయితే మనం కొంచెసేపు కూడా భరించలేం. అక్కడ నీళ్లన్నీ కూడా చెడిపోయుంటాయి ఆ ఫాక్టరీవాళ్లు వాళ్ల చెత్తఅంతా వదిలేస్తుంటారు. వాటిమూలంగా చాలామంధికి రోగాలు వస్తుంటాయి. ఇక్కడ బాగానే ఉంటుందిగానీ, మంచి గాలి ఉండదు. మంచి మనుషులు కూడా దొరకటం అదృష్టమే. ఎప్పుడే ఎవరో ఒకరు ఎక్కడోచోట తగాదా పడుతుంటారు. కొట్టుకుంటారు. చంపుకుంటారు. ఇవన్నీ చూస్తుంటే ఒక్కోసారి ఇక్కడ ఉండాలనిపించదు తాతయ్యా'' అంది దిగులుగా.

వాళ్లిద్దరూ వస్తుంటే ఓ శవాన్ని ఊరేగిస్తూ తీసుకువెళ్తున్నారు. కొంతమంది గుంపు ముందుండి టపాకాయలు పేలుస్తున్నారు.

''ఏంటమ్మా అది'' అన్నాడు.

''ఆయనెవరో చచ్చిపోయారు తాతయ్యా''

''మరెందుకని టపాసులు కాలవటం''

''ఇక్కడ అట్లానే కాలుస్తారు''

''ఎక్కడకి తీసుకెళ్తారు?''

''ఈ ఊర్లో అక్కడక్కడా స్మశానాలున్నాయి. ఏమతంవారికి ఆమతం అన్నమాట''

''బాపనోళ్లు దొరుకుతారా?''

''ఎందుకు?'' అంది.

''ఎందుకేమిటి... సచ్చిపోయాక ఆళ్ళు మంత్రాలు సదవాలిగా''

''దొరుకుతారుగాని... వాళ్లకోసం వెతుక్కోవాలి తాతయ్యా. కొంతమంది ఏంచేస్తారంటే కరెంట్ మెషిన్లు వచ్చాయిగా అందులో ఉంచుతారు. స్విచ్ నొక్కితే చాలు కొంచెం సేపటిలో బూడిద అయిపోతారు''

''ఎట్టా?'' అంటూ ఆశ్చర్యపోయాడు.

''అవును తాతయ్యా, ఈ ఊర్లో చాలా తమా





షాలు ఉన్నాయి. అది సరే తాతయ్యా మీ ఊరిలో ఎవరూ తన్నుకోరా?''

"ఎప్పుడన్నా కొట్టుకుంటారు. అప్పుడు పెద్ద మనుమలు సర్దిచెపితే వూరుకొంటారు''

"ఏమో తాతయ్యా... నాకు మన ఊరే బాగుంటుంది. అక్కడయితే మంచి గాలి ఉంది. చెట్లున్నాయి మనుమలంతా చక్కగా ఉన్నారు. నాకు అక్కడికే రావాలని పిస్తుంటుంది''



భూమయ్యగారు భాగ్యనగరం వచ్చాక, వివిధ సంఘటనల గురించి విన్నాక, తెలుసుకున్నాక ఆయనలో విచిత్రమైన ప్రకంపనాలు మొదలయ్యాయి. తిరిగి ఆయన అంతరంగం ఒక్కసారిగా పురులువిప్పుకొంది.

మనిషికి తెలియని, ఊహించని వేదాంతం, ఆలోచనా తరంగాలు, ఇంకా భాషా కూడా మనిషి మెదడులో నిక్షిప్తం అయి ఉంటాయి. ఒక్కోసారి అవి వెల్లువలా విరుచుకుపడే అవకాశం అభిస్తుంటుంది. చాలా మంది విషయంలో అలాంటిదేం ఉండదు. అలాంటి అవకాశాలు రావు. అందుకే జననం, పెరగటం, మరణం అన్నీ జరిగిపోతుంటాయి.

ఇంతవరకూ ఏ ఆలోచనలూ పట్టని భూమయ్యగారిలో మధన ప్రారంభం అయింది.

ఇంతకూ జీవితం అంటే ఏమిటి? మనిషి ఎందుకోసం ఆరాటపడుతున్నాడు. ఎటు పయనిస్తున్నాడు? ఇదంతా జీవితమేనా? జీవించటం కోసమేనా ఈ పనులన్నీ చేయటం? ఇలా చేయవచ్చా?

ఓ మనిషిని మరో మనిషి చంపవచ్చా? చంపటానికి ఎవరు అధికారం ఇచ్చారు. అసలు మతం ఏమిటి? కులం ఏమిటి? దరిద్రం ఏమిటి? ఈ అభివృద్ధి ఏమిటి? మనిషి ఒక్కసారి వెనక్కి తిరిగి ఎందుకు చూసుకోవటంలేదు. బతకటం కోసం హత్యలు చేస్తున్నారు. లూటీలు చేస్తున్నారు. దాడులు చేస్తున్నారు. ఒకరిమీద ఒకరు దుమ్ము చల్లుకుంటున్నారు. ఇంకోపక్కన బతకలేక మరికొందరు బలవంతంగా తరలిపోతున్నారు.

ఇన్ని సంవత్సరాలుగా మనిషి సాధించింది ఇదా? ఇంత ఇరుకుగా బతకటం కోసమా? తమకు ఇవన్నీ తెలియవు. తాము బతికేచోట అసలు గొడవలు లేవని కాదు. అసూయ లేదని కాదు. కానీ ఇంతలా అక్కడ మార్పులు రాలేదు. మరి ఈ నగరాల్లోకి ఎందుకొచ్చాయి? ఇక్కడదాకా వచ్చినవి ఆగుతాయా? దేశమంతటా పాక్కుంటూరావూ!

మనిషి మనిషితో మాట్లాడకపోవటం ఏమిటి? జంతువుల్ని వేటాడటం ఏమిటి? వాటికోసం మరల- రక్షణ ఏమిటి? ఈ మతాలేమిటి? ఎప్పుడొచ్చాయి. ఇవన్నీ తనకు తెలియకుండానే ఇన్ని దశాబ్దాలు గడిచిపోయాయా?

తలుచుకుంటే చాలా ఆశ్చర్యంగా ఉంది.

ఇదేమంత సంతోషం కలిగించే మార్పుకాదు. ఇది మనుమల మంచికి రాలేదు. ఇది ప్రకృతి మంచికోసం రాలేదు. మనిషీ, జంతువూ ఒకటి కాదు. అయినా సరే ఇన్ని సంవత్సరాలుగా మనుమలూ... జంతువులూ ఒకరికొకరు ఆధారం అయ్యారు, ప్రేమించుకున్నారు.

మరిప్పుడీ పరిణామం ఏమిటి?

మనుమలకూ మనుమలకూ నడుమ అగాధాలు ఏర్పడ్డాయి. అవి ఇంకా ఇంకా పెరిగిపోతాయేమో... మనుమలంతా పరస్పరం నరుక్కుని చచ్చిపోగలరేమో... ఈ ప్రపంచానికి పెనుప్రళయం దాపురిస్తుందేమో... అప్పుడింక ఏంమిగులుతుంది? ఇంతకాలం తను మంచి మాత్రమే శాశ్వతంగా మిగిలిపోతుందనుకుంటున్నాడు. అదంతా భ్రమేనా?

మనుమలు ఎందుకింత స్వార్థంలో కూరుకుపోయారు? ఇప్పుడున్న మనిషి మనిషా?

కాదు. మానవుని చోటులో ఇంకా ఏదో శక్తి వచ్చి కూర్చుంది. అది మానవుణ్ని తన ఇష్టం వచ్చిన విధంగా ఆడిస్తూంది. మనిషి అర్థంచేసుకో టంలేదు. తను విన్నవీ... తను చూసినవీ ఆ విషయాన్నే చెబుతున్నాయి.

ఈ మనిషి స్వేచ్ఛగా నవ్వలేకపోతున్నాడు. కనీసం ఏడవలేకపోతున్నాడు. హృదయం విప్పి మాట్లాడలేకపోతున్నాడు. ఈ భవనాలు ఎంత ఎత్తులకు లేస్తేనేం గాక... ఈ సంస్కృతి ఎంత విస్తరిస్తేనేంగాక మనిషి ఎక్కడున్నాడు? అతని స్థానం ఎక్కడుంది? మరుగుజ్జు అయి పోతున్నాడు. ఇదిలానే కొనసాగితే మాత్రం ఆ రూపం కూడా ఉండదు.

మనిషి రేపటి రూపానికి తగ్గట్టుగానే సంగీతం ఉంది. వారి నాటకాలున్నాయి. వారి ఆనందం ఉంది. వారి దుస్తులున్నాయి. కొన్ని రోజులాగితే ఇంక ముసుగులు అవసరం లేనే లేదేమో! ఇంత బాధ్యతా రహితమైన సమా జంలో తాము బతుకుతున్నారా?

రాత్రంతా భూషయ్యగారు తన లాల్చీని గుండెలకు హత్తుకుని పడుకుంటారు. ఏనా డూ పీడకలలురాని ఆయనకు దారుణమైన అనుభవాలు. ఎవరెవరో పరిగెత్తినట్లు... ఆకా శంనుండి కనులు మిరుమిట్లు గొలిపే వెలు గుతో పెద్దశబ్దంతో నిరంతరాయంగా రాలుతు న్నాయేమిటో... ఒక్కసారిగా పెద్ద విస్ఫోట నం...ధ్వంసం... ఓ స్త్రీ తల విరబోసుకొని ఏడుస్తుంటుంది...మనుషులూ... జంతువులూ అన్నీ ఉన్మాదంతో పరిగెడుతుంటాయి... అవ న్నీ అలా నిరంతరాయంగా సముద్రంలో కలు స్తుంటాయి. గుంపులుగుంపులుగా కుక్కలు ఏడుస్తుంటాయి. ఎవరెవరో బీభత్సంగా పాడు తుంటారు.

ఉలిక్కిపడి లేస్తాడు.

నిద్ర పట్టదు.

తామంతా పండించే పంటంతా ఏమైపో తుంది? ఇంతకాలం అవి మనుషులు అనుభ విస్తారనే తృప్తి ఉండేది. తాము పండిస్తున్న ప్రతి బియ్యపు గింజా మనుషులకే అని తెలు సుకున్నప్పుడు గర్వం కలుగుతుండేది. మని షిగా ఈ భూమి మీదకు వచ్చినందుకు తన వంతు బాధ్యతను నెరవేర్చిన తృప్తిమిగిలేది. ఇప్పుడలా కాదు. తమ శ్రమంతా వృధా అయి పోతూంది.

ఎటు చూసినా ఆకలి ఉంది. తాము సృ ష్టించిందంతా ఏమైపోతుందో అర్థంకావటంలే దు.

ఈ ప్రపంచం రూపు మారిపోయింది. ఇంకా మారిపోతుంది. అప్పుడు తన రూపం కూడా మారిపోతుందేమో... తులసమ్మ కూడా తనని గుర్తుపట్టలేదేమో...

భూషయ్యగారు అనుకున్నాడు.

ఇంక నేను ఇక్కడ ఉండకూడదు, వెళ్ళి పోవాలి, ఇక్కడే తను చచ్చిపోతే ఎట్లా?

ఇన్ని సంవత్సరాలుగా తనను ప్రేమించిన ఊరుకి, తను ప్రేమించిన ఊరుకి దూరంగా మరణించటమా?

ఇన్ని సంవత్సరాలు తనతో కలసిమెలసి బతికిన తులసమ్మకు చెప్పకుండానే, కడసారి చూసుకోకుండా చచ్చిపోవటమా? లేదు... లేదు... తను వెంటనే వెళ్ళిపోవాలి.

రేపు తను ఇక్కడ ఉండగానే ఏమైనా జరగవచ్చు. తన మనవరాలు చెప్పినట్లు రోడ్ల మీద జనం లేకుండా, పోలీసులే తిరిగితే ఎట్లా? తను చచ్చిపోతే మంత్రాలుండవేమో... కరెంటు మెషిన్ దగ్గరకు తీసుకువెళ్ళితే వాళ్ళు తన బూడిద ఇస్తారేమో...

బూడిద... నిజంగానే బూడిద తప్పితే ఒక ప్పటికి ఏమీ మిగలదు. వీళ్ళందరూ అసలు ఇంత ఆనందంగా ఎలా బతకగలుగుతున్నా రు.

చార్మినార్ని చూస్తే ఎవరైనా ఆనందించ గలరా? అక్కడనుండి దూకి చచ్చిపోయినవా రు గుర్తుకురారూ? ఆ జంతువులను చూస్తే ఏమనిపిస్తుంది. మనిషినీ అలా ఉంచితే బత కగలడా?

అందుకే తను వెళ్లిపోవాలి. వెంటనే వెళ్లిపో వాలి.

ఆయనకు అలాంటి ఆలోచన ప్రా రంభంఅయి క్రమంగా పెరగసాగింది. అది పైకి కనిపించకపోయినా ఆయన్ని నిలువెల్లా




# ఏరిన ముత్యాలు

★ తన యాత్ర చివరి మజిలీ తెలియని నావికునికి అనుకూలంగా గాలి ఎప్పుడూ వీచదు.

--లోకోక్తి

★ అద్భుత ప్రావీణ్యం, అస్పష్ట, అసమగ్ర ఆశయాలకంటే కనీస ప్రావీణ్యం, మహదాశయాలు కలిగి ఉండటం మంచిది.

-- పెరల్‌బక్

★ సున్నితమైన ప్రకృతిగలవానికి, పువ్వుకు పరిమళం అబ్బినంత సహజంగా నమ్రత అలవడుతుంది.

--డి. సినాడ్

★ అతి నమ్రత వక్రత్వాన్ని సూచిస్తుంది.

--ఆంగ్ల సామెత

★ నమ్రత అంటే సరియైన అర్థం అహంభావ శూన్యత, అహంభావ రాహిత్యమే మోక్షసిద్ధి. నమ్రత లేకుండా చేసే సేవ స్వార్థ భూయిష్టమూ, అహంభావపూరితమూ అవుతుంది.

--గాంధీజీ

★ సౌందర్యం నరకంలో కూడా ఉంది. కాని అక్కడ ఉండేవారు దానిని గుర్తించలేరు. అదే వారికి పెద్దశిక్ష.

-- ఠాగూర్

★ నరకంలో అన్నిటికన్నా గొప్ప యాతన అక్కడ చావులేకపోవడం.

-- జాన్‌వెబ్‌స్టర్

★ ఒక్కసారి కూడా నవ్వనిరోజు అన్నిరోజులకంటే నష్టపోయినరోజు.

-- షాంఫర్ట్

★ ఎప్పుడూ నవ్వుతూ ఉండేవారిని చూసి మోసపోకు. వారికంటే దురదృష్టవంతులు, దుఃఖించేవారు ఇంకెవరూ ఉండరు.

-- సెనెకా

★ ఎప్పుడూ సుఖంగా ఉన్నట్లు విరగబడి నవ్వుతూ కనిపించే మనిషి గుండెల్లో ఎలాంటి అగ్నిపర్వతాలు రగులుతున్నాయో నీకెలా తెలుస్తుంది.

-- గోల్డ్‌స్మిత్

★ నిజమైన నాగరికత కోరికలను అదుపులోపెట్టుకోవడంలోనే ఉందికానీ పెచ్చించుటలో లేదు.

-- గాంధీజీ

★ తన పదవిని నిలబెట్టుకోవడానికి రాజకీయనాయకుడు ఎలాగైనా మారగలడు. చివరకు దేశభక్తుడు కూడా కాగలడు.

--విలియం రూడాల్ఫ్ హెర్స్

**సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ**

కుదిపి వేసింది. అందుకే తీవ్రమైన వత్తిడి తెచ్చాడు.

"ఏంటయ్యగోరూ... ఎల్లిపోతానంటారూ" అని పనిమనుషులు అడిగారు.

వారికి కూడా ఎంతో సరదాగా ఉంది. ఆయన వాళ్ళందరినీ పిలిచి అగుడుతుండే వాడు. వారి పనుల వివరం గురించి, వారెలా జీవిస్తుంది అన్ని వివరాలు.

"ఎవరి కొంపలో వారుంటే భయంవుండదు. ఇది మావూరుకాదు"

"మీ అబ్బాయి గారుంటన్నారుగా"

"వుంటే అడి వూరవుద్ది. నా ఊరెట్టా అవుద్ది" అన్నాడాయన.

సులోచనకూడా ఆయన్ని ఇంక ఆపగలటం తనతరం కాదనుకుంది.

"మీరు కారు కోసం చూస్తే ఆయన మనకు చెప్పకుండా వెళ్ళిపోయినా ఆశ్చర్యంలేదు" అంది.

"మరేం చేద్దాం?"

"రేపు పంపించేద్దాం"

"సరే... కానీ రేపు బస్‌లో పంపించేద్దాం"

ఆయన భోజనం చేస్తున్నప్పుడు చెప్పింది.

"రేపు ఉదయం మీరు బయలుదేరుదురు గాని"

భోజనం చేసి బయటకు వచ్చాడు. తనకు ఇంక ఎవరితోనూ మాట్లాడాలనిపించలేదు. తన మంచం దగ్గరకు వెళ్ళాడు.

ఆరోజు పనిమనిషికి చాలా బాధగా అనిపించింది.

గోడకు తగిలించిన లాల్చీని తీసి ఉతుకుమని చెప్పింది సులోచన... ఏదో ఆలోచిస్తూ విసురుగా లాగాడు...

చిరిగిపోయిన శబ్దం...

అప్పుడు ఈ లోకంలో పడ్డాడు...

"అయ్యయ్యో ఎంతపని జరిగిపోయింది. అయ్యగారిప్పుడే వంటారో... ఈ విషయం చెబితే... చెప్పటం ఎందుకు... ఉతికేసి ఆరేస్తే సరి... తర్వాత తెలిసినా ఏమవుతుంది. పోనీ చెబితేనే... తననే తీసుకో అంటారేమో రెండు తిట్టినా"

అయితే ఓ నిర్ణయానికి రాలేకపోయాడు. తను వచ్చిందగ్గర్నుండి ముసలాయన ఆ చొక్కాకు ఎంతగా అంటిపెట్టుకు ఉన్నాడో గమనిస్తూనే ఉన్నాడు. అలాంటిది ఆ చొక్కా కోసం తను కావాలని అలా చేశారనుకుంటారేమో అనుకున్నాడు.

అందుకే మామూలుగా గుంజి మేడ పైభాగంలో ఆరేసి వచ్చాడు.

ఆ తర్వాత పనిలోబడి ఆ విషయమే మరిచిపోయాడు.

సులోచన ఆయన వెళ్ళారని తెలియగానే పిండి వంటలు తయారు చేయటం ఆరంభించింది.

'పుల్లారెడ్డి' స్వీట్సులాంటివి నాలుగు రకాలు తెప్పించి పంపించవచ్చు. వాటిని చూడగానే ముందు ఎంత ఖరీదో అనే ఆలోచన వస్తుంది.

ఏదిఏమైనా వండి పంపించినప్పుడు వాళ్ళు పొందే ఆనందం కొని పంపించినప్పుడు పొందలేరు.

అంతేకాదు ఓ వయసువచ్చినాక తమ పిల్లలు తమపట్ల ఏ విధంగా వ్యవహరిస్తున్నారా అనే ఆలోచన పెద్దవారిలో ఉంటుంది. వారు వండి పంపిస్తే కూర్చుని తినాలనే తపన ఉండదు. బిడ్డ ఆకలి, అవసరం తల్లి గ్రహించినప్పుడు తల్లిదండ్రుల ఆకలీ, అవసరాలు పిల్లలు గమనిస్తున్నారా లేదా అనే ఆలోచన వారికుంటుంది.

తల్లి తన బిడ్డలకోసం ఎంత త్యాగం చేయగలదో, అంత హక్కుతోనూ ఎదురుచూస్తుంది. తమ గురించి తమ పిల్లలు ఆలోచిస్తున్నారు. తన సుఖసంతోషాలు వారు కోరుకుంటున్నారని ఆమె భావించినప్పుడు వారిలో తాము నిర్వహించిన పాత్ర పట్ల సంతృప్తి, గర్వం మిగులుతాయి.

ముందు వారిలో ముసలితనం తెచ్చే భయాలు, అభద్రతాభావం వారిని పీడించవు. ఆధునికతరం ఈ సూక్ష్మ అంశాన్ని గుర్తించటానికి ముందుకురాదు అదే విషాదం.





మనిషి కొన్నికొన్ని కోల్పోయినప్పుడు వాటి విలువ తెలుస్తుంది. సులోచన తన జీవితంలో ముందు తండ్రిని కోల్పోయింది. అందువలన తన కోర్కెలు కోల్పోయింది. కొద్దికాలంపాటు జీవితం విధించిన కఠినమైన పరీక్షలకు మరికొన్ని స్పందనలు కోల్పోయింది. వీటన్నింటికీ పరాకాష్టగా తన బిడ్డను కోల్పోయింది.

ఆమెకు జీవితమంతా అలాంటి ఘటనలే ఎదురయ్యాయి. తన పేగు తెంచుకుపుట్టి, తన స్తన్యంతో పెరిగి 'అమ్మా' అంటూ హృదయంలో తలదాచుకునే తన ముద్దులబిడ్డ దూరం అయితే తను ఎంతగా క్రుంగిపోతుందో తనకు మాత్రమే తెలుసు. ఆ రంపపుకోతనుండి బయటపడి, ముందు తన భర్తను మామూలు మనిషిగా తీర్చుదిద్దుకోవటం...

కొన్ని పోరాటాలుగా అనిపించవు. అది అదృశ్యరూపంలో ఉంటాయి. మరీ ముఖ్యంగా శరీరాన్నీ, మనసునూ మనిషి అదుపుచేసుకుంటూ, తాను ఎన్నెన్నో దిగమింగుతూ చేసే పోరాటం మాత్రం సామాన్యమైంది కాదు.

సులోచన అందుకే చాలా పాఠాలు నేర్చుకోగలిగింది. అందుకే మనుషుల ప్రవర్తనలలోని విభిన్న కోణాల్ని ఆమె అంచనా వేయగలదు. తనేం చేసినా ఇతరుల ఆనందం దృష్టిలో ఉంటుంది.

అంతకుమించిన విషయం సులోచన తను చేసే పనులన్నింటిలోనూ తను గొప్ప తృప్తిని అనుభవిస్తుంది.

ఆమెకు ఇంకా చాలా ఆలోచనలున్నాయి.

మావగారి చేతులమీదుగా ఇంట్లోపనివారికి డబ్బులు ఇప్పించాలనుకుంది. ఇంతకాలానికి తమ ఇంటిలో తమతో కలసి కొద్దిరోజులైనా ఉన్నారు. ఆయనకు ఏది ఇష్టమైతే అది పెట్టాలని తను ఆరాటపడింది.

అయితే ఆయనకు ఇష్టం అంటూలేదు.

బతకటంకోసం తినేటటువంటి మనిషి తన మావగారు. మానవుల్లో కొందరు భోజనప్రియులుంటారు. అందులోనూ గ్రామాల్లో కొందరు తమ భోజనం విషయంలో ఎంతగా ఆరాటపడతారో తనకు తెలుసు.





ఇక్కడ కూడా కొంతమంది భోజనం విషయంలో రకరకాల వ్యాఖ్యానాలు చేస్తుంటారు. అయితే వారి అంతరంగిక ప్రపంచంలోకి తొంగి చూసినప్పుడు విభ్రాంతికరమైన వాస్తవాలు తెలుసుకుంది సులోచన.

అందుకే ఒకరి భోజనపు అలవాట్లు మీదనో, ఆచార వ్యవహారాల మీదనో ఆమె త్వరపడి మాట అనదు.

జీవితం కొంతమందిని అసూయలోకి నెడితే, మరికొంతమందిని సంయమనంలోకి తోస్తుంది.

తన మావగారికి తమ టేబుల్స్ అవసరంలేదు. తమ గాజు, పింగాణీ పాత్రలు అవసరంలేదు. చల్లని నీళ్లు అవసరంలేదు. ఆయన కోసం ప్రత్యేకంగా చేయించిన పీట... కొత్తగా తెప్పించిన కూజా... నీళ్లకు మట్టికుండ... హెూటల్‌నుండి తెప్పించిన అరటి ఆకు... ఇవన్నీ భూషయ్యగారు గుర్తించాడాలేదా అనేది ప్రశ్నకాదు. ఆయనకు ఓ సహజవాతావరణం కల్పించటానికి ఆమె తాపత్రయం మాత్రమే. అత్తయ్యకు తిరిగి కొన్ని చీరలూ, జాకెట్లు తీసుకుంది. ఆమె కోసం ప్రత్యేకంగా కుంకుమ ఖరీదు చేసింది. ఆమె ధరించే గాజుల కోసం షాపులచుట్టూ తిరిగింది. ఆమె తను నోరు తెరిచి చెప్పినా, చెప్పకపోయినా ఆ అర్థం ఒకటే.

"ఇంత కాలం మీరు మాకోసం బతికారు. ఇప్పుడు మీకోసం మమ్మల్ని బతకనీయండి" అని.

మానవుడు సేదదీరేది ఖచ్చితంగా ఇక్కడే. సుదీర్ఘకాలం మనిషి శ్రమించాక, శక్తులు హరించుకు పోతున్నాక తన బరువును వారసులకు అప్పగించి తీరాలి. ఆ బరువును అందుకోవటానికి వారసులూ ముందుకురావాలి. ఆ రాత్రి ఆమె తన పనులన్నీ ముగించుకొని భర్త దగ్గరకు వెళ్లేసరికి...

ఊహించని సంఘటనలు జరిగిపోయాయి.

ఒక్కసారిగా నగరంమీద దానవత్వం విరుచుకుపడింది ఇంకా తమతమ నివాసాలకు ప్రజలింకా చేరకముందే... నగరంలో మానవుడు నిర్మించుకున్న ఆధునికత మిరుమిట్లు గొలుపుతుండగానే... పెను ఉప్పెన పెటిల్లున

ంది.

ఆ సమయంలో భూషయ్యగారు నిద్రపోతు న్నారు.

ఆయన మెదడు జరిగిపోయిన సంఘటన ల్ని మననం చేసుకుంటుందా?

జరగబోయే బీభత్సాల్ని ఊహించుకుని తల్లతడిల్లుతోందా?

ఏమో... ఎవరు చెప్పగలరు... మనిషి కింకా అసాధ్యమైనవి ఈ ప్రపంచంలో అనేకం ఉన్నాయి.

నిద్రిస్తున్న మనిషీ మరణిస్తున్న మనిషీ ఒకేలా ఉంటారు. అయితే నిద్ర తాత్కాలికం. మరణం శాశ్వతం...

మనిషి నిద్రిస్తున్నాడో... మరణిస్తున్నాడో దూరంనుండి చూసి తెలుసుకోవటం కష్టం. అందుకు తప్పనిసరిగా కొన్ని పద్ధతులు ఉప యోగించాల్సిందే. ఆ రాత్రి చాలాసేపు దంప తులిద్దరూ తమగదిలో మధనపడుతుండగా భూషయ్యగారు మాత్రం ప్రశాంతంగా నిద్రపో తున్నారు.

ఒకటి రెండుసార్లు వారు బయటకు వచ్చి చూశారు. అయినా ఎలాంటి అనుమానం కలగ లేదు.

ఆయన్ని చూసి సులోచన జాలిపడింది. భర్తతో అంది.

"ఉదయం మావగారు లేచాక ఇంక ఆయ న్ని ఊహించుకుంటుంటే నాకు చాలా బాధగా ఉంది. రోజూ స్వప్నతో కబుర్లు చెప్పందే పడు కోని ఆయన ఈరోజు ఎవరితో మాట్లాడకుండా వెళ్ళి పడుకున్నాడు" అంది.

ఆయనతోపాటు అందరూ గమనించని అంశం... ఆ రోజు ఆయనకు తన లాఠీతో అవసరం రాలేదు.

"స్వప్న తాతయ్యని లేపి మాట్లాడతా నంటూ గొడవచేసింది. నేను వద్దని కోప్పడ్డాను. పొద్దున్నే పోతాడుగా అంటూ కూర్చుంది. అయినా కూడా ఆయన్ని విసిగించొద్దని చెబితే బలవంతంమీద ఊరుకుంది"

సాంబశివరావ్ తలూపుతూ ఆలోచిస్తున్నా డు.

"అయినా ఈ కర్ఫ్యూ ఎన్నాళ్లవరకూ ఉంటుందంటారు" అంది.

"ఏమో... ఎలా చెప్పగలం"

"మరి మావయ్యగారు ఎప్పుడు బయలుదే రటం?"

"అది మనచేతుల్లో లేదుగా"

"కనీసం బస్‌స్టాండ్ వరకైనా వెళ్లగలిగితే ఏదో రకంగా వెళ్ళొచ్చు"

"నిజమే. అయితే సమయానికి మన దగ్గర కారు లేకపోయిందిగా"

"ఇంక ఆయనతో గొడవే" అంది దిగు లుగా.

నరే... నాలుగు రోజులు అందరితోపాటు ఆయనకూడా భరిస్తాడు. ఏం చేస్తాం?" అన్నా డు సాంబశివరావ్.

'పడుకుందామా?" అన్నాడు సాంబశివ రావు.

"నాకు నిద్ర రావటం లేదండి"

"ఎందుకని?"

"భయంగా ఉంది... చాలా చాలా భయంగా ఉంది"

"నీక్కూడా భయమా?"

"అవునండీ... ఇవన్నీ చూస్తుంటే నాకే ఇంత భయం. ఇప్పటివరకూ మీకు చెప్ప టంలేదుగానీ నాలో రోజురోజుకీ భయాలు పె రుగుతున్నాయి"

రావు సులోచనని చూస్తున్నాడు.

"ఉదయం మీరూ, స్వప్నా బయటకి వెళ్తు న్నారు. తిరిగి ఇంటికి వచ్చేదాకా నాకు ఆందో ళనే. మీకు ఏదైనా జరగవచ్చు. స్వప్నను ఎవరైనా ఎత్తుకుపోవచ్చు. లేదా మీ వెనక నుండి ఎవరైనా వచ్చి పొడిచి పారిపోవచ్చు... మీ కారు వెళ్తుంటే రోడ్లమీద బాంబులు బద్దలై కారూ, మీరూ ముక్కలైపోవచ్చు... ఏ పక్క నుండో ఓరాయి వచ్చి మీ తలను బద్దలు చేయొచ్చు. నాకు తరచుగా ఈ ఆలోచన లొస్తున్నాయి?"

"ఏంకాదు. నువ్వు అనవసరంగా భయప

డుతున్నావ్?''

''కాదనకండి. నేను అంగీకరించను. నేను చెబుతున్నవన్నీ ప్రతిరోజూ ఎక్కడో ఓ చోట జరుగుతున్నాయి. అది రేపు మనకే జరగదని గ్యారంటీ ఏమిటి?''

''మరిప్పుడేంచేద్దాం సులోచనా''

''మనం ఈనగరం విడిచి వెళ్లిపోదాం'' అంది సులోచన.

ఆమె ఆ మాటలు అంటున్నప్పుడు చాలా దిగులుగా కనిపించింది. రెక్కలు తెగిన పక్షి ముఖంలో కనిపించే బాధ సైతం చోటుచేసుకుంది.

''సులోచనా...'' అన్నాడు ఆశ్చర్యంగా.

''అవును మనం ఈనగరం విడిచివెళ్దాం''

''ఎక్కడికి... ఎక్కడికి వెళ్దాం?'' అన్నాడు అయోమయంగా.

''ఎక్కడికైనా... భయాలు లేనిచోటికి''

''సులోచనా...ఏమిటిలా కొత్తగా మాట్లాడుతున్నావ్?''

''నేను కొత్తగా మాట్లాడటం కాదు. నాకు తెలును. మనం ఈనగరం ఎలా వచ్చామో. ఈనగరం మీద చాలా ఆశలు పెట్టుకువచ్చాం.చాలా ఘర్షణలు అనుభవించాం. రేపు ఎలా ఉంటుందో అనే భయంతో మనం విలవిలలాడిపోయాం. అయినా ఇక్కడే ఆనందం వెతుక్కున్నాం. మీరు ఈ నగరంలోనే పైకి వచ్చారు. ఈ ఇల్లు మీకల. ఇది చూసుకుంటే మీకు గర్వంకలుగుతుందని నాకు తెలుసు. అంతే కాదు ఇంతకాలం నాలో అత్తగారిపట్లా, మావగారిపట్లా ఒరకమైన అభిప్రాయం ఉండేది.

ఎందుకని ఆ ఊరినీ, ఆ చూరునూ, ఆ గొడ్లనీ పట్టుకువేలాడతారా అని... ఎందుకని ఆ ఊరినుండి వారి అడుగులు బయటకు పడవా అని... అదంతా మూర్ఖత్వం అనుకునే దాన్ని. నాక్కూడా ఈ నగరంపట్ల ఒకప్పుడు అలాంటి ప్రేమే ఉండేది. మన ఇల్లు చూసుకున్నప్పుడల్లా మనగతం గుర్తుకువస్తుంది. మన దొడ్లో నన్నజాజి తీగెను చూసుకుంటే నా చిన్నతనం గుర్తుకొస్తుంది. మరి వీటన్నింటినీ విడిచిపెట్టి వెళ్లామంటున్నాను. ఎందుకంట్కే భయంగా ఉంది''

సులోచన కళ్ళలో నీలినీడలు...

''నాకు బతకాలని వుంది. నాకింకా జతంమీద మమకారం చావలేదు. నాతోపాట మీరుండాలి. మన స్వప్న ఉండాలి. మనందరమూ కలిసి భయాలకు దూరంగా బతకాలి. ఈ నగరం నాకు అలాంటి నమ్మకం కలిగించలేకపోతోంది. అందుకే నాకిప్పుడు అదే అనిపిస్తోంది మనం వెళ్లాం''

''నిజమే సులోచనా. కానీ ఎక్కడికి వెళ్తాం... ఈ ప్రపంచంలో భద్రత ఎక్కడ ఉందో నువ్వు చెప్పగలవా?''

సులోచన తలవంచుకుంది...

కొద్దిసేపటి తర్వాత తలెత్తి చెప్పింది...

''నేను చెప్పలేనేమోగాని మావయ్యగారు చెప్పారు. మనం పల్లెలకు పోదాం. అక్కడ సంపదలుండకపోవచ్చు. అక్కడ నాగరికత ఉండకపోవచ్చు. ఇంత ఆధునికత లేకపోవచ్చు. ఇక్కడున్నన్ని సౌకర్యాలు లేకపోవచ్చు... కానీ అక్కడ జీవితానికి భద్రత వుంది. అక్కడ ఇంకా మనకు చెందినవి సజీవంగా ఉన్నాయి. ముఖ్యంగా మనిషికి కావలసిన జీవితంమీది మమకారం ఉంది. మనకు కావలసిందల్లా ఒకటే...''

''ఏమిటది?''

''మీరు భూషయ్యగారి సాంబయ్య కావాలి. నేను సాంబయ్య ఇంటావిడ్ని కావాలి, మన స్వప్న వాళ్ల నాయనమ్మ తులనమ్మ కావాలి, అంతే''

సాంబశివరావ్ తన భార్య కళ్లలోకి చూస్తుండిపోయాడు.

ఆ సమయంలో సులోచన ఎంతో అందంగా కనిపించింది. మెల్లగా తన హృదయానికి హత్తుకొని మౌనంగానే కళ్లను ముద్దాడాడు.

''పిచ్చిదానా... పల్లెలు మాత్రం ప్రశాంతంగా ఉన్నాయని ఎందుకనుకుంటున్నావ్? మనిషికి ఎప్పుడైతే స్వార్థం పెరిగిపోయిందో ఆరోజే అన్నింటా విధ్వంసన ఆరంభమైంది. పల్లెల్ని ప్రశాంతంగా ఉండనీయరు''

''మీరెన్నయినా చెప్పండి... నగరాలంతగా పతనం కాలేదు. ఇంకా ఈ దేశంలోని గ్రామా




లకు పూర్తిగా ఈ అరాచకం సోకలేదు''

''ఈ రోజేమిటిలా...''

సులోచన మరింత దగ్గరిగా జరిగింది...

గాఢంగా రెండు చేతుల్తో బంధించింది.

ఆమె అలా మౌనంగా ఎంతసేపుందో గాని...

రావ్‌కి అనుమానం వచ్చింది...

తన చొక్కా తడుస్తున్న అనుభూతి...

''ఏమిటిది... సులోచనా...'' అంటూ తల పైకెత్తాడు.

ఆమె కళ్లనిండా నీళ్లు...

''ఏడుస్తున్నావా?'' గాద్గదికంగా అడిగాడు

ఆమె గొంతు పెగుల్చుకొని...

మరింత గాఢంగా పెనవేసుకుపోతూ...

''మన భూపేష్ గుర్తుకొస్తున్నాడండి'' అని ఉద్వేగం తట్టుకోలేక హృదయంమీద వాలిపోయింది.

సాంబశివరావ్ సులోచనను మరింత దగ్గరికి తీసుకున్నాడు.

అతని కన్నీళ్లు ఆమెను తడుపుతున్నాయి.

అక్కడ గాఢమైన నిశ్శబ్దం పేరుకుపోయి వుంది...

నగరమంతటా అలాంటి నిశ్శబ్దమే...

అదే సమయంలో...

మేడమీద ఆరవేసిన లాల్చీ రెపరెపలాడుతోంది...

భూపయ్యగారు నిద్రపోతున్నారు...

అది నిద్రా? మరణమా?

ఇంకేమైనా అద్భుతమా?

ఏమో మరి... మనిషికి ధ్వంసరచనకుపయోగించటంలోనే మేధస్సుకు సరిపోతుంది. ఇంక మరణం గురించో, నిద్ర గురించో విశ్లేషించుకునే తీరికేది?

★ ★ ★

''ఇంక ఇప్పుడు చెప్పు... మన కార్యక్రమం ఏమిటి?'' అన్నాడు గంగాధర్.

''నేను చెప్పేదేముంది. నువ్వు ఇలా చేద్దాం అను. మనం ఆ రకంగా చేద్దాం. ఓ రకంగా నేను ఆలోచనలు కోల్పోయినవాణ్ణి... మొన్నటి దాకా బిడ్డను పోగొట్టుకున్న తండ్రిని... ఇప్పుడేమో తండ్రిని పోగొట్టుకున్నా...'' అంటూ రావ్ కదిలిపోయాడు.

''రావ్... ప్లీజ్... ఎమోషనల్‌గా ఫీల్ కాకు. నేనున్నా యార్... బీ ఫ్రీ... నేను నీతో బయలుదేరి వస్తున్నా. సరేనా? ఇంక వేరే ప్రయత్నాలంటూ ఏంలేవు. మన కారులో బయలుదేరుతున్నాం- సరేనా?''

రావ్ కళ్లనీళ్లు తుడుచుకుంటుండిపోయాడు.

''ముందు నువ్వు చల్లటినీళ్లతో ముఖం కడుక్కో'' అంటూ తను లేచి 'రావ్'ని బాత్‌రూంవరకూ సాగనంపివచ్చాడు.

''అన్నయ్యగారూ'' అంటూ పిలిచింది సులోచన.

గంగాధర్ ఆమె దగ్గరికి వెళ్లి ''ఏంటమ్మా?'' అన్నాడు.

''ఏం అనుకున్నారు?''

''తీసుకువెళ్లాలనే అనుకుంటున్నాం''

''అదే ఎవరెవరని?''

''ఇంకా అనుకోలేదు''

''నేనూ, స్వప్నా కూడా వస్తున్నాం''

''మీరు కూడానా?'' అన్నాడు ఆలోచిస్తూ.

''అవునండీ... మీరు కూడా ఆలోచించండి. ఎలా చూసినా మేం రావటం సమంజసం. ముందు మేం ఈ ఇంట్లో ఏడుస్తూ కూర్చోలేం. రెండవది ఆయన సంగతి మీకు తెలుసు. ఇప్పటివరకూ ఏం మాట్లాడటంలేదు. అయితే తుపానుకు ముందున్న ప్రశాంతత అది. నేను ఆయన పక్కనుండాలి. మరి నేనూ, ఆయన ఉంటే స్వప్నను విడిచిపెట్టలేంకదా... అంతేకాదు ముందు మా అత్తగారి పరిస్థితి గురించి మీకు తెలియదు. ఆమె ఎలా అవుతారో తెలియదు. మరి ఈయన్నే చూసుకోవాలా? అత్తయ్యగారినే చూసుకోవాలా... నేనూ లేకపోతే వాళ్లేం చేస్తారు చెప్పండి''

''నిజమేనమ్మా... నేనింతదూరం ఆలోచించలేదు. అంతేకాదు. మేం ఇద్దరం

మాత్రమే వెళ్ళి ఊరుకుంటే ఆ ఊరివాళ్ళు మమ్మల్ని ఎప్పటికీ క్షమించరు కూడానేమో''

"అంతేకదామరి. ఈ విషయాలన్నీ వారికి తెలియవుకదా. మీరు బయలుదేరగాలేంది వాళ్ళకేమైంది అంటారు. అందులోనూ ఏ శుభ కార్యమో అయితే వేరు. ఇలాంటి సమయంలో అలా ఎన్నటికీ చెయ్యకూడదు''

"నిజమే... అయితే ఓ పని చెయ్యండి. నువ్వా ఏర్పాట్లు చూడు. నేను 'రావ్'తో మాట్లాడతాను'' అని వచ్చాడు.

రావ్ బాత్‌రూంనుండి బయటికు వచ్చాడు. ఇప్పుడతను ప్రశాంతంగా ఉన్నట్లు కనిపించాడు.

"కమాన్... హరియప్. మనతోపాటు సులోచనా, స్వప్నా కూడా వస్తున్నారు''

"వాళ్ళని కూడానా?'' అన్నాడు.

"మరి వాళ్ళిద్దరూ ఇక్కడ ఉండి ఏంచేస్తారు''

"నీ ఇష్టం''

"అది సరే... క్యాషుందా?''

"ఉందిలే... పదివేలదాకా ఉంది సరిపోతుందిగా''

"చాలు... నువ్వెళ్ళి మిగతా ఏర్పాట్లు చూడు'' అన్నాడు.

★ ★ ★

చదువుకుంటున్నదల్లా ఫోన్ రింగవటంతో పుస్తకం పక్కన పెట్టింది.

"నేనమ్మా... డాడీని. అంతా బాగానే వుంది కదా''

"బాగుంది డాడీ''

"అయితే విను. మేం బయలుదేరుతున్నాం. నేను కూడా వెళ్తున్నాను. రెండు మూడు రోజులవరకు రాను. ముందు సిటీలిమిట్స్ దాటాక మళ్ళీ ఓసారి ఫోన్ చేస్తాను. దాంతో మీరేం కంగారుపడాల్సిన అవసరం ఉండదు. నేను ఫలానా తేదీకి రాగలనని ఖచ్చితంగా చెప్పలేను. అయితే తొందరగా రావటానికి ప్రయత్నం చేస్తాను సరేనా''

"అలాగే డాడీ''

"అమ్మకు ధైర్యం చెప్పాల్సింది నువ్వే. అన్నట్లు కారుముందు నువ్వు చెప్పినట్లుగా "ప్రెస్'' అని రాస్తున్నా. సరేనా''

"థాంక్యూ డాడీ'' అంది ఆనందంగా.

"అమ్మకోసారి ఫోన్ ఇస్తావా?''

"అలాగే. అమ్మా...'' అంటూ పిలిచింది.

"ఏమిటండీ'' అంది ఆమె.

"ఏంలేదు. అమ్మాయికి అన్ని విషయాలు చెప్పాను. నేను త్వరగా బయలుదేరివస్తా. నీకోసారి చెబుదామని''

"జాగ్రత్తగా వెళ్ళండి'' అందామె.

"అలాగే''

"మరి సులోచనగారికి చెప్పండి''

"నేను చెబుతానుగా... అమ్మాయికివ్వు''

"జాగ్రత్తమ్మా. ఏం కంగారుపడాల్సిన అవసరంలేదు. అంతగా అయితే కంట్రోల్‌రూంకి ఫోన్ చెయ్యి. మరి ఉంటాను''

ఫోన్ పెట్టేసి కిందకు నడిచివచ్చాడు.

"గదులన్నీ లాక్ చెయ్యండి. కిచెన్ తాళంచెవులు వాళ్ళకివ్వండి... ఇంతకూ ఏమైనా తిన్నారా?''

"లేదు. వాళ్ళు కూడా తిన్నారా'' అన్నాడు పనిమనుషుల్ని ఉద్దేశించి.

"సరే... సాయంకాలం తింటారు. చూడండి. జాగ్రత్తగా ఉండండి. ఫోన్ వస్తే మాత్రం విషయం చెప్పండి. ముందు తలుపులన్నీ మూసెయ్యండి. అవసరం అనుకుంటే మాత్రం పోలీసు కంట్రోల్‌రూంకి ఫోన్ చెయ్యండి'' అంటూ నెంబర్ చెప్పాడు. ఎలా చేయాలో కూడా చేసి చూపించాడు.

"అమ్మా... సులోచనా... కొంచెం కాఫీ ఇస్తావా?'' అన్నాడు.

"ఉండండి. తయారుచేస్తాను''

"అందరికీ చెయ్యమ్మా'' అన్నాడు.

సులోచన నిశ్శబ్దంగా వంటగదిలోకి నడిచింది.

"వెనకసీట్లో జాగ్రత్తగా పడుకోబెడదాం. అంతగా అయితే ఓ పనిచేద్దాం. నువ్వూ సులోచన వెనక కూర్చుందురుగాని'' అన్నాడు.

"ఎలా చేద్దాం. పడుకోబెడదామా''





''అలానే చేద్దాం''

''కూర్చోబెడితే ఎలా ఉంటుంది?''

''చూద్దాం. కూర్చోబెడితే కొంచెం స్పేస్ వస్తుంది''

''వద్దులే... నేను వెనక కూర్చుంటాను. స్వప్నా... సులోచనా ముందు కూర్చుంటారు'' అన్నాడు రావ్.

''సరే ముందు కాఫీ తాగా॥ పని మొదలు పెడదాం'' అన్నాడు గంగాధర్.

''నువ్వు తాగు''

''నేను కాదు. అందరం తాగుతున్నాం'' అన్నాడు గంగాధర్.

ఎవరూ మాట్లాడలేదు.

సులోచన అందరికీ కాఫీ కప్పులు అందించింది.

''ఇంక మొదలుపెడదాం'' అన్నాడు గంగాధర్.

''గంగాధర్ ఒన్‌మినిట్'' అంటూ పక్కకు తీసుకువెళ్లాడు రావ్.

''ఏమిటి?'' అన్నాడు అర్థంకాక.

''నీ కారులో డెడ్‌బాడీని...'' అంటూ ఆగిపోయాడు.

''డెడ్‌బాడీని... ఏమిటో చెప్పు'' అన్నాడు.

''అదే... కారులో డెడ్‌బాడీని అందరూ తీసుకువెళ్లరు''

''ఏంటి రావ్... అంత సిల్లీగా మాట్లాడతావ్. అది డెడ్‌బాడీ మాత్రమేనా? ఆయన మహానుభావుడు... అంతకుమించి మనిషి''

''నువ్వు ఇష్టపడి కొనుక్కున్న కారు''

''అయితే శాశ్వతంగా ఉంటుందా? నో...''

''అది కాదు సెంటిమెంట్...''

''వాట్ రావ్. సెంటిమెంట్ అంటే అదా? ఇందాక ఫోన్‌లో నిన్ను సెంటిమెంటల్‌గా ఆలోచిస్తున్నావా అన్నందుకు నేనెంతగా బాధపడ్డానో తెలుసా? అసలు ఈరోజు ఈ పరిస్థితికి కారణం ఏమిటి? సెంటిమెంట్ లేకపోవటమేగా? మీ డాడీది సెంటిమెంట్. గొప్ప సెంటిమెంట్. ఆయన తన ఊరిని ప్రేమించాడు. తన ఊరులో కాకుండా ఇంకెక్కడన్నా చచ్చిపోతానేమో అని విలవిలలాడిపోయాడు. ఆయనంత బాధపడాల్సిన అవసరం ఏమిటి? తను విదేశాలు కాదుగా వచ్చింది. హైదరాబాద్ వచ్చాడు. అందులోనూ మన రాజధాని నగరం వచ్చాడు.

వచ్చి నేను మా ఊరే వెళ్లాలంటే అర్థం ఏమిటి? బ్యాడ్ సెంటిమెంటనేకదా? విశాల హృదయం లేనట్లేకదా. ఒరకంగా ఆలోచిస్తే అది నిజమే. కానీ... తను పుట్టిపెరిగిన ఊరుని గౌరవించలేనివాడు, ప్రేమించనివాడు, కన్నతల్లిని గౌరవించలేనివాడు విశాలప్రపంచాన్ని మాత్రం ఏం గౌరవిస్తాడు? ముందా బ్యాడ్ థింకింగ్‌లోకి వెళ్లాలంటే మొదటి మెట్టు ఇది. నా కారు విషయం అంటావా? అదే అంతే జీవమున్నయ్యే అందులో ఉండాలంటే ఎలా... రాత్రిపూట కారు కిందపడి ఏమేం ఛస్తున్నాయో మనం ఆలోచిస్తున్నామా?''

''అదికాదు. గంగాధర్ స్నేహం వేరు. నా తండ్రి అయినంత మాత్రాన నేను బలవంతం చేయకూడదుకదా''

''అసలు మాకు అలాంటి ఆలోచన రాలా. ముందు ఆయన్ని ఆ ఊరు ఎలా చేర్చాలా అనేది ఆలోచించాం. ఆయనకి మనమేం చేసినా తెలియదు. మీ అమ్మగారు బాధపడినా చేయగలిగింది లేదు. అలా అని చెప్పి మనం ఊరుకుంటున్నామా? మనిషి ఉన్నా లేకపోయినా అతనితో అవసరం ఉన్నా లేకపోయినా గౌరవించగలిగినాడు మనిషవుతాడు. అంతేగాని స్నేహంలో కూడా వ్యాపారం చూసేవాడూ... ముందొకమాటా... వెనకోమాట చెప్పేవాడు స్నేహితుడు కూడా కాదు. అలాంటివాళ్లు ముందు వాళ్లని మోసం చేసుకుంటారు. నేను నన్ను నేను మోసం చేసుకునేవాణ్ని కాదు. నా కిష్టం లేకపోతే ఇంతదూరం రాను''

''థాంక్యూ... గంగాధర్ థాంక్యూ'' అన్నాడు రావ్.

''ఇట్సాల్‌రైట్ ఇప్పటికే ఆలస్యం అయింది. కమాన్'' అన్నాడు.

నలుగురూ పట్టి అత్యంత జాగ్రత్తగా కారు వెనకసీట్లోకి చేర్చారు శవాన్ని. ▪

"ఓపని అయింది... కమాన్ త్వరగా రండి" అన్నాడు.

సులోచన పనివారి చేతిలో డబ్బులుంచి ఏదో చెప్పి వచ్చింది.

సులోచన వెనక్కి వస్తానంది... కాదనలేకపోయాడు రావ్.

సర్దుకుని కూర్చున్నారు.

కన్నీళ్లతో వీడ్కోలు చెప్పారు పనిమనుషులు.

మహాప్రస్థానం ఆరంభమైంది.



కారును ఏకాగ్రతతో నడుపుతున్నాడు గంగాధర్.

అలవాటైన దారి. ఎప్పుడూ రోడ్లనిండా జనం... ఓ బారులో అందరూ వేగంగా పయనిస్తుంటారు. మనుషులూ అంతే. కార్లూ అంతే. అలా ఆ ప్రవాహం నిరంతరం సాగుతూనే వుంటుంది. ఏ నడిరేతిరి అనంతరమో కొన్ని రాస్తాలు మాత్రం మౌనంగా ఉంటాయి. అప్పుడు కూడా ఏదోఒక వాహనం పరుగులు తీస్తూనే వుంటుంది. రోడ్లన్నీ విశ్రాంతి తీసుకుంటాయి. మరలా తెల్లవారబోతుంది. తిరిగి తను ప్రయాణానికి అనువుగా నిలబడాలి. తన మీదుగా సంస్కృతి ప్రవహిస్తుంటుంది. ఎవరెవరో నడిచివెళ్తున్నారు. ఏ గుడ్డివారో తడుముకుంటూ ఉంటారు. ఆ వేగంలో ఎవరో ఎవరో ఒకర్ని బలంగా ఢీకొంటారు. ఒక్కసారిగా శబ్దం... పెద్దగా ఆర్తనాదం... రోడ్డంతా విసిరివేయబడ్డ అద్దంముక్కలు... పారే రక్తం కాల్వలు... జనమంతా ఓ క్షణం అటు చూస్తారు. కొందరు మాత్రం దగ్గరకొస్తారు. మరికొందరు తొలగిపోతుంటారు... కొద్ది క్షణాలు... కొద్ది గంటలు... అంతే... ఆ తర్వాత అక్కడేం జరిగిందో ఎవరికీ తెలియదు. తిరిగి మనుషులంతా పరుగులు తీస్తుంటారు.

ఏ సాయంకాలంలోనో కొంతమందికి తీరిక లభిస్తుంది. తీరిక చేసుకుంటారు. వారి మనసులు బహుశా ఆహ్లాదాన్ని కోరుకుంటాయి. అప్పటివరకూ గుర్తించని అందాలకోసం వెతుక్కుంటారు.

అందరూ నగరాలకు బతకటంకోసం వచ్చినవారే. వచ్చాక రకరకాల స్పందనలు కలిగిస్తుంది నగరం. తను ఏదో కొత్తది నేర్చుకుంటాడు. నగరం ఓ నిధి. తవ్వుకోవటం చేతనవ్వాలి. అది బహిరంగంగానే చేయవచ్చు. అయినా కొందరు ఆగిపోతారు. వారంతా చీకటికోసం వేచివుంటారు. అలా నిరంతరం ఏదో మూల చీకటి బలవంతంగా సృష్టించబడుతుంటుంది. ఆ చీకట్లో మనుషుల కళ్లు మెరుస్తుంటాయి.

వారి కళ్లల్లో లోహపు తళతళలు... వారి కళ్లచుట్టూ కరెన్సీ మిలమిలలు. నగరమంటే డబ్బు. నగరమంటే భీభత్సం... నగరమంటే కొందరికి తరిగిపోని నిధి...

అయినాసరే దూరంనుండి చూస్తుంటే నగరం వెదజల్లే మంటలు కనిపించవు. అవన్నీ కాంతులుగా... అవన్నీ స్వర్గపు ద్వారాలుగా అనిపిస్తాయి. ప్రజలంతా ప్రవాహాలు ప్రవాహాలుగా నగరాల్లోకి చొచ్చుకుపోతుంటారు. ఆ ద్వారాలు మూసుకుపోతాయి. లోపల ఏం జరుగుతుందో తెలియదు. తెలిసినా చాలా స్వల్పం...

ఒక్కోసారి నగరపు తలుపులు భళ్లున తెరుచుకుంటాయి. కొద్దిమంది కిందపడ్డ గాజుముక్కలా చెల్లాచెదురవుతారు. దూరంనుండి చూసేవారికి ఈ సూక్ష్మదృశ్యం కనిపించదు.

వారికి ప్రవాహాలే కనిపిస్తుంటాయి.

కూలిపోతున్నవేవీ కనిపించవు.

లోహాలు పిలుస్తుంటాయి. వస్తువులు పిలుస్తుంటాయి.

నగరాలే గొంతెత్తి పిలుస్తుంటాయి.

లోహపుగుట్టలు తవ్వుకున్న ప్రతివాడూ నగరం తనదే అనుకుంటాడు. నగరం తన ప్రాదాక్రాంతం కావాలనుకుంటాడు.

నగరాలు మాట్లాడవు.

మనుమలే మాట్లాడతారు.

మనుమలే నవ్వుతారు. ఏడుస్తారు. శ్రమిస్తారు.

అందుకే నగరం తన స్వంతం అనుకునే ప్రతివాడూ మనుమలందరూ తన స్వంతం అనుకుంటాడు. వారిని శారీరకంగా, మానసికంగా లొంగదీసుకోవాలనుకుంటాడు. నగరం నాజూకుతనాన్ని నేర్పుతుంది. రకరకాల మనుమల్ని తెస్తుంది.

నగరం నా స్వంతం అనుకునేవాళ్లు ప్రతి చౌరస్తాలో వుంటారు.

వాళ్లలోవాళ్లు తగాదాలు పడుతుంటారు.

అవన్నీ నగరపు ప్రజలవే అనుకునేలా చేస్తారు.

వాళ్లే రోడ్లకు విశ్రాంతినిస్తారు.

వారే ఏ తీగలమీదో పరస్పరం సంభాషించుకుంటారు.

వారే అమాంతం శాంతికాముకులవుతారు... ఒక్కసారిగా స్తంభించిన నగరం వొళ్లు విరుచుకుంటుంది.

తిరిగి రోడ్లన్నీ కళకళలాడతాయి. ఏదో మూల ఎవడో ఒకడు ఉపన్యసిస్తాడు.

అక్కడో... ఇక్కడో దుప్పట్లు పంచుతారు.

చిరిగిపోయినవీ, పాతబడ్డవీ అయిన బట్టలు మనుమల ప్రతిరూపంగా వీధుల్లోకి నడిచి వస్తాయి.

అవన్నీ గుట్టలుగా పోస్తారు.

మనుమలందరినీ వరసల్లో నిలబెడతారు.

అప్పుడు సమూహాల్లో కూడిన ప్రభువులు జనం శరీరాలమీద ఈ బట్టలు కప్పుతారు. ఇంకా అక్కడ గాయాలు మానవు. రక్తాలు ఆగవు. అయినాసరే శరీరంమీద ఏదోఒకటి కప్పాలి. రక్తం రంగు ఆ బట్టలకు కొత్త రూపం ఇచ్చినా ఫర్వాలేదు.





భోరున ఏడుస్తున్నవారిని కసురుకుంటారు.

వారు దోసిళ్లతో నవ్వులు తెచ్చి బలవంతంగా ముఖంమీద పూస్తారు.

ఆ నవ్వేవాడు మనిషి కాదు.

ఆ నవ్వు మనిషిది కాదు.

వాడు ఎవడికోసమో గుండెనుండి ఉబికివస్తున్న దుఃఖాన్ని నవ్వుగా మార్చుతున్నాడు.

తిరిగి సమూహాలు కదిలివెళ్తాయి...

తర్వాత ఇంకోడు...

అటుపిమ్మట మరొకడు...

అందరూ నగరాల్ని స్వంతం చేసుకోవాలనుకున్నవారే...

వారి నీడల్ని చూస్తే తమాషాగా ఉంటాయి.

వారి నీడలు మనుమలవి కావు.

మనుమలుగా వారెప్పుడో మరణించారు.

ఇప్పుడు వారు ఎన్నయినా చెబుతారు.

నగరాలు జనానివి అని మాత్రం చెప్పరు...

ఏమో ఎవరు చూశారు.

ఈ జనమంతా ఒక్కసారిగా...

"ఈ నగరం ఎవరిది? వాడెవడు? వాడెందుకిది చేస్తున్నాడు? మనం ఎందుకిలా అవుతున్నాం?"

అంటూ తమనుతాము ప్రశ్నించుకుంటే...

అప్పుడు రోడ్లు నిర్మానుష్యం కావు...

అవును మరి...

నగరం కొందరిది కాదు.

నగరం అందరిదీనూ.

గంగాధర్ కారును ఏకాగ్రతతో నడుపుతున్నాడు...

రోడ్లెప్పుడూ వంటరివికావు.

అవి వెళ్లి రోడ్లతోనే కలుస్తాయి. రోడ్లు చౌరస్తాలవుతాయి. అవి నాలుగుదిక్కులూ చూపిస్తాయి.

గంగాధర్ నడుపుతున్న కారు మెల్లగా ఆగిపోయింది.

ఒక్కసారిగా అందరూ ఉలిక్కిపడ్డారు. వారి కళ్ల ముందు కనిపిస్తుందో దృశ్యం... చౌరస్తాలో ఎర్రటి టోపీలు, వారి చేతుల్లో తుపాకులు.

"కౌన్ హై" ఎవరో అరిచారు.

గంగాధర్ మౌనంగా కారు దిగాడు.

"ఏమయ్యా నీకేమైనా బుద్ధుందా? కర్ఫ్యూ అంటే ఏమిటనుకున్నావ్" ఒకతను అరిచాడు.

గంగాధర్ ముఖం కందగడ్డలా అయింది. అంతరంగం హెచ్చరిస్తోంది.

"ఆవేశాలకు ఇది సమయం కాదు"

"చూడండి.."

"ఏంటయ్యా చూసేది... బొక్కలో తోస్తాం"

"కాల్చిపారెయాలి కొడుకుల్ని" ఎవరో అంటున్నారు.

"ఏంది ఇంతమంది బయలుదేరారు? ఎక్కడికి?"

"మేం చెప్పేది కొంచెం వినండి... ప్లీజ్"

"ఏం చెబుతావ్"

"మా పెద్దనాన్న చచ్చిపోయారు"

"చచ్చిపోయాడా? ఎడ చచ్చిపోయాడు, ఎవరు చంపారు?" అరుస్తున్నాడు. చౌరస్తాలో ఉన్నవారందరూ అక్కడ గుమిగూడారు.

వాళ్ళు అద్దాలనుండి స్వప్నకేసి ఆబగా చూస్తున్నారు.

సాంబశివరావు మాట్లాడటంలేదు. అతనికి మాటలన్నీ వినిపిస్తున్నాయి. తన తొడలమీద తన తండ్రి తల ఉంది.

సులోచన కంగారుగా చూస్తోంది.

"ఇప్పుడేమవుతుందమ్మా" అనే ప్రశ్న సులోచన కంఠంలో సుడులు తిరుగుతోంది. అది బయటకు రావటంలేదు.

"ముందు శవం చూడండిరా. చంపారో... చచ్చిపోయాడో"

ఎవరో వచ్చారు, డోర్ తెరిచారు.

"నువ్వు దిగుబే... ఏంటి దొరలాకూర్చున్నావ్"

మెల్లగా తలను క్రిందకు వాల్చి బయటకు వచ్చాడు.

"నీకు వేరే చెప్పాలా?" అరిచేడు.

బెదిరిపోతూ దిగింది సులోచన.

కారు వెనకాల భూషయ్యగారి శవం.

"ముసలాడే... ఎందుకు చచ్చిపోయేడు?"

"తెలవదు"

"ఎందుకు తెలవదు?"

రావ్ గంగాధర్‌కేసి చూశాడు.

తను వారిస్తున్నాడు.

సులోచన తన బిడ్డకేసీ, కొంతమందికేసి మార్చి మార్చి చూస్తోంది.

"ఎక్కడికి తీసుకుపోతున్నారు"

"మా ఊరికి"

"ఎందుకు?"

"ఆయన్ని అక్కడ దహనం చెయ్యటానికి"

"ఇక్కడ చెయ్యరాదా"

"కావలసిన వారందరూ అక్కడే ఉన్నారు".

"మరిక్కడెందుకు పోయాడు"

ఎవరో నవ్వారు.

రావ్ గంగధర్‌కేసి చూశాడు.

గంగాధర్‌కి ఈ పరిస్థితిని భరించటం చాలా కష్టంగా ఉంది. అయినా తప్పదు. తనకు తెలిసినవారెవరూ కనవడటంలేదు.

ఒకతన్ని పక్కకు తీసుకువెళ్ళాడు.

"చూడండి... మేమేం బాధ్యతలేనివాళ్ళంకాదు. నాకు మీ డిపార్ట్‌మెంట్‌తో పరిచయాలున్నాయి. మీ డి.ఎస్.పిగారు నాకు తెలుసు. మేం ఎంత అవసరం కాకపోతే ఈ రిస్క్ తీసుకొంటామో ఆలోచించండి"

"మీకు పాస్ ఉందా?" "ఎలా ఉంటుంది? అసలు ఎప్పుడిచ్చారు? కొంత మందికి ఇంకా కర్ఫ్యూ గురించి తెలియదు. అయినా మీకు మేం అలా కనిపిస్తున్నామా?"

"అందరూ అంతే! ఎవడు దొంగో, ఎవడు గూండానో ఎవరికి తెలుసుద్ది"

"అయితే ఏమిటంటారు?"

"మీ డిక్కి తెరవండి, చెక్‌చెయ్యాలి"

"కమాన్ రండి"

డిక్కీ తెరిచి అంతా సోదాచేశారు.

తిరిగి డిక్కీ మూశారు.

"ఇంక మేం వెళ్ళొచ్చా?"

లావాటి వ్యక్తి వచ్చి చెప్పాడు.

"ఏంటట్టా చూస్తారు? ఎట్టా చచ్చిపోయాడో



తెలియదంట. పోస్ట్ మార్టమ్ చేయించాల. అప్పుడయితే తెలుసుద్ది''

''ఔ మల్ల'' అన్నాడింకో యువ కానిస్టేబుల్.

గంగాధర్‌కింకా సహనం చూపించే మూడ్ ఉంది.

''ఇది చాలా దారుణం. మీకు తెలియ దేమో... మేం ప్రెస్‌కు చెందిన వాళ్లం''

''ఏం ప్రెస్ భయ్''

''ఏదో ఒక ప్రెస్. అయినా మా తండ్రిని కోల్పోయి మేం ఏడుస్తున్నాం. ఈ ఊరినుండి ఎలా బయటపడటమా అని ఆరాటపడుతు న్నాం. ఇలాంటప్పుడు మీరున్నదెందుకు? మాకు సహాయం చెయ్యటానికా? హింసపెట్ట టానికా?''

''క్యా బే... గడబిడ చేస్తున్నావ్'' అంటూ లాఠీని గుండెలకి ఆనించాడు.

''నేనేం చెయ్యటంలేదు. మామాట విన మంటున్నాను'' ఇంగ్లీష్‌లో చెప్పాడు. రావ్ ముందుకు రాబోయాడు.

''రావ్... నువ్వెళ్ళి డాడీ దగ్గర కూర్చో నేను మాట్లాడి వస్తాను'' అన్నాడు.

రావ్ మాట్లాడకుండా ముందుకు నడిచాడు.

''ఇప్పుడేం చేస్తారు?'' అన్నాడు.

''ఏం చెయ్యం, ముందు స్టేషన్‌కయితే పద''

గంగాధర్ ఓ నిర్ణయానికొచ్చినట్లుగా.

''సరే... పదండి'' అన్నాడు.

అతని తెగింపు చూశాక ఎవరూ ముందుకు కదల్లా. ఒకతను మాత్రం ముందుకువచ్చి-

''భాయ్‌సాబ్'' అంటూ పక్కకు పిలుచుకు వెళ్ళాడు.

''ఏమిటి?''

''గొడవలు దేనికి సాబ్''

''ఎవరయ్యా గొడవచేసింది, ముందు నుంచి మా మాట వినిపించుకోరేమిటి?''

''స్ట్రిక్టుగా ఉండమని పైనుండి చంపేస్తు న్నారు''

''అవును మరి ఉండాలి. అయితే మాలాంటివారిని ఇబ్బంది పెట్టడమా స్ట్రిక్టు అంటే''

''ఇబ్బంది ఎందుకు సాబ్''

''మరి స్టేషన్‌కి పదమంటే ఏమిటి? పోస్ట్ మార్టం చేయాలంటే అర్థం ఏమిటి? మీకు అనుమానం వస్తే కారంతా సోదాచేసుకోండి. అంతేగాని ఇలా చేయటం మీకే కాదు అసలు మనుషులు చెయ్యకూడదు''

''పోనీండిసార్... మీరే ఏదోఒకటి చూ డండి''

''ఏం చూడమంటావ్... నన్నేం చేయ మంటావో చెప్పు''

''వాడంతే సాబ్... వాడికి డబ్బులుపడాలి. నిన్నటినుంచి రోడ్డుమీద మనిషి దొరకటంలా''

''ఆ ముక్క ముందే చెప్పొచ్చుగా''

''ఎట్టా సెబుతాం... అయ్యన్నీ మీకు తెలి యాల'' అంటూ నవ్వాడు. ఆ నవ్వు చూ స్తుంటే చిరాకుగా ఉంది.

''ఏంకావాలో చెప్పు''

''చూస్తన్నారుగా చాలామంది ఉన్నాం. చాయ్ నీళ్లు కూడా దొరకవు''

''రెండువందలిస్తాను... సరేనా?''

''అన్యాయం సార్... ఇంతమందున్నాం''

''అంటే మీ అందరికీ తలా పదివేలివ్వ మంటావా?''

''ఏంటి సాబ్ జోకులేస్తారు?'' అన్నాడు.

''మరేంటి నువ్వు చెప్పు''

''ఇప్పుడు ఇది లేకపోతే దారిపొడుగునా డబ్బులు చల్లుకుపోరాసాబ్'' గంగాధర్ అతని కళ్ళలోకి సూటిగా చూశాడు.

అతని ముఖంలో సిగ్గూ, అభిమానం, సంకో చంలాంటివేం కనిపించటంలేదు. మనుష లు ఇంతగా దిగజారుతారని తనకి తెలియ దు. ముందున్న అసహ్యం తొలగిపోయి వారి మీద జాలికలిగింది.

''సరే... ఓ పనిచేస్తా మీ అందరికీ కలిపి వెయ్యి రూపాయలిస్తాను- చాలా'' అతని కళ్లు మిలమిలలాడాయి.

''మంచిది సాబ్'' అంటూ దూసుకెళ్ళాడు. వాళ్ళందరితోనూ మాట్లాడాడు. వాడు వెయ్యి

ఇస్తానని చెప్పాడో... అయిదు వందలని చెప్పాడో... కొద్దిసేపటి తర్వాత వచ్చి అన్నాడు-

"అచ్ఛా సాబ్"

"ఇంకెక్కడా ఏంగొడవ జరగదా"

"జరగదు సాబ్"

"ఇంకెవరైనా ఆపితే"

"ఆపరు సాబ్"

"పోనీ మాతోపాటు అక్కడిదాకా ఎవరన్నా రాకూడదూ"

"లేదుసాబ్" పెద్దాయన వస్తాడు. అసలు జనం లేరు సాబ్. మీకెందుకు... మీకేంకాదు"

"సరే... ఉండు" అంటూ రావ్ దగ్గరికి వెళ్లాడు.

"ఓ వెయ్యి ఇవ్వు"

రావ్ మౌనంగా అందించాడు.

"బహుత్ మ(క్రియా సాబ్" అందుకుని సెల్యూట్ కొట్టాడు.

"మేం బయలుదేరతాం"

"మంచిది సాబ్"

గంగాధర్ వచ్చి కారు స్టార్ట్ చేస్తుంటే గాల్లో నుండి తేలివస్తూ వినిపించాయా మాటలు.

"పోరి అయితే బాగుందిర భయ్"

కారు ఒక్క జర్కుతో ముందుకుదూకింది.

"ఇంక గండం గడిచినట్లేనా" అంది సులోచన.

"ఏమో ఎట్లా చెబుతాం?"

"నాకయితే నిజంగానే ఇక్కడే ఆపేస్తారేమోనన్నంత భయం కలిగింది"

"వాళ్ళేమైనా చేస్తారు. ఒక్కటి తప్పు... ఈ నగరంలో దొంగలెవరో... గూండాలెవరో వీళ్లకి తెలియదా? వాళ్ళు తలచుకుంటే తెల్లారేసరికల్లా అందరినీ జైల్లోకి తోస్తారు. అలా చేస్తే ముందు మన నాయకులు అంగీకరించరు" అన్నాడు గంగాధర్.

"వాడు ఎంత కంగారుపెట్టాడో" అంది.

"ఎంత కంగారు పెడితే అంత ఎక్కువ డబ్బులు రాలతాయన్న మాట"

"అయినా మీరిద్దరూ వాళ్లమీద ఎక్కడ కోపం తెచ్చుకుంటారో... వాళ్ళేం చేస్తారో అనే భయం కలిగింది"

"నిజమే. చాలా కంట్రోల్ చేసుకోవాల్సివచ్చింది. అలాంటి సమయంలో మనం ఏ మాత్రం కంగారు పడినా కోపం తెచ్చుకున్నా ఏ షార్ట్ టెంపర్‌గాడో ఉంటే కాల్చి అవతల పారేస్తాడు"

"అలా చేస్తారంటారా?"

"చేసినా ఆశ్చర్యంలేదు. అంతగా అయితే ఎదురు తిరిగితే కాల్చాం అని చెబుతారు"

"అయినా మనుమల్ని రక్షించాల్సిన వారు ఇలా ప్రవర్తించటందారుణం కదూ" అంది.

చీకట్లు ముంచుకు రాబోతున్నాయి. ఎవరూ మాట్లాడుకోవటంలేదు. కారు ఇంకా సిటీ లిమిట్స్ దాటనేలేదు.

చౌరస్తాలలో కూడా కారుని స్లో చేయడంలేదు. ఓ చౌరస్తాలో మాత్రం పోలీసుల్తో ఇద్దరు మహిళలు ఏదో గొడవపడుతున్నట్లున్నారు. మీసాలు పెంచిన ఓ కానిస్టేబుల్ మాత్రం క్రూరంగా చూస్తుండిపోయాడు. అప్పటికి తన ఆగ్రహం అణుచుకోలేక గాలిలో లాఠీని ఝుళిపించాడు.

"ఫర్వాలేదు. నాకిప్పుడు ఓ ధైర్యం ఉంది. మనకు పోలీసుల్తో ఇబ్బందులు రావు. వాళ్లు డబ్బు తీసుకొని మనల్ని వదిలేస్తారు. పాపం ప్రజాసేవకులుగా వారు చేయగలిగింది అదే"

"అయినా కొంతమంది మనుమలు నడుస్తూ కనిపిస్తున్నారు"

వారికి కూడా మనలాంటి అవసరం ఏదో వచ్చి ఉంటుంది. లేకపోతే ఎందుకు తెగిస్తారు"

"మరి రోడ్ల పక్కన జీవిస్తున్నవారి మాటేమిటి?"

"ముందుగా అలాంటి వారినే చంపుతున్నారు. 'కవి' నాకు చెప్పిందాన్ని బట్టి శవానికింతని ఇస్తున్నారంట"

"నిజమా..."

"నిజమే అయి ఉంటుంది. లేకపోతే ఏమీ సంబంధంలేని వ్యక్తులే ఎందుకు చచ్చిపోతున్నారు?"





స్వప్న భయం భయంగా గంగాధర్ కళ్ళలో కి చూస్తోంది...

ఆ అమ్మాయికి రేపటిగురించి ఆలోచించా లంటేనే భయంగా ఉంది. తమ తాతయ్యతో తాము చేస్తున్న ఈ ప్రయాణమే ఈ నగరపు చివరి ప్రయాణం అయితే బాగుండునని పిస్తుంది.

గంగాధర్ కారును స్లో చేశాడు.

కొంతమంది గుంపులు గుంపులుగా కని పించారు.

"ఏమైంది? ఏమైందక్కడ?"

సులోచనా, స్వప్నా అడిగారు.

కారు పక్కన నిలిపి గంగాధర్ దిగాడు. ఎవర్నో పిలిచి అడిగారు.

"ఏంకాలేదు సార్... ఇక్కడ మే మంతా చాలా కాలంనుండి కల్సి బతుకుతున్నాం... ఇంతకు ముందు ఎవరో కొత్తవాళ్లు స్కూటర్ల మీద వచ్చారు.

ఎందుకో అనుమానం వచ్చి వెంటపడితే... పారిపోయారు. ఓ కత్తి అయితే దొరికింది" అంటున్నాడు.

జనమంతా గోలగోలగా మాట్లాడుకుంటు న్నారు. వారిలో హిందువులూ, ముస్లిమ్స్, ఇంకా మరికొన్ని మతాల వారు కనిపిస్తున్నారు. వారందరి కళ్లలోనూ కర్ఫ్యూ తాలూకు భయం కనిపించటం లేదు. వారు ఒకరినొకరు ఓదా ర్చుకుంటున్నారు, ధైర్యం చెప్పుకుంటున్నారు. గంగాధర్ కళ్ళు చెమర్చాయి.

తిరిగి వచ్చి కారులో కూర్చున్నాడు.

ముందుకు కదిలింది. ఇప్పుడతనికి ఏదో మూల సంతృప్తిగా కూడా ఉందనిపించింది.

"ఈ ప్రపంచంలో మనుషులింకా మనుష లుగానే ఉంటున్నారుకదూ" అన్నాడు.

"వాళ్ళు మనుషులు కదా" అంది స్వప్న.

ఓసారి ఆ అమ్మాయికేసి చూసి తిరిగి రోడ్ మీదకి దృష్టి సారించాడు.

"నిజమే స్వప్న. మామూలు మనుషులెప్పు డూ మనుషులుగానే బతుకుతున్నారు. మను షులుగా మిగలనివారు ఎంతగా రెచ్చగొడుతు న్నా వారింకా మనుషులుగా ఉండటానికే ప్ర యత్నం చేస్తున్నారు. చాలా సంతోషం కలుగు తూంది నాకు" అన్నాడు. "రావ్..." అన్నా డు.

"చెప్పు గంగాధర్"

"నాకిప్పుడు సంగీతం వినాలనుంది. నీ మానసిక స్థితి ఎలా ఉందో"

"నీ ఇష్టం గంగాధర్"

"థ్యాంక్యూ రావ్"

తన ముందున్న స్విచ్ ఆన్ చేశాడు.

మెల్లగా మొదలైంది సంగీతం.

ఎవరి ప్రపంచంలోకి వారు జారిపోతున్నా రు. కారు ముందుకు పరిగెత్తుతూనే ఉంది. చల్లటిగాలి మేనును తాకుతుంది. రోడ్లమీద అక్కడక్కడా ఓ మనిషి కనిపిస్తూన్నాడు. పిల్ల లు ఏ మూలనుండి మృత్యువు రాగలదో అనే ఆలోచన లేకుండా అమాయకంగా ఆడు కుంటున్నారు. అప్పుడప్పుడో వాహనం పరిగె డుతూంది.

తాము ఎటు ప్రయాణం చేస్తున్నామా అనే ఆలోచన వచ్చింది గంగాధర్‌కి. ముందుకా? వెనక్కా?

నగరం నుండి చూస్తే ఓ జవాబు... తమ ఊరునుండి చూస్తే ఇంకో జవాబు లభిస్తుంది. మొత్తంమీద ప్రయాణం మాత్రం జరుగుతూ ఉంది.

కారు అలా వెళుతూ... క్రమంగా వేగం తగ్గిపోయి... ఆగిపోయింది.

తిరిగి అందరూ ఏమైందోననే ఆందోళనతో చూశారు.

"ఏంకాలేదు... మనం సిటీ లిమిట్స్ దాటాం" అని కారుదిగాడు...సిగరెట్ వెలి గించుకొని గాల్లోకి పొగ ఊదాడు.

తాము చాలాదూరం ప్రయాణం చేసి వచ్చి నట్లనిపించింది. వృత్తిరీత్యా, ప్రవృత్తిరీత్యా తను ఎంతెంతోదూరం ప్రయాణం చేయటం జరిగింది. అయినా ఎప్పుడూ ఇలా అనిపించ లేదు.

స్వప్న కూడా కిందకు దిగింది. చల్లటిగాలి ఆ అమ్మాయి ముఖం మీదకు ముంగురుల్ని

కప్పుతూంది. ఆ అమ్మాయి వెనక్కి తిరిగి నగరాన్ని చూచింది. ఇప్పుడు కొంతవరకు నమ్మకం కలుగుతుంది. అయినా ఈ రేఖ ఏమిటి? ఈ రేఖకు ఆవల భద్రత లేకపోవటం ఏమిటి? ఈవల ఊపిరి పీల్చుకోవటం ఏమిటి?

రేపు ఈ సరిహద్దులన్నీ చెరిగిపోతాయా?

అప్పుడేం జరుగుతుంది?

ఎక్కడా భద్రతా ఉండదా?

లేదా అన్నిచోట్లా భద్రత ఉంటుందా? ఏమైనా జరగవచ్చు.

"బయలుదేరదామా స్వప్నా" అన్నాడు.

తలూపింది.

"అయితే చూడమ్మా... ఫోన్ చేసి చెప్పాలి. మా పాప వాళ్లు ఎదురుచూస్తుంటారు. ఫోన్ దొరికే చోటు కనిపిస్తే చెప్పు" అన్నాడు.

వారికి పెద్ద శ్రమలేకుండానే ఓ పెట్రోల్ బంక్ ఎదురైంది.

గంగాధర్ దిగి వెళ్ళాడు.

కొద్దిసేపటి తర్వాత రింగయింది...

"హల్లో"

"నేను డాడీ" అంది సంతోషంగా.

"ఏంచేస్తున్నావమ్మా"

"మీ ఫోన్‌కోసం చూస్తున్నా డాడీ... ఒక్క క్షణం కూడా ఇక్కడనుండి కదలలేదు"

"అలాగా... అమ్మ ఏంచేస్తోంది..."

"దిగులుగా కూర్చుంది - మీరెక్కడినుంచి"

"సిటీ లిమిట్స్‌దాటాం. ఓ పెట్రోలు బంక్ నుంచి మాట్లాడుతున్నా"

"ఏం గొడవలు కాలేదుగా"

"చిన్నచిన్న గొడవలు. మొత్తంమీద పెద్ద ఇబ్బంది పడలేదు"

"కాదు డాడీ... పాతబస్తీలో పరిస్థితి మరీ చేతులుదాటిపోయిందంటున్నారు. ఇంక సైన్యం దిగుతుంది. రెండుమూడు రోజులదాకా రిలాక్సేషన్ ఇవ్వరంట"

"అలాగా?"

"మీరు చాలా లక్కీడాడీ" అంది.

"అవునమ్మా"

"మళ్ళీ మీరు ఎప్పుడు వస్తారు?"

"చెప్పలేనమ్మా, సాధ్యమైనంత త్వరలో వస్తాను"

"అలానే డాడీ... మాకేం భయంలేదు. మీరు అన్నిపనులూ అయ్యాక రండి"

"అలాగే"

"అంతేకాదు డాడీ మీరొచ్చేవరకూ నేను హారర్ మూవీస్ చూడను. థ్రిల్లర్స్ చదవను"

"మరేం చదువుతావ్?"

"మీ 'రాక్' ఉందిగా ఆ బుక్స్ అన్నీ వరసగా చదివేస్తా"

"నిజంగానా?"

"ప్రామిస్ డాడీ"

"మీ అమ్మకి కూడా ఓసారి ఫోన్ ఇవ్వు"

"అలాగే డాడీ"

"నేనే మాట్లాడుతున్నా. మేం క్షేమంగా చేరాం, రెండుమూడు రోజుల్లో వస్తాను.

"జాగ్రత్తగా ఉండండి, మరి ఉంటాను" అని వచ్చేశాడు.

తిరిగి ప్రయాణం ఆరంభం అయింది.



సాంబశివరావ్ ఆలోచనల్లోకి జారిపాయాడు.

తను చిన్నతనంలో ఏంకావాలని కలలుగన్నాడు? ఇప్పుడు ఎలా మారిపోయాడు? తన జీవితంలో వివిధ సందర్భాలలో విభిన్నమైన ఆలోచనలు తనకి వచ్చాయి. వాటికి తగినరీతిలో తన జీవితాన్ని మలుచుకుంటూ వచ్చా

డు. తన ఆశలు కొన్నితీరాయి. మరికొన్ని కొత్తవి వచ్చి చేరాయి. ఒక్కో సందర్భం తనను కదిలించినపుడు భావోద్వేగంలోకి జారిపోయా డుతను.

తనకు ఏదేదో చేయాలనిపించేది...

ఇప్పుడు తన జీవితం నేర్పిందేమిటి?

ఈ జీవితం శాశ్వతం కాదు ఏక్షణాన ఏ మలుపులు తిరుగుండో ఎవరూ ఊహించలే రు. అది మనుషులు వల్లకావచ్చు. ప్రకృతివల్ల కావచ్చు.

ఏదిఏమైనా చేయాలన్నది చేయటమే మంచిది.

సుదీర్ఘకాలం వాయిదా వేయటంవలన ఒక్కోసారి తామనుకున్నది తాము చేయాలని అనిపించకపోవచ్చు. చేయలేకపోవచ్చు. అంతేకాదు... ఇదివరకు ఎవరినో సాధించటాని కి ఏదో చేయాలనిపించింది. ఇప్పుడలా కాదు. ఎవరినో సాధించడంకోసం అనికాదు. అలా అని ఎవరినో ఉద్ధరించటానికి కూడా కాదు.

తనకోసం తాను చేస్తాడు. తను జన్మించిన ఊరుకోసం చేస్తాడు. చేయాలి.

అది ఏరకంగా వుండాలి. ఎలా వుంటే బాగుంటుంది. ఎంత త్వరగా అయితే బాగుంటుంది. ఈ ఆలోచనలన్నీ ఇకముందు కార్యరూపం ధరించాలి.

గంగాధర్ నిర్విరామంగా నడుపుతున్నాడు. మధ్యలో తను నడుపుతానన్నా వినలేదు. చీక టిలో వారి ప్రయాణం అలా సాగుతూ వచ్చింది...

సాంబశివరావ్‌కి ఎందుకో ఓ నమ్మకం...

తను మరణం గురించి చాలా కథలు విన్నాడు. ప్రాణం ఒక్కోసారి వెనక్కి తిరిగి వస్తుందట. తమ చిన్నతనంలో వంద సంవత్స రాలు పైబడిన ఓ ముసలమ్మ ఉండేది. ఆమె దాదాపుగా చచ్చిపోయిందని బయటపడేశారు. ఏర్పాట్లు చేసుకుంటుండగా ఆమె బతికింది...

తను యమధర్మరాజుని చూశానని ఆమె చెప్పిందంటారు- "ఈమెనెందుకు తీసుకొచ్చా రు. ఈమెకింకా సమయం వుంది" అన్నా డంట.

అందుకే అలా తన నాన్న కూడా తిరిగివస్తే ఎంత బాగుంటుంది. తమ ఇంటికి వెళ్లగానే కారులోనుండి లేచి 'నే వచ్చేశా తులసమ్మా' అంటూ పలకరించితే ఎంత బాగుంటుంది.

అయినా తన బిడ్డను తన చేతుల్తో కప్పివే యటం తనవల్ల కాదని ఆ బాధ్యత తనే తీసుకొన్నాడు. ఇప్పుడెవరు తీసుకుంటారు?

అప్పటివరకూ గుండెలోతుల్లో దాగివున్న ఉద్వేగపు ప్రకంపనాలు మెల్లగా కదిలాయి. అవును. ఇంకెంతదూరమో లేదు. మరికొద్దిసే పట్లో తమ ఊరు వస్తుంది. కారు ఇంటి ముందు ఆగగానే ఆ శబ్దానికి పరుగు పరు గున అమ్మ వస్తుంది. కారులోనుండి దిగుతాడే మోనని చూస్తుంది.

అదేం జరగదు...

మెల్లగా అయన్ని కిందకు దించుతారు...

"ఏమైందిరా... సాంబయ్యా... మీ నాయనకి ఏమైందిరా" అంటూ తనని పట్టుకుని ఊపే స్తుంది...

తనేం చెప్పగలడు...

"ఒరేయ్... ఎందుకు తీసుకెళ్లావ్... ఎలా తీసుకువెళ్లావ్... ఇప్పుడిలా తీసుకొస్తున్నావా? ఇదేం నాయంరా?" అంటూ కుప్పకూలిపో తుంది...

అప్పుడు... ఆ క్షణం...

రావ్ కళ్లవెంట జలజలమంటూ నీళ్లురాలి తండ్రి నుదుటిమీద పడ్డాయి... ఆ నుదుటిమీ దే స్వేదబిందువులు మెరుస్తుండేవి... చీకటి... ఊరంతా చీకటి... చెట్లు గాలికి తమ కొమ్మల్ని మెల్లగా కదుపుతున్నాయి. ఎక్కడో కుక్కలు అరుస్తున్నాయి. సులోచన దారిచూపుతుండగా గంగాధర్ కారు పోనిస్తున్నాడు.

ఇంటిముందు కారాగింది.





''ఎవరూ...'' అంటూ లేచింది తులసమ్మ.

''ఒరే అబ్బాయి... ఎవరో చూడు'' అంటూ పనికుర్రాడిని లేపుతూంది.

కారు డోర్ తెరుచుకుంది.

కుర్రాడు లేచేటట్లు లేడు.

తనే ఓపిక చేసుకుని- ''ఎవరది... వస్తన్నా'' అంది.

వణుకుతున్న కంఠంతో...

''మేం అత్తయ్యా'' అంది సులోచన.

స్వప్న మౌనంగా వచ్చి నాయనమ్మను అల్లుకుపోయింది.

ఆ రాత్రంతా చావిట్లో గేదెలు అల్లాడిపోయాయి.

వాటికి ఏదో జరిగిపోయిందని తెలిసింది...

అవి తమ పలుపు తెంచుకోవటానికి విశ్వప్రయత్నం చేశాయి. అవి తమ కట్టు గొయ్యచుట్టూ తిరుగుతూనే వున్నాయి...

తమ భూషయ్యగారికేసి చూపిస్తూ 'అంబా' అంటూ అరుస్తూనే వున్నాయి.

ఆ పశువుల కళ్లలోనూ తడిమెరుస్తోంది. వాటికి నోరులేదు. తమ బాధను వ్యక్తంచేసే తీరు తెలియదు. అయినా అవి తెల్లవారేవరకూ ఒక్క గడ్డిపరక ముట్టలేదు. తెల్లవారాక పలుపు మెడకు చేసిన గాయం స్పష్టంగా కనిపించింది.

★ ★ ★

తెల్లవారింది.

అప్పటికే గాలి ఊరంతా చుట్టివేసింది.

'భూషయ్య చచ్చిపోయాడంట'.

మావ పోయాడంట.

'భూషయ్యగారు పోయారుట'.

నిజమా?

ఎట్లా జరిగిందిది?

నిన్నటిదాకా బాగున్నాడు. ఇన్ని సంవత్సరాలు కష్టపడ్డాడు. ఇప్పుడు పిల్లవాడు అందివచ్చాడు. అందులోనూ బాగా కలిసొచ్చింది. ఇన్నేళ్లకిగాను తన బిడ్డ దగ్గరికెళ్లాడు. మరిప్పుడు ఇలా రావటం ఏమిటి?

అందరూ కదిలివచ్చారు.

పిల్లలు వచ్చారు. పెద్దాళ్లు వచ్చారు. లేవలేక మంచాల్లో ఉండిపోయినవారు సైతం భూషయ్యని చూడటానికి ఆరాటపడ్డారు. వారిని మోసుకొచ్చారు. అందరూ ఆ మనిషిని దర్శనం చేసుకున్నారు.

వారందరికీ ఆ క్షణమే భూషయ్యగారిలోని గొప్పదనం ఏమిటో అర్థం అయింది.

''భూషయ్య మానిక్యం'' అన్నారెవరో.

''మా అయ్యకోసం గొడ్లు అల్లాడిపోతున్నాయి ఎప్పుడొత్తాడా అనుకుంటుంటే ఇట్టా వచ్చాడు''

''ఆ మనిషికి కోపం తెలుసా? ఎవరినన్నా ఎప్పుడన్నా ఏమైనా అన్నాడా? తను తిన్నాడో తినలేదో తెలియదు. తన కష్టం చెప్పడు. సుఖం చెప్పడు. తననేమన్నా పట్టించుకోడు. ఇలాంటి మనిషి మళ్లీ పుడతాడా...''

తులసమ్మ ఏడుస్తోంది...

సాంబయ్య ఏడుస్తున్నాడు...

సులోచనా... స్వప్నా ఏడుస్తున్నారు...

సహజమే...

మరి ఊరంతా కంటతడి పెట్టడం ఏమిటి?

మూగజీవాలు తల్లడిల్లిపోవటం ఏమిటి?

ఎవరితను?

మహాత్ముడా?

కాదు.

నాయకుడా?

కాదు బాబూ... కానేకాదు.

రచయిత... కవా... కళాకారుడా...?

అయ్యో... ఎవరూ కాదు.

మరింకెవరు?

ఆయన భూషయ్య.

ఏమిటితని గొప్పదనం?

ఏమీలేదు.

ఎందుకింతగా తపిస్తున్నారు...

ఏమిటింతగా రోదిస్తున్నారు.

ఏమిటింతటి ఔన్నత్యం ఏముందాయనలో...

ఏమీలేదు...

ఉషోదయాన లేచేవాడు...

మట్టివాసన తెలిసినవాడు...

ఎండలో... వానలో... చలిలో శరీరాన్ని వంచినవాడు...

భూమిని నమ్మినవాడు, భూమికై పెరిగినవాడు.

అతని గొప్పదనం కాదు వీరందరిని కదిలించింది.

అతని సామాన్యత్వం...

అతను మనుషుల్ని ప్రేమించాడు.

పశువుల్ని ప్రేమించాడు.

మట్టినీ, నీటినీ ప్రేమించాడు.

తన స్వేదబిందువుల విత్తనాలు చల్లి పంటలు పండించాడు.

అతనికి మిగిలిందేమీలేదు...

అనంతమైన తృప్తి తప్ప...

ఆయనలోని మంచినీ, చెడునూ అర్థం చేసుకోవాలంటే...

ప్రతిమనిషీ భూషయ్య కావాలి...

భూషయ్యను కూర్చోబెట్టి స్నానం చేయించారు.

తర్వాత 'యాత్ర' మొదలైంది.

అది అలా సాగుతూవెళ్లింది.

ఆయన ప్రేమించిన... స్వేదం చిందించిన ఆయన పొలందగ్గర ఆగిపోయింది...

గంగాధర్ ఉద్వేగంతో చూస్తున్నాడు.

రావ్ పిలిచాడు.

"నాన్న బూడిదగా మారటం నా కిష్టంలేదు"

"మరేం చేద్దాం?"

"ఈ పొలం హృదయంలో... ఈ మట్టితోపాటు ఆయన్ని పదిలపరుచుకుందాం"

"నీ ఇష్టం"

అక్కడ గోతిని తవ్వుతున్నారు.

అది సంప్రదాయమో కాదో ఎవరూ ఆలోచించలా ఆ గోతిలో ఆయన్ని పడుకోపెట్టాక...

మట్టి ఆయన్ని స్పృశించింది...

మట్టి ఆయన్ని కప్పేసింది.

మనుషులందరూ దీనవదనాల్తో చూస్తుండగా...

రావ్ తలెత్తాడు...

ఆ కళ్లు వర్షించటంలేదు.

"ఇప్పుడా పొలం భూషయ్యగారిది...

ఇది నాది కాదు...

ఆయన జీవితంలో ఎందుకోసం ఆరాటపడ్డాడో...

ఆయన కలలేమిటో నేను చెప్పలేను...

ఈ పొలాన్ని ఆయన జ్ఞాపక చిహ్నంగా.

ఈ ఊరికి అంకితం చేస్తున్నాను.

అందులో ఏంచేయాలో...

ఈ ఊరికి ఏంచేయాలో త్వరలోనే...

మీ అందరికీ చెబుతాను"

తిరిగి అందరూ విషాదవదనాలతో వెనక్కి తిరిగారు.

రావ్ అలా కూర్చుండిపోయాడు.

గంగాధర్ చాలాసేపటి తర్వాత-

కదిలించాడు...

"సాంబశివరావ్... పద... అమ్మ ఎదురుచూస్తుంటుంది"

★







# రాలిన స్వప్నంపై చతుర సమీక్షలు

జూన్ నెల 'చతుర'లో ప్రచురితమైన యార్లగడ్డ రాఘవేంద్రరావు నవల 'రాలిన స్వప్నం'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## రాలిపోయిన గులాబి

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

సునిశితమైన శైలిలో అమానుషత్వానికి బలైపోయిన మానవతని ఒక 'రాలిన స్వప్నం'గా సృష్టించిన రాఘవేంద్రరావుగారి నవలను అందించి, పాఠక హృదయాలను కదిలించిన చతురకు అభినందనలు. ప్రేమ ఒక మంచి గులాబి. ప్రేమ విలువ తెలియని అమానుష ప్రపంచంలో, గులాబి-పరిమళం, కోమలత్వం ఏం విలువ సంతరించుకోగలదు. అది అలా రాలిపోవాలితప్ప రాలిపోయిన తర్వాత దాని విలువ గుర్తించినా, ఆ గుర్తింపు కేవలం స్వప్నం మాత్రమే.

కథానాయకుడు జీవన్, అతని ప్రేయసి పూర్ణిమలను పాఠకలోకానికి పరిచయం చేసిన రాఘవేంద్రరావుగారు ప్రేమపై నిశితమైన అభిప్రాయాల్ని జీవన్ పాత్రద్వారా విశ్లేషించి చెప్పారు. "ప్రేమంటే ఇదీ అని చెప్పలేను, నాకు ప్రేమించడం తెలుసు. ప్రేమను అనుభూతి పొందడం తెలుసు" అని నిర్వచనం పలికారు. విషాదమయమైన జీవన్ గత జీవితాన్ని మరపింపజేయగల్గింది ప్రేమ. తన తల్లి అవినీతి జీవితం, అన్నల దౌర్జన్య జీవితం, తండ్రి స్వార్థపూరిత జీవితం వీటినుండి దూరంగా పారిపోయేలా చేసి, జీవన్ జీవితంలో మల్లెలు పూయించగల్గింది పూర్ణిమ ప్రేమ. వేదనలోనూ, వేడుకలోనూ, పాలు పంచుకోవాలని, బతుకంతా రంగుల స్వప్నంగా, అందాల హరివిల్లుగా తీర్చిదిద్దుకోవాలని ఆ యువ జంట కలలు కన్నారు.

పూర్ణిమ తల్లిదండ్రులు, సోదరులు, సాంఘిక, నైతిక విలువల్ని ఉల్లంఘించిన చరిత్రహీనులే అయినా, కుటుంబ పరువు అన్న హిపోక్రసీతో, జీవన్, పూర్ణిమల ప్రేమను సహించలేక నరరూప రాక్షసులవడం సహించరానిది. సంఘంలో ఇలాంటి కథలెన్నో చరిత్రను పునరావృతం చేస్తూనేవున్నాయి. నాగభూషణం హిపోక్రసీ, ఆ ప్రేమికుల హృదయాలలో నరకాన్ని సృష్టించింది.

పెళ్లిచేసుకున్న తర్వాత భర్త వదిలేసి మరో పెళ్లి చేసుకుంటే, పిల్లల్ని పెంచుకునే నెపంతో ఒక ఆడది పరపురుషుణ్ని ఆశ్రయించి, అతని పొందు కోరుకోవచ్చా? ఈ విషయాన్ని ప్రపంచం అతి తేలికగా తీసుకొంటుందా? చివరకు పిల్లలు తల్లి చేసిన పనిని సమర్థించుకోగలరా? అదే జరిగింది పూర్ణిమ తల్లి విషయంలో. నాగభూషణం, తల్లిదండ్రుల చెడునడతలవల్ల చితికిపోయి, అల్లరిచిల్లరగా తిరుగుతూ, నిజమైన జీవితం చేజేతులా వదలుకొని క్రూరంగా మారిన సమయంలో చెల్లెలు ఒక కులంకానివాణ్ని ప్రేమిస్తే కుటుంబ పరువు పోతుందని ఆమె జీవితాన్ని చిన్నాభిన్నం చేయడం ఎంత అమానుషత్వం.

విచ్చలవిడి నాగభూషణానికి, జీవన్ కులం, అతని పూర్వజీవితం నచ్చకపోవడం, అతన్ని పూర్ణిమ ప్రేమించి పెళ్లిచేసుకోవడం కుటుంబ ప్రతిష్టకే తలవంపులనుకోవడం, అమానుషత్వంకాక మరేమిటి. జీవన్‌పై తప్పుడు కేసు బనాయించి, అతన్ని జైలు శిక్షకు గురిచేసి, పూర్ణిమను బంధించి ఆమెకు గర్భస్రావం జరిగేలా హింసించడం, ఆ తర్వాత ఆమె ఆత్మహ



త్యకు కారకుడవడం. అతని రాక్షసత్వానికి నిదర్శనం.

పూర్ణిమ ఆత్మహత్య చేసుకున్న సమయంలో, జీవన్ హృదయం పడ్డ ఆరాటం, ఇంకా సమాజంలో మిగిలిపోయిన మానవత్వానికి ఉదాహరణ. హితుడుగా జీవన్, పూర్ణిమల ప్రేమను 'అతను' పరీక్షించిన విధానం, ఆ తర్వాత అతనందించిన చేయూత నిజమైన స్నేహానికి గీటురాయి. ప్రేమికులకు ఒక సందేశాన్ని అందించారు రచయిత. పరువుచాటున దాగివున్న అమానుషత్వాన్ని ఎంతో యదార్థంగా వర్ణించారు.

**-శమంతకమణి,**
సి.మల్లవరం.

## ప్రేమకు నిర్వచనం?

***(ద్వితీయ బహుమతి రు. 75/-లు పొందిన సమీక్ష)***

**మా**నవ జీవితపు విలువలను విశ్లేషించడంలో - మరో మెట్టు పైకెదిగింది జూన్ 'చతుర' నవల. ప్రేమకు నిర్వచనం చెప్పమన్న స్నేహితుడికి - 'అదొక అనుభవంనుంచొచ్చే అనుభూతి, రెండు హృదయాల స్పందన నుంచీ పుట్టే ఆకర్షణ' అన్న జీవన్ జవాబుతో 'రాలిన స్వప్నం' మొదలవుతుంది.

ప్రేమించడం తప్పుకాదు. అది జీవితంలో ఒక భాగం మాత్రమే, కాని ప్రేమ పర్యవసానం జీవితాలను నాశనం చేసేదిగా వుండకూడదు. జీవితాలను అంతంచేసే ప్రేమ - అర్థంలేని అనవసర ఘట్టం. ప్రేమనే 'శక్తి'కి లొంగిపోయి - మొండిగా పరిస్థితులను ఎదుర్కొనడానికి ప్రయత్నిస్తే - ఆటుపోట్లకు తట్టుకోలేక - మునిగిపోయే ప్రమాదముంటుందని హెచ్చరించే విధంగా నవల నడిచింది.

పగ అనేది మనుషులను ఎంత రాక్షసంగా ప్రవర్తించేట్లు చేస్తుందో, ఆవేశం ఆలోచనను చంపితే - మనుషులు ఎంత క్రూరంగా కసితీర్చుకోగలరో నాగభూషణం, కరుణాకరం పాత్రలద్వారా చూపించారు రచయిత.

శీలం లేని తల్లి ప్రవర్తన - పిల్లల జీవితాలకు ఎంత అపహాస్యాన్ని ఆపాదించి పెట్టగలదో, ఆ తల్లి కడుపున పుట్టినా, సంస్కారవంతురాలైన పూర్ణిమ ఆ కారణంవల్ల - నిస్సహాయురాలై తన అనే మనిషికోసం, అనురాగం పంచియిచ్చే తోడుకోసం, ఆ నరకంనుంచి తప్పించుకోవడానికి పాకులాడిన వైనం - పాఠకుల హృదయాల్ని కదిలించకమానదు. అదే విధంగా క్రమశిక్షణలేని, నిర్భయత్వంతో పెరిగిన - నాగభూషణం, కరుణాకరంల నైతిక ప్రవర్తనారాహిత్యానికి కూడా - భార్యా, పిల్లలను వదిలి చిన్నిల్లు వెతుక్కున్న తండ్రి, తనదోవన తను పెడదారులు తొక్కే తల్లి కారకులైన విధం చెప్పడంద్వారా... సత్ప్రవర్తనలేని జీవితాలు ఎంత దుర్భరంగా వుంటాయో చెప్పడానికి కృషిచేశారు రచయిత.

స్నేహితుడనేవాడు హితం కోరేవాడుగా వుంటాడనే నిజం - పూర్ణిమ, జీవన్‌లపట్ల నిజమయినా, తనకుమాలిన ధర్మం చేసి 'అతడు' ఎంత అశాంతి పాలయ్యాడో కూడా గమనించవలసిన విషయం.

ప్రేమజంట అయిన పూర్ణిమ, జీవన్‌లు - అలా పారిపోయి పెళ్లి చేసుకోవడం, పిరికితనంతో అజ్ఞాతంగా జీవించడం సమంజసంగా లేకపోయినా, ఆ పరిస్థితికి అదేమార్గంగా తోచిందేమో! తోడబుట్టిన అన్నల దుర్మార్గానికి, ప్రేమించిన జీవన్ నిస్సహాయతకు బలై - చివరికి పురుషాధిక్యత వత్తిడికి తట్టుకోలేక వూపిరి వదిలిన పూర్ణిమ జీవితమొక 'రాలిన స్వప్నం'గా స్పష్టంచేసిన రచయిత అభినందనీయులు.

**-బడబాగ్ని అరుణకుమారి,**
గజపతినగరం.

## ప్రేమఫలం

***(తృతీయ బహుమతి రు. 50/-లు పొందిన సమీక్ష)***

'ప్రేమ'ను కేంద్రబిందువుగా చేసుకొని ప్రపంచవ్యాప్తంగా పుంఖానుపుంఖాలుగా రచనలు వెలువడినాయి, వెలువడుతూనేవుంటాయి కూడా. ప్రేమకున్న శక్తి అలాంటిదిమరి! అది అనాది, అది అనంతం! దాన్నెవరూ సమగ్రంగా నిర్వచించలేకపోయారు. బహుశా నిర్వచించలేరుకూడా. కారణం అది అమూర్తపదార్థం, అనిర్వచనీయమైన దివ్యానుభూతి!

'రాలిన స్వప్నం' కూడా ప్రేమను ఆధారం





చేసుకొని సాగిన రచనే. ఇందులో కూడా రచయిత, ప్రేమను తనదైన బాణీలో నిర్వచించడానికి ప్రయత్నించారు. చివరికి భూమి గుండ్రంగా వుందన్నట్లే - ప్రేమ అనేది ఒక మధురభావన - అంటూ మళ్లీ అందరిదారినే నడిచారు, తప్పదుమరి. ఈ విషయంలో ఎదురీత ఎవరివల్లా కాదు.

విషయం చిన్నదే అయినప్పటికీ, వివరించిన తీరు ఆసక్తికరంగా వుండి, ఆసాంతం ఏకబిగిన చదివింపజేస్తుందీ నవల. జీవన్, పూర్ణిమలు ఇద్దరూ భ్రష్టయోగులే. ఇద్దరూ జీవితమ్మీద విరక్తి పెంచుకున్న ఒకే నావ ప్రయాణీకులు!

జీవన్ ఒక సాధారణ కుటుంబంనుండి వచ్చినవాడు. ఆశలూ, ఆశయాలూ పెంచుకొని ఎదగడానికి అవకాశంలేని కుటుంబ పరిస్థితి అతనిది. ముందే ముక్కిడి, ఆపైన పడిశమన్నట్లు జీవితంలో ప్రతి వ్యక్తీ కలలుకనే పెళ్లి అతనిపట్ల ఒక భయంకరమైన పీడ కలలా మారుతుంది. ఆ షాక్‌నుండి తట్టుకోవడానికి, వరదలో కొట్టుకుపోయేవాడు, తుంగమొక్కను పట్టుకున్నట్లు ఓదార్పుకోసం ఒక వివాహిత స్త్రీతో సంబంధం పెట్టుకుంటాడు. కానీ అదీ మఖలో పుట్టి పుబ్బలో మాడిపోతుంది. దాంతో ఒకరకమైన వుదాసీనత ఆవరించి జీవశ్ఛవంలా బతుకుతూవుంటాడు.

పూర్ణిమ పరిస్థితి కుడితిలోపడ్డ ఎలుకలా వుంటుంది. తండ్రి 'చిన్నిల్లు' పెట్టుకొని తమను గాలికి వదిలేయడం, తల్లి అక్రమ సంబంధం, అన్నల బలాదూర్‌లు - టోటల్‌గా ఒకరకమైన అస్తవ్యస్తత నిండిన కుటుంబంలో వూదరపెట్టినట్లున్న వాతావరణంలో వూపిరాడక, బాహ్యప్రపంచంలో స్వేచ్ఛావాయువులు పీల్చాలని ఆరాటపడుతుంది. అలాంటి స్థితిలో ఆమెకు జీవన్‌లో తన బంగారు భవిష్యత్తు కన్పించి, పంజరంవీడిన పక్షిలా రివ్వున అతనితో కలిసి ఎగిరిపోతుంది. కానీ అక్కడితో సమస్య సమసిపోలేదు. అసలు కష్టాలు అప్పుడే మొదలైనాయి.

శ్రీరంగంనీతులు చెప్పే తమ పెద్దన్న నాగభూషణం, ఆ ప్రేమికుల జీవనకలశంలో కాలకూట విషయం కక్కుతాడు. పూర్ణిమ ఆత్మహత్యతోకానీ అతని దుష్టాత్మ శాంతించదు! జీవన్ మళ్లీ ఏకాకి అయిపోయాడు. మళ్లీ అంధకార బంధురమౌతుంది అతని జీవితం. పాఠకుల హృదయాలు బరువెక్కుతాయి నవల పూర్తి అయ్యేసరికి.

ఈ నవలలో కాస్త ఎబ్బెట్టుగా కన్పించే పాత్ర జీవన్ మిత్రుడిది. పూర్ణిమ వాళ్ల కుటుంబంనుండి అన్ని అవమానాలు ఎదురైనా, దెబ్బలు తిన్నా, వాళ్లిద్దర్నీ కలపడానికి అతను పడే తపన అతి అన్పించుతుంది. నిజంగా అలాంటి నిస్వార్థ త్యాగపురుషులు వుంటారా? అనే అనుమానమొస్తుంది.

ఇతివృత్తం మనసుకు సంబంధించినది కాబట్టి, మనస్తత్వశాస్త్ర విషయాల్ని కూడా రచయిత సమయానుసారం వివరించడం బావుంది. మొత్తానికి ఒక మంచి నవల చదివామన్న తృప్తి మిగిలించినందులకు రచయిత అభినందనీయులు.

**-మహబూబ్‌కమల్,**
న్యూపాల్వంచ.

# అమరప్రేమ

***(రు. 25/-లు పొందిన సమీక్ష)***

ప్రస్తుతం సాహిత్యంలో వస్తున్న దుష్పరిణామాలకు అతీతంగా వాస్తవ జీవితాలను ప్రతిబింబింపచేసే నవలాకుసుమాలను 'చతుర' అందిస్తుందనడానికి యార్లగడ్డ రాఘవేంద్రరావుగారి 'రాలిన స్వప్నం' చక్కని దృష్టాంతం. ప్రేమ వివాహాలపట్ల పరిణితిలేని పెద్దల సంకుచితవైఖరి రచయిత ఈ నవలలో చక్కగా వివరించారు.

రచయిత ఎన్నుకొన్న ఇతివృత్తం ఇదివరకు ఎన్నో సినిమాలు, నవలలో నానినదే అయినా ప్రేమ ఎప్పుడూ వినూత్నమైనది! అజరామరమైనది! అందులోనూ రచయిత తను సృష్టించిన పాత్రలైన జీవన్, పూర్ణిమల మధ్య ప్రేమను అన్ని కోణాలనుండి పరిశీలించి విశ్లేషిస్తూ, హేతుబద్ధత కలిగిన చర్చలను క్రోడీకరిస్తూ, వారి స్నేహితుడిగా సలహా సహకారాలనందిస్తూ, ప్రేమలోని లోటుపాట్లను ఎత్తిచూపుతూ పాఠకులు తమనుతాము ఐడెంటిఫై చేసు

కునేందుకు దోహదపడ్డారు.

రచయిత ప్రేమకు వ్యక్తిత్వం, మానసిక ఎదుగుదల, ఆలోచన ముఖ్యాంశాలుగా గుర్తు చేస్తూ జీవన్, పూర్ణిమలకు వాటిని ఆపాదించారు. జీవన్‌కు కలిగిన చేదు అనుభవాలు, పూర్ణిమ ప్రేమరాహిత్యంలో మగ్గి తన వేదనను చల్లార్చే తోడుకోసం పరితపించడం, ఒకే ఇంట్లో ఉండడంవల్ల ఒకరినొకరు అర్థంచేసుకోవడం జీవన్, పూర్ణిమల మధ్య గాఢమైన ప్రేమకు కారణమయ్యాయి. ఇటువంటి ప్రేమ ఈనాటి యువతీయువకుల్లో అరుదు అనే చెప్పాలి.

పసితనంలో తల్లిదండ్రుల సవ్యమైన పెంపకం, ప్రేమ లభించకుంటే విచ్చలవిడితనానికి అలవాటుపడి, సక్రమమైన ఆలోచన లోపించి నిరంతరం ఉద్రేకానికి లోనయ్యే వ్యక్తులుగా తయారవుతారనడానికి నాగభూషణం పాత్ర చక్కని ఉదాహరణ. చెల్లెలు పూర్ణిమ, స్నేహితుడు జీవన్‌లను క్రూరంగా విడదీసి, పూర్ణిమ ఆత్మాహుతికి కారణమవడం ద్వారా ఇటువంటి వ్యక్తులు దౌర్జన్యప్రవృత్తితో జీవితాలనెంతగా నాశనం చేస్తారో, తద్వారా తామెంత పతనమవుతారో అర్థంచేసుకోవచ్చు. తల్లిదండ్రుల నైతిక ప్రవర్తన సరిగా లేకుంటే దాని ప్రభావంతో కుమారుల జీవితాలు తెగిన గాలిపటాలు అవుతాయి అని నాగభూషణం 'తల్లి' పాత్ర పాఠకులను హెచ్చరించింది.

ఊహ తెలిసినప్పటినుండి పూర్ణిమ జీవితమంతా విషాదంగానే గడిచి, కుటుంబ పరిస్థితులవల్ల కలిగిన సంఘర్షణలోంచి వయసుకు మించిన మానసిక ఎదుగుదల కలిగింది. ఇది ఈనాటి యువతీయువకులు అలవర్చుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

ప్రేమవివాహాలకు అడుగడుగునా అడ్డుతగిలే పెద్దలున్నంతకాలం, అవాంతరాలను ఎదుర్కొనే ధైర్యం, ప్రయోజకత్వం, వ్యక్తిత్వం, ముందుచూపు, అవగాహన, స్వచ్ఛమైన మనసు కావాలనీ, అప్పుడే ప్రేమను జీవితం చివరికంటా' నిలుపుకోగలరనీ చెప్పి ప్రేమికులను జాగృతం చేశాడని చెప్పొచ్చు. నవలలో ప్రేమ గురించిన చర్చలు, అభిప్రాయాలు పాఠకులను ఆలోచింపచేసేవిగా ఉన్నాయి. స్త్రీ, పురుషుల ప్రేమలో తలెత్తే సమస్యల గురించి కూలంకుషంగా చర్చించిన రచయిత అభినందనీయుడు.

-బి.రమేష్,
మఖ్జీపల్లిగూడెం.

## మరో జోడింపు

**(రు. 25/-లు పొందిన సమీక్ష)**

జూన్ చతుర నవల 'రాలిన స్వప్నం' యుగయుగాల విషాద ప్రేమకథలకు మరో జోడింపు. ఒక లైలా-మజ్నూ, మరో హీర్-రాంఝా లాంటి ప్రేమికుల జాబితాలోకెక్కేలా పూర్ణిమ-జీవన్‌ల ప్రేమగాథతను ప్రదర్శించారు రచయిత.

శబ్దాడంబరం అధికంగా ఉన్నప్పటికీ చదివించే శైలి రచనకి ప్రాణంపోసింది. భాషకు రచయిత చాలా ప్రాముఖ్యతనిచ్చారని పించింది. అయితే 'నేను' అంటూ ఉత్తమ పురుషలో చెప్పిన కథనం వినుగుపుట్టించింది. ఆ రీతి కథనం ఈ రచనకు ఏమాత్రం సరిపోలేదు.

జీవన్ మిత్రుడిగా 'నేను' పాత్రను ఎంతో ఉదాత్తంగా తీర్చిదిద్దారు రచయిత. కాని లౌకికమైన ముందుచూపునుమాత్రం ప్రదర్శింపలేకపోయారు. పూర్ణిమ, జీవన్‌లతో మొదటే వారిద్దరూ మేజర్లనీ, వివాహమాడబోతున్నారని డిక్లరేషన్ కోర్టులోనో, పోలీస్ అధికారులకో ఇవ్వడంగాని, ఎలాగూ విడాకులకేసు నడుస్తున్నది కాబట్టి జీవన్ ఆ లాయర్ని కన్సల్ట్‌చేసి, ముందుగానే అవసరమైన కాగితాలన్నీ సిద్ధంగా ఉంచుకోవడమో చేసివుంటే ప్రేమికులు బతికివుండేవారు. పాజిటివ్ దృక్పథం ఉండేది. బహుశా అమరప్రేమ భావన జీవించివున్న ప్రేమికులద్వారా తెప్పించలేమనుకున్నారేమో రచయిత. మరణించినవారిలోనే ప్రేమ జీవిస్తుందని చెప్పడమే రచయిత ఉద్దేశమయితే ఈ రచనలవల్ల ప్రయోజనమేమిటి? ప్రేమికుల తెగింపుకు, ధైర్యానికి విలువేమిటి? నాగభూషణంద్వారా మనుషుల్లోని మృగాలను చక్కగా చూడగలిగాము. మూర్తీభవించిన మంకుతనం, క్రౌర్యం మనిషిని





ఎంతకు దిగజారుస్తాయో బాగా స్పష్టంచేశారు.

ప్రేమ గుడ్డిదేకాదు; ప్రేమరాహిత్యం అమానుషమైందనికూడా ఈ నవల చదివేక అనిపించకపోదు. ప్రేమమాధుర్యంకన్నా ప్రేమవల్ల జనించిన అమానుషత్వం ఎక్కువగా ప్రదర్శితమైంది. ఇది ఒక హెచ్చరికా, లేక యువతకు నవలాప్రేమ భావనలను రేకెత్తించడమా అనేది స్పష్టంకాలేదు. 'ప్రేమ' యొక్క గొప్పతనాన్ని కీర్తించడమే ధ్యేయంగా ఈ రచన చేసినట్లు తోస్తుంది. ఇందులో సందేశం లేకపోగా సామాజిక ప్రయోజనం అసలే మృగ్యం.

అయితే స్నేహపు గాఢత, ఔన్నత్యం మాత్రం బాగా ప్రకటితమైనాయి. మనుషుల తత్వవిశ్లేషణను సాగదీయకుండా, క్లుప్తంగా, సూచ్యప్రాయంగా చెప్పివుంటే స్థాయిగా ఉండేది.

ఒక 'భారమైన కాలక్షేపపు' నవలగా మాత్రం దీనిని నిక్షేపంగా చదువుకోవచ్చును.

— పదాల లక్ష్మి,
హన్మకొండ

## సభ్యసమాజానికి సవాలు

*(రు. 25/-లు పొందిన సమీక్ష)*

ఒక నవలలోని సంఘటనలకు పాఠకుల మనస్సులు స్పందించి అందులోని పరిణామాల ...షయమై తీవ్రంగా ఆలోచింపజేయగల్గితే ...నిని ఉత్తమ నవలగానే పరిగణించవచ్చు. ...ి సమస్యలలో ఒకదాన్ని ఇతివృత్తంగా తీసు...రాయబడ్డ 'రాలిన స్వప్నం' నవల ...ంతమూ పాఠకులలో ఉత్కంఠనూ, సాను...భూ... కల్గించింది. సమాజంలో అటువంటి ఘ...ాలు ఉత్పన్నమైనప్పుడు అవసరమైతే తన...వ్యస్వాన్నిసైతం వెచ్చించి, అలాంటి పెచి...ట...మికులను కబళించాలని చూసే ఈ కసా...నుమ్యలనుండి కాపాడాలని చెపుతూ నే...ాసవుడిగా తన కర్తవ్యాన్ని ప్రబోధిస్తుందీ ...ి. రాక్షసత్వం నింపుకొని కిరాతకులైన క...యుకి తల్లీసోదరులవంటి 'గురివింద ...ల్ని' చిత్రవధచేస్తేగాని ఉపశమించని ...గంతో ఊగిపోతారు పాఠకులు. పోతే స్థూల... ఈ నవలలో మూడు ఉన్నతమైన, ఉదా...న, మరపురాని పాత్రలున్నవి. అవి, ఊహ ...నప్పట్నుండి తనవారిమధ్య పొందిన చేదు అనుభవాలు, ఎదురైన అవమానాలతో మానసికంగా ఎంతో ఎదిగి, వయసుకు మించిన పరిణతిని, విశాల దృక్పథాన్ని అలవరచుకున్న మణిపూసవంటి పూర్ణిమ, జీవన ప్రాంగణంలోని తొలిదశలోనే ఎన్నో విషాదాల్ని చేదు అనుభూతుల్ని చవిచూచి, తర్వాత అటువంటి మరోవ్యక్తి ఆలంబనగా తమ బాధాపూరితమైన మనస్సులకు ఊరట కల్గించుకోవాలని తపనపడే, 'సమాజంచేసిన దురదృష్టవంతుడు' జీవన్, మొదట్నుండీ వీరిద్దరి సుఖదుఃఖాలే తనవిగా భావించి వారిని అన్నివేళలా అన్నివిధాలా ఆదుకుంటూ, అందుకు తనవారినుండి ఛీత్కారాలు, ఈసడింపులూ, విమర్శలూ ఎదురైనా వెనుకంజ వేయక వారి క్షేమంకొరకు అహర్నిశలూ శ్రమించి స్నేహానికే ఒక ఉత్తమ భాష్యంచెప్పిన స్నేహశీలి, నిస్వార్థపరుడూ అయిన కథకుడూ, ముగ్గురికి ముగ్గురూ మణిపూసలు. వీరికి పూర్తిగా భిన్నమైన రాక్షసత్వాన్ని సమూలంగా సంతరించుకొని, తమ వేలుతో తమ కళ్లలో పొడుచుకుంటున్నామన్న జ్ఞానంసైతం నశించిన పాత్రలు మరోవైపున ఉన్నాయి.

పూర్ణిమ మేజర్ కాదని ధృవీకరించే స్కూలు సర్టిఫికేటు, లంచం తీసుకొని, ఆమె మానసిక ఆరోగ్యం సరిగా లేదని డాక్టరు సర్టిఫై చేయడంవంటివి అల్పమైన పొరపాట్లుగా అనిపిస్తాయి. పూర్ణిమ కాలేజీ చదువు కూడా చదివింది కాబట్టి అందుకు సరిపడ్డ వయసు పుట్టిన తేది ఉంటుంది. ఇహ తన మానసిక అస్వస్థత గురించి మరో డాక్టరుచే పరీక్ష చేయించవచ్చని జడ్జికి నివేదించుకోవచ్చు. ఇంకా ''కథకుడి'' పేరు, ఉద్యోగ వివరాలు తెలియజేయకపోవడం వంటివి పాఠకుడికి కొస్త వెలితిగా అనిపిస్తుంది.

ఏమైనా కరకుగుండెల్నిసైతం కన్నీరుకార్పించి, నిత్యజీవితంలో అటువంటి ప్రేమికులు ఎదురైతే వారికి అన్నివిధాల సహాయసహకారాలు అందించాలనే ప్రేరణ కల్గిస్తుంది పాఠకులకు!

-ఎ.మాధురీలత,
చింతగట్టు

# చతురత ప్రపంచం

## సమస్తం దొరికే షాపు

ప్రపంచం మొత్తంమీద అతిపెద్ద 'జనరల్ స్టోర్స్'గా లండన్‌లోని 'హేరోడ్స్'ని పేర్కొనవచ్చు. 'లేదు' అన్న సమాధానం తప్ప ఆ షాపులో మీకు ఏది కావాలన్నా దొరుకుతుంది. కుక్కలు, పిల్లులు, ఆవులు, గుర్రాలు, కోతులు, గొరిల్లాలు, నీటిగుర్రాలు, ఖడ్గమృగాలు... ఒకటనేమిటి? కస్టమర్‌కి ఏది కావాలంటే అది అరక్షణంలో లభిస్తుంది.




వంటపాత్రలనుంచి 'వాకీ-టాకీ'వరకూ, గుండుసూది నుంచి విమానంవరకూ, సౌందర్య సాధనాలనుంచి శస్త్రచికిత్సా పరికరాలవరకూ ఏది కావాలన్నా ఆ షాపులో మీకు లభ్యమవుతుంది. కేవలం బ్రెడ్... దానిమీద రాసుకునే 'చీజ్' కొన్ని వందల రకాలలో అక్కడ లభిస్తాయి. అంతేకాదు చిన్న చేపపిల్లలనుంచి పెద్ద తిమింగలంవరకూ కూడా అక్కడ ఖరీదు చేయవచ్చు. ఇంకా అక్కడ

137 ఏళ్లక్రితం ఓ చిన్న బట్టల్గా ప్రారంభమైన ఆ స్టోర్సు ప్రస్తుతం 16 ాల విస్తీర్ణంలో 11 ప్రధాన ద్వారాలతో 2 ంపై క్సులతో అలరారుతోంది. 5000 మవరకూ ఉద్యోగులు అక్కడ పనిచేస్తున్నార ీరుకాక మరో 1000 మంది ఉద్యోగుల ీస్టమర్స్ తాకిడిని తట్టుకునేందుకని పం సీజన్లలో నియమిస్తుంటారు. నిత్యం ఆ ోకి 25,000 నుంచి 30,000 మందివరకూ ుర్స్ విచ్చే స్తుంటారు. వారిలో రూపాయి ఃవచేసే శాల్తీ నికొనే సామాన్యులనుంచి లః ఖరీదుచేసే వస్తువుల్ని కొనే కోటీశ్వరులఃహా ఉంటారు.

ఆ షాపుకి స్థానిక కస్టమర్లేకాక విదేశీ కస్టమర్లు కూడా వస్తుంటారు. కొందరు విదేశాల నుంచి ఫోన్‌చేసి తమకు కావాల్సిన వస్తువుల్ని విమానాల ద్వారా తెప్పించుకుంటారు. అయితే రవాణాఛార్జీలు కస్టమర్సే భరించాల్సి వుంటుంది. ఓసారి ఓ జపనీస్ కస్టమర్ తనకో జేబురుమాలు కావాలని టోక్యోనుంచి ఫోన్ చేశాడు. రుమాలు ఖరీదు కేవలం 17 రూపాయలే అయినా, విమానంలో దాన్ని వంపినందుకుగాను మరో 300 రూపాయలు అదనంగా అతనినుంచి వసూలు చేశారు షాపువాళ్లు.

బ్రిటీష్ మహారాణి వంటి ప్రముఖులు కూడా ఆ షాపునుంచే తమకు కావాల్సిన వస్తువుల్ని ఖరీదు చేస్తుంటారు. రాజకుటుంబీకులు, సినీయాక్టర్లు, రచయితలు కొందరు స్వయంగా వెళ్లి అక్కడ షాపింగ్ చేస్తారు. అలాంటి ప్రసిద్ధ వ్యక్తుల్ని చూడడానికని అనేకమంది ప్రజలు నిత్యం ఆ షాపుచుట్టూ తచ్చాడుతుంటారు. దేశదేశాలవారిని ఆకర్షించే ఆ షాపు టర్నోవర్ 300 కోట్ల రూపాయల పైమాటేనట!

## చప్పట్ల ఓటింగ్

**మూ**డు ముణ్ణాళ్లకీ జరగడంవల్ల ఎలక్షన్లంటే ఆబాలగోపాలానికీ నేడు ఆమూలాగ్రం తెల్సిపోయింది. రాజకీయనాయకుల వాగ్దానాలు నేతిబీరకాయలోని నెయ్యిలాంటివనీ, ఎన్నికల రోజుల్లో తప్ప మరెప్పుడూ వారికి ప్రజల



ఊసే గుర్తుండదనీ పాలుతాగే పసిపిల్లలకి కూడా ఈనాడు తెల్సిపోయింది.

పూర్వకాలంలో ఈ ఎలక్షన్లు ఎలా ఉండేవంటే- ప్రజలంతా ఓ నిర్ణీతదినంనాడు ఓ ప్రదేశంలో సమావేశం అయ్యేవారు. వారిలో నాయకత్వం చేపట్టదల్చిన అయిదు లేక ఆరుగురు వ్యక్తులు లేచి వరుసగా తాము చేపట్టబోయే జనహిత కార్యక్రమాల గురించి చెప్పేవారు. వాగ్దానాలు చేసేవారు. ఆ ఉపన్యాసాలకు తగ్గట్టుగా ప్రతిస్పందిస్తూ ప్రజలు చప్పట్లు కొట్టేవారు. ఆ లెక్కన ఎవరికెక్కువ చప్పట్లు పడితే వారికే నాయకత్వం లభించేది.

కొందరు వ్యక్తులు ఈ తతంగాన్ని నిశితంగా పరిశీలిస్తూ ఎవరికెక్కువ చప్పట్లు పడ్డాయో నిర్ధారించేవారు.

రోమనుల, గ్రీకులకాలంలో స్త్రీలకి ఓటుహక్కు లేదు. కాని ఒకరోజు వయసున్న బాలుడు కూడా ఓటుకి అర్హుడే! ఆ కాలంలో బాలెట్‌పేపర్లు, రహస్య ఓటింగ్ విధానాలూ ఉండేవికాదు. అంతా ప్రజల సమక్షంలోనే బహిరంగంగా జరిగేవి. ఇనుపగోలీలు, గులకరాళ్లు, కొయ్యముక్కలు... ఇలా రకరకాల వస్తువులు ఒక్కో అభ్యర్థికి ఒక్కొక్కరకం కేటాయించేవారు. ఏ అభ్యర్థికి ఏ వస్తువులు కేటాయించిందీ ప్రజలందరికీ స్పష్టంగా చెప్పేవారు. తర్వాత ఆయా వస్తువుల్ని వేరువేరు కుప్పలుగా ఒక అరుగుమీదపోసి ఆ ప్రక్కనే ఓ ఖాళీపెట్టెను ఉంచేవారు. ప్రజలు వరుసగా వెళ్లి తమకు నచ్చిన అభ్యర్థికి సంబంధించిన గుర్తును ఆ పెట్టెలో పడేసి వచ్చేవాళ్లు. లెక్కింపు తర్వాత పెట్టెలో ఎక్కువ ఏ వస్తువులున్నాయో ఆ అభ్యర్థి గెల్చినట్లుగా ప్రకటించేవారు. ఉదాహరణకి ఇనుపగోలీలు అన్నింటికన్న ఎక్కువ వస్తే అవి కేటాయింపబడ్డవ్యక్తి గెలిచినట్లు లెక్క.

అటుతర్వాత 200 ఏళ్లకి ఎన్నికల విధానంలో మరికొన్ని మార్పులు వచ్చాయి. ఇనుపగోలీలు, గులకరాళ్లకుబదులు, ఒకేసైజు కొయ్యముక్కలు రంగురంగులవి ఉపయోగించడం మొదలెట్టారు. ఒక్కో అభ్యర్థికి ఒక్కో రంగును కేటాయించి, ఓటింగ్ అనంతరం పెట్టెలో ఏ రంగుముక్కలు ఎక్కువగా వుంటే ఆ రంగును కేటాయించబడ్డ వ్యక్తి గెల్చినట్లుగా తేల్చేవారు. గమ్మత్తేమిటంటే- ఈ విధానాన్నే కొన్ని యూరోపియన్ క్లబ్బులలో జరిగే ఎలక్షన్లలో నేటికీ పాటిస్తున్నారు. తర్వాత తర్వాత రహస్య ఓటింగ్ విధానం ఆస్ట్రేలియాలో మొదలైంది.

19వ శతాబ్దంలో బ్రిటిష్ ప్రభుత్వం రహస్య ఓటింగ్ విధానంతోపాటు మరికొన్ని ఎన్నికల సంస్కరణలని ప్రవేశపెట్టింది. ఓటరు వయో పరిమితిని 21 నుంచి 18 ఏళ్లకి తగ్గించిన ఘనత కూడా ఆంగ్లేయులదే! నేడు 150 దేశాలలో రహస్య ఓటింగ్ విధానం అమలులో వుంది. ఏవో అతికొద్దిదేశాలు తప్ప ప్రపంచదేశాలన్నీ స్త్రీలకి కూడా ఓటింగ్ హక్కును ఇచ్చాయి. ఆస్ట్రేలియా, బెల్జియమ్ దేశాలలో ఓటు వేయకపోతే దాన్ని నేరంగా పరిగణించి మూడేళ్ల జైలుశిక్ష విధిస్తారు. అమెరికాతో కలిపి మరో ఏడు దేశాలలో మాత్రమే ఎలక్ట్రానిక్ ఓటింగ్ పద్ధతులు పాటిస్తున్నారు. మిగిలిన అన్ని దేశాల్లోనూ మనదేశంలోలాగే ఎన్నికలు జరుగుతున్నాయి.

## ఇసుకలో కూరుకుపోతున్న ఊరు

ఆ గ్రామంలోని కరెంట్ స్తంభాలు, టెలిఫోన్ స్తంభాలు, భూమికి ఒకటి రెండు అడుగుల ఎత్తులోనే ఉంటాయి. ఇళ్లకప్పులైతే సరేసరి... మన పిల్లకాయలు సైతం ఒక్క గెంతులో వాటిపైకెక్కి కూర్చోగలరు. అరే... ఇదేదో లిల్లీపుట్ల గ్రామంలా ఉన్నట్లుందే అనుకొంటున్నారుగదూ? అదేంకాదు. అక్కడ నివసించే ప్రజలు మనలాంటివాళ్లే.

అసలు విషయమేమంటే సముద్రతీరంలో ఉండడంవల్ల తీరంలోని ఇసుకంతా గాలికి కొట్టుకొచ్చి ఆ గ్రామం మొత్తాన్ని ముంచెత్తుతోంది. ఫలితంగా ఇళ్లు, కరెంట్ స్తంభాలూ ఇసుకలో కూరుకుపోయాయి. కొన్ని మేడలలోనైతే మనుషులు పైఅంతస్తులలోనే ఉంటున్నారు. క్రిందిభాగం మొత్తం ప్రహరీ గోడలతోసహా ఇసుకలో కప్పెట్టుకపోయాయి. ఇప్పటికీ గాలివీచినప్పుడల్లా తట్టలకి తట్టలు ఇసుక ఉవ్వెత్తున లేచి ఇళ్లల్లో కొచ్చిపడుతోంది. చివరికి ఆ ఇసుక కారణంగా కడుపునిండా సరైన తిండి కూడా తినలేకపోతున్నారక్కడి ప్రజలు. కంచాల్లో అలా అన్నం వడ్డించుకున్నారో లేదో రివ్వున వీచేగాలి కారణంగా చేటలతో పోసినట్లే ఇసుక వచ్చి కంచాల్లో పడిపోతోంది.

ఒకరకమైన విచిత్రగాలుల కారణంగానే ఇలాంటి ఉపద్రవం సంభవిస్తోందని తెలియ






వస్తోంది. ప్రజానాయకులు, ప్రభుత్వాధికారులు వచ్చి ఆ గ్రామాన్ని సందర్శించి వెళ్తున్నారే తప్ప, పరిష్కారం విషయం మాత్రం పట్టించుకోవడంలేదు. ప్రజలు ఎన్నెన్నో విజ్ఞప్తులు సమర్పించుకుంటున్నా ఫలితం ఉండడంలేదు. పాతిక ముప్ఫయి సంవత్సరాల క్రితం ఎక్కడో సముద్రతీరాన మేటవేసుకొని ఉండే ఇసుకతిన్నెలు నేడు సరాసరి ఊళ్లోకే వచ్చి తిష్టవేశాయి. ఫలితంగా ఇళ్లూ వాకిళ్లూ ఇసుకలో కూరుకుపోతున్నాయి. కొద్దో గొప్పో అయితే ఊడ్చుకుంటారుగానీ టన్నులు టన్నులుగా వచ్చిపడే ఇసుకని ఎవరు మాత్రం ఊడ్వగలరు?

ఇంతకీ ఆ గ్రామం ఎక్కడ వుందో చెప్పనేలేదుగదా? అక్షరాలా భారతదేశంలోనే తమిళనాడు రాష్ట్రంలో ఉంది. ఆ ఊరిపేరు కూడుత్తలై. "మా శవాలు కూడా ఈ ఇసుకలో కప్పెట్టుకపోయాకే ఈ ప్రభుత్వాలు కళ్లు తెరుస్తాయి" అని వాపోతున్నారు అక్కడి ప్రజలు.

## తోకచుక్క వ్యాపారులు

'**తో**కచుక్క దేశానికి అరిష్టం' అనే నమ్మకం మన దేశంలోనే కాదు దాదాపు ప్రపంచదేశాలన్నింటిలోనూ వుంది. ముఖ్యంగా 76 ఏళ్లకోసారి దర్శనమిచ్చే 'హేలీ' తోకచుక్క అత్యంత అరిష్టదాయినిగా ప్రపంచ ప్రజలంతా విశ్వసిస్తున్నారు. గతంలో 1910లో అది కనిపించినప్పుడు ప్రళయం సంభవించనున్నదని అంతా భయపడ్డారు. ప్రజల భయాందోళనలను సొమ్ము చేసుకోవాలని కుహనాజ్యోతిష్కులు, వ్యాపారులు కలిసి 'హేలీ'ని భూతంగానూ, రాకాసిగానూ అభివర్ణిస్తూ పుకార్లు పుట్టించారు. దానినుంచి రక్షణ పొందడానికి ఫలానా తాయెత్తును కట్టుకోండనో, ఫలానా ఔషధం సేవించండనో ప్రచారాలుచేసి కోట్లు ఆర్జించారు. ఈ తరహా వ్యాపారాలు ప్రపంచం మొత్తంమీద ఒక్క అమెరికాలోనే అధికశాతంలో జరిగాయి.

ఆ తర్వాత 1986లో 'హేలీ' మళ్లీ ప్రత్యక్షమైనప్పుడూ ఇదే తతంగం మరింత భారీఎ

త్తున పునరావృతం అయింది. శాస్త్రవేత్తల అంచనా ప్రకారం ఆ తోకచుక్కకి భూమికి మధ్యదూరం 23 కోట్ల కిలోమీటర్లు. దానివల్ల భూగోళానికిగానీ, దానిపై నివసించే జీవరాశికి గానీ ఎలాంటి హానీ సంభవించదు. అయినా విషపూరితగాలులు తోకచుక్కనుండి ఉద్భ వించి మానవాళికి హానికరంగా పరిణమిస్తా యనే భయాలు ప్రజలలో సృష్టించి రకరకాల మందులు, టాబ్లెట్లుకొని అమ్ముకొని కోట్లు

పేరుతో వచ్చిన వీడియోగేమ్ కేసెట్స్ లక్షల సంఖ్యలో అమ్ముడయ్యాయి. 'సముద్రంనుంచి తోకచుక్కను దర్శించండి' అంటూ కొన్ని టూరి స్టు కంపెనీలు ప్రత్యేక ఓడల్ని ఏర్పాటుచేసి సందర్శకుల్ని నడిసముద్రం మీదకు తీసుకు పోయి తోకచుక్కని చూపించాయి. తద్వారా ఆయా కంపెనీలు కోట్లాది రూపాయలు ఆర్జించాయి. ''మళ్ళీ హేలీ కన్పించేనాటికి అంటే 2062 నాటికి మీరు ఊహించనంత



గడించారు వ్యాపారులు. ముందుచూపుగల కొన్ని అమెరికన్ వ్యాపారసంస్థలు 'హేలీ', 'తోకచుక్క' వంటి పేర్లను రిజిస్టర్‌చేసి ఆ తర్వాత అధిక మొత్తాలకు ఆ పేర్లను మందుల కంపెనీలకు అమ్ముకున్నాయి. 'హేలీ' పేరుతో టీ-షర్టులు, బ్యాడ్జీలు, బ్యాగ్ లు లక్షల సంఖ్యలో అమ్ముడయ్యాయి. అదేరో జుల్లో 'పిన్ ది టేల్ ఆఫ్ ది కామెట్' అనే

సొమ్ము మీ చేతుల్లో పోస్తాం'' అని 'హేలీ' పేరుతో పేర్ల అమ్మకాలు సాగించాయి కొన్ని సంస్థలు. ఆ రకంగా వ్యాపారులు 'కాదేదీ వ్యాపారానికనర్హం' అంటూ తోకచుక్కని కూడా వ్యాపారానికి వాడుకొంటున్నారు. పాపం 'హే లీ'ని కనిపెట్టిన 'ఎడ్మండ్ హేలీ'గారికి ఈ వ్యాపారులు ఆర్జించిన లాభంలో లక్షోవంతు కూడా ఆనాడు దక్కివుండదు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291 Anantapur-22977

